# సాహిత్య దృక్పథం

(సాహిత్య విమర్శ వ్యాసాలు)

వి. చెంచయ్య




**విరసం**

**నెల్లూరు జిల్లా యూనిట్**

**2001**

సాహిత్య దృక్పథం
(సాహిత్య విమర్శ వ్యాసాలు)

విరసం నెల్లూరు జిల్లా యూనిట్ ప్రచురణ
తేది : 14-01-2001

వెల : రూ. 25/-

కాపీలు : 1000

కాపీలకు :

వి. చెంచయ్య
6-5-13
పిన్నంరాజువారి వీధి
కావలి - 524 201
నెల్లూరు జిల్లా
ఫోన్ · 08626-42277

నవోదయ బుక్ హౌస్
ఆర్యసమాజ భవన్ ఎదురుగా
కాచిగూడ - హైదరాబాద్

దిశ పుస్తక కేంద్రం
త్రినేత్ర సూపర్ మార్కెట్ ఎదురుగా
చిక్కడపల్లి
హైదరాబాద్ - 500 020

ముద్రణ :

నాగేంద్ర ప్రెస్
విజయవాడ-2. ఫోన్ : 432077

# విషయసూచిక

# సునిశిత దృష్టి

సాహిత్య వ్యాసం, పరిచయం, సమీక్ష - స్థూలంగా సాహిత్య విమర్శ - సృజనాత్మక సాహిత్యాన్ని పాఠకులు మరింత స్పష్టంగా అర్థం చేసుకోవడానికి, ఆయా సృజనాత్మక రచయితలు ఉద్దేశించిన అవగాహనను, భావాలను ఫోకస్ చేయడానికి, సాహిత్య సిద్ధాంతాలను, ప్రయోజనాలను విశ్లేషించి వివరించడానికే అవసరం. నిజానికి అటువంటి సాహిత్య విమర్శ వ్యాసాలకు మళ్లీ ఒక పరిచయం అక్కర్లేదు. అందులోను సూటిగాను, స్పష్టంగాను చెప్పడంలో ఒక సుశిక్షితమైన నిరంతర విద్యార్థిలా కనిపించే చెంచయ్య గారి వ్యాసాలకు ఏ సిఫార్సు అవసరం లేదు.

లోటల్లా చెంచయ్యగారు ఈ వ్యాసాలను కెవిఆర్ బతికుండగా, టిఎంఎస్ విరసంలో ఉండగా కనీసం రాస్తూ ఉండగా తెచ్చి ఉంటే ఇంకా బాగుండుననేదే సాహిత్య విమర్శలో ఆయన ఆ ఇద్దరికీ దశాబ్దాల పరోక్ష అనుయాయి ఒక పనిగా రెండున్నర దశాబ్దాలు ఆయన సాహిత్య విమర్శలో కృషి చేసారు. ఈ విషయంలో కెవిఆర్ గారు ఆయన మీద ఒక కన్నేసి విరసంలోకి, 'అరుణతార' సంపాదక బాధ్యతలోకి తీసుకొని వచ్చారు. అయితే ఈ వ్యాసాలు చదివితే ముఖ్యంగా ఆ ఇద్దరి శైలికి భిన్నమైంది చెంచయ్య గారి శైలి. కెవిఆర్ సాహిత్య విమర్శకు చరిత్ర బరువు ఎక్కువ. టిఎంఎస్ సాహిత్య విమర్శకు తాత్విక గాఢత ఎక్కువ చెంచయ్యగారు ఈ రెంటినీ జీర్ణం చేసుకొని సామాన్య పాఠకులకు విషయాన్ని పండొలిచినట్లు చెప్పడానికి ప్రయత్నిస్తారు.

ఈ సంకలనంలో పద్యం గురించి రెండు వ్యాసాలు ఉన్నాయి. ఒకటి 1993 జూన్‌లో 'అరుణతార' కు రాసిన సంపాదకీయం - విప్లవ భావాలకు పద్యం వాహిక కాలేదు. రెండవది 'పద్యకవితా పరిచయం' అనే బేతవోలు రామబ్రహ్మం (బేరా) గారి పుస్తకానికి 'ఇన్‌డిఫెన్స్ ఆఫ్ క్లాసికల్ పాయిట్రీ' అనే శీర్షికతో చేరాగారు రాసిన ముందుమాట సమీక్ష - చారిత్రక దృక్పథం లోపించిన 'చరిత్రాత్మకమైన' చేరాపీఠిక (చేరాపీఠికను చరిత్రాత్మకమైనదిగా బేరాగారు భావించారు) దీని రచనాకాలం జూన్ 98.

మొదటి వ్యాసం రాసే నాటికి పద్యం భవిష్యత్తును గురించి, దాని స్వరూప స్వభావాల గురించి ఆంధ్ర జ్యోతి, ఆంధ్ర ప్రభ, ఉదయం దిన పత్రికల్లో తీవ్రంగా చర్చ జరుగుతున్నది. అందులో కూడ చేరా, బేరా పాల్గొన్నారు ఐదేళ్ల తర్వాత ఇంక పద్యం భవిష్యత్తును తేల్చేసామని దానికి ఢోకా లేదని భావించి ఈ పుస్తకమూ, పీఠికా (కేవలం ఇది ప్రక్రియకే పరిమితం కాకుండా ఇన్‌డిఫెన్స్ ఆఫ్ క్లాసికల్ పాయిట్రీగా) వెలువడినాయి. కనుక ఈ రెండు సందర్భాల్లోనూ చర్చలో పాల్గొన్న అందరిలోనూ లోపించిన చారిత్రక దృక్పథంతో చెంచయ్యగారు సమాధానం ఇచ్చారు.

పద్యపునరుద్ధరణ తాపత్రయం వెనుక, బాబ్రీమసీదు విధ్వంసం వెనుక బ్రాహ్మణీయ హిందూ భావ జాలమే ఉందని రెండు వ్యాసాల్లోనూ ఆయన చాలా సులభంగానూ సూటిగానూ ప్రతిపాదిస్తారు. సామాన్యంగా తాత్విక సూత్రీకరణలు చేయడం చెంచయ్య గారి స్వభావం కాదు. కాని పద్య [illegible]లో దాగి వున్న బ్రాహ్మణీయ భావజాలాన్ని conceptualise చేయకుండా ఉండలేకపోయారు. ఇక్కడ కెవిఆర్, టిఎంఎస్‌లలోని చారిత్రక, తాత్విక దృష్టి ఎంతో సులభమైన [illegible]మైన పద్ధతిలో ఆయన సొంతం చేసుకున్నారు.

చేరా గురించి చెంచయ్యగారు చేసిన పరిశీలన, విశ్లేషణలకు నేను కూడ ఇక్కడ రెండు మాటలు చేర్చాలి చేరాతల్లోగానీ,ఈ పీఠికలో గానీ, ఇటీవలి కాలంలో ఆయన తన రచనల్లో మాటల్లో తాను భాషా శాస్త్ర, కవిత్వ గుణ ప్రమాణాలతోనే అంచనా వేస్తున్నారు గానీ భావజాల, వస్తు దృష్టితో కాదని చేరాగారు చెప్తుంటారు విశ్వనాథ కవిత్వం గురించో, భావ కవిత్వం గురించో మాట్లాడినపుడు మనకు కావచ్చుననే అనిపిస్తుంది. కాని స్త్రీ వాద కవిత్వం దగ్గరికి వచ్చేసరికి అక్కడాయన మొగ్గు వాదం వైపే. అదీ ఎంత అభినివేశం కలదంటే కొండేపూడి నిర్మల కవిత్వంలో సామ్రాజ్యవాద వ్యతిరేకత రూపంలోనో, రాజ్యహింసఖండనగానో అని వ్యక్తమవుతే అది 'వామ/విప్లవ పక్ష రాజకీయంగా కవిత్వానికి ఆటంకమైనట్లుగా సున్నితంగా కనపడుతారు. పద్యాన్ని ఒక రూపంగా, ఒక ప్రక్రియగా, విప్లవంతో సహా అన్ని భావాలకు పనికి వచ్చేదిగా డిఫెండ్ చేయబోయి ఆయన పద్యాన్నే కాదు క్లాసికల్ పొయెట్రీని ఏకంగా డిఫెండ్ చేసాడు క్లాసికల్ పొయెట్రీ అన్నపుడు - అది కేవలం రూపపరమైన పద్యమే కాదు ముఖ్యంగా ప్రాచీన తెలుగు సాహిత్యంలో నన్నయ ప్రారంభించిన క్లాసికల్ పొయెట్రీని మార్గపద్ధతి - అంటే భావజాలపరంగా- వైదిక, పారక పరంగా రాజాస్థాన పండిత, రూపపరంగా - సంస్కృత వృత్త - పద్య పరంగా వ్యక్తమయ్యే ఒక ప్యాకేజి స్కీం. దాని మీద తిరుగుబాటుగానే రాజాస్థానాలబయట 'చాపకూడు' ఏర్పాటు చేసి మరీ దేశీ పద్ధతిలో పాల్కురికి సోమన వంటి వాళ్లు 'అవైదిక' (వీరశైవ) భావజాలాన్ని ప్రచారం చేయ గలిగారు. కనుక పద్యాన్ని డిఫెండ్ చేసే భ్రమలో చేరా గారు క్లాసికల్ పొయెట్రీని డిఫెండ్ చేసాక ఇంక చేరా గారు 'పాతివ్రత్య' వ్యతిరేక స్త్రీవాదాన్ని చెప్పే పునాదిని కోల్పోయినట్లే. చెంచయ్యగారు చాలా సున్నితమైన వ్యంగ్యంలో అదే గుర్తు చేస్తారు (పద్యమంటే బేరాగారు చెవి కోసుకుంటారు, చేరాగారు రెండు చెవులూ కోసుకుంటారు.) చేరాగారు పద్యాన్ని డిఫెండ్ చేయబోయి తాను నమ్మిన భావజాలాన్ని పణం పెట్టాల్సి వచ్చింది.

మళ్లీ చెంచయ్యగారి సాహిత్య విమర్శ పద్ధతికి వస్తే - ఆయనకు ఈ సూటిగా సులభంగా, సరళంగా చెప్పే పద్ధతి - ఆరంభంలో హేతువాద దృష్టి నుండి, అది సకాలంలో - ముఖ్యంగా ఎమర్జెన్సీ ఆరంభంలో విరసంలో చేరుకున్న సందర్భంలో గతితార్కిక దృక్పథంగా పరిణతి చెందడం నుండి వచ్చింది. ఆయనే తన వ్యాసాల్లో చాలా సందర్భాల్లో చెప్పినట్లు హేతువాదుల తర్కం మాత్రమే వాస్తవాన్ని - వస్తు గత సారాన్ని వెలికి తీయజాలదు. దానికి గతితార్కిక దృష్టి కావాలి. ఆగతి తార్కిక దృష్టికి చారిత్రక భౌతిక వాదం పునాది కావాలి. రచయిత స్వేచ్ఛ గురించి మల్లాది వెంకట కృష్ణమూర్తికి సమాధానం చెప్పే సందర్భంలో గానీ, పద్యంపై వ్యాసాల్లోగానీ, సాహిత్యాన్ని ఎలా అధ్యయనం చేయాలి - అని డిటిఎఫ్ సావనీర్‌కు రాసిన వ్యాసంలో గానీ ఆయన ఈ విశ్లేషణ పద్ధతి అద్భుతంగా వ్యక్తమవుతుంది.

నిజానికి ఆరంభిస్తూనే చెంచయ్య గారి శైలి గురించి నా ప్రశంసతో మొదలు పెడదామనుకున్నాను. కాని చెంచయ్య గారికి ఏమంత నచ్చని చలం గారితో ఒక్క విషయంలో నాతో ఏకీభవిస్తారనుకుంటాను. ఎవరి శైలి అయినా బాగుండడానికి అసలు కారణం - అందులో ఇమిడి వున్న రహస్యం- వాళ్లు చెప్పదలుచుకున్న విషయం పట్ల వాళ్లకు పూర్తి అవగాహన ఉండడం, ప్రగాఢమైన విశ్వాసం ఉండడం. ఆ విషయం వాళ్ల మనసులో చాలా స్పష్టమైన రూపంలో ఆకృతి దాల్చి వుంటుంది కనుక దాని వ్యక్తీకరణ అంత స్పష్టంగా సాధ్యమౌతుంది. ఈ వ్యాసాలన్నింట్లోనూ కనిపించే ఒక ప్రధానమైన లక్షణం- చెంచయ్య గారికి ఆయన చెప్ప దలుచుకున్న విషయాలపై

స్పష్టమైన అభిప్రాయాలు ఉండడం. ఆ అభిప్రాయాలకు అవసరమైన లేదా అనుగుణమైన అధ్యయనం ఆయనకున్నది. ఆ అభిప్రాయాలను, అధ్యయనాన్ని ఆయన ప్రాపంచిక దృక్పథం గీటు రాయిపై పరీక్షించుకున్నాడు ఆ తర్వాతే రాసాడు అటువంటి సందర్భాల్లో మల్లాది వెంకట కృష్ణమూర్తి కైనా, చేరాకైనా, దాముకైనా ఆయన ఉపయోగించే తూనికరాళ్లు మార్క్సిస్టు అవగాహననుంచి లభించినవే.

క్రిస్టాఫర్ కాడ్వెల్ - లిబర్టీ గురించి ఒక వ్యాసంరాసాడు. జాన్‌స్టువర్ట్ మిల్ మొదలు కొని బెర్నార్డ్ షా వరకు స్వేచ్ఛ గురించి ఎంత ఉదారవాద లేదా ఉటోపియా ఊహల్లో తేలి పోతున్నారో చెప్పి వర్గ సమాజంలో స్వేచ్ఛకు కూడ ప్రాతిపదిక ఉత్పత్తి సంబంధాల్లో ఉంటుందని నిష్కర్ష చేస్తాడు. మరొక సందర్భంలో కుటుంబరావు గారు ఇజం నుంచి వేరుచేసి నిజాన్ని ఆవిష్కరించాలనుకునే వాళ్లంతా కమ్యూనిజంలోని నిజాన్ని చూసి జడుస్తున్నవాళ్లే అని చెప్తాడు. కుటుంబరావుగారికి ఉండే సునిశితమైన, సున్నితమైన వ్యంగ్య ధోరణిలో కాడ్వెల్‌ను, కొకును కూడ ఒకే మారు జ్ఞాపకం చేసుకునేలా చెంచయ్యగారు రచయితలు ఆశించే స్వేచ్ఛకు - సమాజంరచయితల పైపెట్టే బాధ్యతకు ఉండే గతితార్కిక సంబంధాన్ని గురించి ప్రతిపాదిస్తారు. ఎంగెల్స్ ఎంతో ఉన్నతమైన తాత్విక స్థాయిలో చెప్పిన స్వేచ్ఛకూ అవసరానికీ ఉండే అవినాభావ సంబంధాన్ని అర్థం చేసుకుంటే తప్ప సమాజ స్వేచ్ఛలోను, బాధ్యతలోను ఇమిడి వున్న రచయిత బాధ్యతను స్వేచ్ఛగా స్వీకరించడం నేర్చుకోలేం. 'రచయితల బాధ్యత' వ్యాసంలోనూ, ఓల్గాకు సమాధానం ఇచ్చిన 'స్వేచ్ఛ అంటే పురోగమనం' వ్యాసంలోనూ - ఒకే నాణానికి రెండు పార్శ్వాలైన సామాజిక బాధ్యత - రచయిత స్వేచ్ఛ అనే అంశాలను చెంచయ్యగారు ప్రతిపాదించారు.

'ప్రవాహగానం' పై చర్చా - తీరు తెన్నులు సంపాదకీయం చాలచర్చకు మాత్రమే కాదు వివాదానికీ దారి తీసింది. 'ప్రవాహగానం' కవిత్వాన్ని, దామును అడ్డం పెట్టుకొని విప్లవోద్యమంపై, విరసంపై దాడి చేయడానికి, ఆ తర్వాత కాలంలో స్థిరపడుదామనుకున్న 'హో' వాదులు చాలా ప్రయాసపడ్డారు. ఆశ్చర్యంగా చెంచయ్య గారు దాములోని అనుకూల (మార్క్సిస్టు) అవగాహనతోనే వాళ్లందరికీ సమాధానం చెప్పడానికి ప్రయత్నించారు. వాళ్లందరూ వాళ్ల వాళ్ల శిబిరాల్లో ఆ తర్వాత కాలంలో స్పష్టంగా బయటపడినారు. అయితే ఈ చర్చ 'దాము'ను కూడ విప్లవ శిబిరంలో నిలపలేకపోయిందని ఇటీవలి ఆయన రాసిన 'నాలుగోవాడు' కవిత చదివితే నాకనిపించింది పీపుల్స్ వార్ అగ్రనేతలు ముగ్గురిని బెంగుళూరులో అరెస్టు చేసి, హైదరాబాదులో చిత్రహింసలు పెట్టి చంపి, కొయ్యూరు అడవుల్లో వాళ్ల శవాలు పడవేసారు. ఇది నిజమైన ఎన్‌కౌంటర్ అని నమ్మించడానికి ఎల్లారెడ్డిపేట మండలం గర్జన పెల్లిగ్రామానికిచెందిన లక్ష్మి రాజం అనే యువకుడ్ని ఇంటి నుంచి పట్టుకొని వెళ్లి కాల్చి చంపి ఈ శవాల పక్కన పెట్టారు, లక్ష్మి రాజం పశువులు కాసుకుని బతికే దళితుడు. అంతే కాదు ఆ గ్రామంలో మిలిటెంటు విప్లవచైతన్యంతో ఉపదళ కార్యకలాపాల్లో పాల్గొంటూ ఏమీ ఎరుగనట్లు ఊర్లోకి వచ్చి పశువుల కాపరిగాబతుకుతున్నాడు. ఇటువంటి విషయాలు స్థానిక ప్రజలకు తెలుస్తాయి,వాళ్లలోనే రహస్యంగా పొంచిఉండే ఇన్ ఫార్మర్లకు తెలుస్తాయి, అందువల్ల పోలీసులకు తెలుస్తాయి కనుక పోలీసులుకూడ 'ఊరికెనే' లక్ష్మిరాజంను చంపి 'అరుణ్' అని పేరు పెట్టలేదు. 'ఎన్‌కౌంటర్' గా ఖండించిన సందర్భాల్లో గానీ, జోహార్లు చెప్పిన సందర్భంగా

గానీ విప్లవోద్యమమైనా, విప్లవ సాంస్కృతికోద్యమమైనా, విరసం అయినా ఈ నలుగురికీజోహార్లు చెప్పింది ఒక విప్లవ నిర్మాణానికి, ఉద్యమానికి వీళ్లు చేసిన సేవాపరంగా ప్రస్తావించిన సందర్భంలో మాత్రమే సహజంగా ఆ ముగ్గురు అగ్రనేతల గురించి తెలుసు గనుక ఎక్కువ మాట్లాడడం జరిగింది. ఇందులో పశువులకాపరి అయిన నాలుగోవాణ్ని దళితుడుగా ఉపేక్షించడమనే ప్రస్తావనలేదు. ఆ మాట కొస్తే రోజా 'ఎన్‌కౌంటర్ల' లో అమరులవుతున్న వాళ్లలో ఎనభై శాతం దళితులే. వాళ్లంతా దళిత చైతన్యంతో కాదు విప్లవ చైతన్యంతో అమరులవుతున్నారు. 'దాము'కైనా వాళ్లెవరి గురించీ కాకుండా లక్ష్మీ రాజం గురించే రాయాలని ఎందుకనిపించింది ? ఆ ముగ్గురి పక్కన నాలుగో శవంగా ఉన్నపుడు మాత్రమే దళిత వ్యక్తిత్వం ఎందుకు కనిపించింది ? చెంచయ్యగారి వ్యాసంలోని దూరదృష్టికి, తీర్పుకు ఇది దాఖలానా ?

స్థూలంగా చెంచయ్యగారి వ్యాసాలు - సాహిత్యాన్ని అధ్యయనం చేయ దల్చుకున్న సాహిత్య ప్రవేశకులకు చక్కటి మార్గదర్శకాలు. సాహిత్యాన్ని ఎలా అధ్యయనం చేయాలో చెప్తూనే (ఇదే శీర్షికతో డిటిఎఫ్ సావనీర్‌లో రాసిన వ్యాసం చదువుతుంటే ఆ శైలి, వ్యంగ్యం, ప్రతిపాదనలు ఎన్నో సందర్భాల్లో నాకు కొకు వ్యాసం చదువుతున్నానా అనిపించింది) విప్లవ సాహిత్యం - విప్లవేతర సాహిత్యం - పరిశీలనల వింగడింపుగా ఇందులో రెండు భాగాలుగా ఉన్నాయి.

విరసం సభ్యులు, విప్లవ సాహిత్యాభిమానులు - ఏది సరియైన సాహిత్యం, కానిదేది అని గ్రహించడానికి, ఆకళించుకోవడానికి చాలా అనుకూలమైన పరికరాలను చెంచయ్యగారు ఈ వ్యాసాల్లో అందించారు.

నా జనరేషన్ అని కాకపోయినా బహుశా నా నేపథ్యం, అధ్యయనం వల్ల అనుకుంటాను - చెంచయ్య గారి వలె చలం, జాషువాల గురించి నేను అంత నిష్కర్ష చేయలేననిపిస్తున్నది. బాల్యం అని చెప్పదగిన వయసులోనేశ్రీశ్రీ, కాళోజీ, దాశరథి కవిత్వాలతో పాటు నేను జాషువా ఫిరదౌసి, గబ్బిలం కావ్యాలతో చాలప్రభావి తున్ణయ్యాను. ఆ కాలం అటుతెలంగాణా సాయుధ రైతాంగ పోరాట కాలమే అయి నప్పటికీ, అప్పుడు నా మీదున్నది సాహిత్యంలో గురజాడ, కందుకూరి సంస్కరణవాద ప్రభావం మాత్రమే కాదు - జాషువా వంటి వేదన కూడ - అది 'గబ్బిలం' లో అంటరాని తనానికి వ్యతిరేకంగా వ్యక్తం కావచ్చు, ఫిరదౌసిలో రాజరికానికి వ్యతిరేకంగా వ్యక్తం కావచ్చు. అందులో మనిషి, కవి వ్యక్తిత్వం ధిక్కార భావంతోనే నాకు ద్యోతకమవుతాయి.

అట్లే చలంలో ఉన్న చలచ్చంచల వైరుధ్యాల్లో నన్ను నవ యవ్వనంలో పట్టినవి స్త్రీల పట్ల, పిల్లల పట్ల ఆయనకున్న ప్రేమ, స్నేహ పూర్వక గౌరవ భావం. అందువల్ల ఆయన కోరుకున్న స్వేచ్ఛ ఆయన వ్యక్తి వాదంలో నాకు స్వ (వెస్టెడ్) ప్రయోజనం కనిపించలేదు.

ప్రభావాల వల్ల ఏర్పడిన ఈ ఇంప్రెషన్స్‌ను ఉంచుకుంటూనే (కెవిఆర్, టిఎంఎస్ కూడ చలం విషయంలో నా అంత ఉదారంగా ఉండకపోవచ్చు) చెంచయ్య గారు ఎంతో ఆలస్యంగా వెలువరుస్తున్న ఈ సాహిత్య విమర్శ వ్యాసాలకు ఆహ్వానం చెప్తూ - ఈ కొనసాగింపులో మాత్రం ఇంక ఆలస్యం చేయవద్దని, సాహిత్య విమర్శను పరిపుష్టం చేసే సామాగ్రి ఆయన వద్ద పుష్కలంగా ఉందని మరోమారు విజ్ఞప్తి చేస్తున్నాను

**- వి.వి.**

హైదరాబాదు
3-1-2001

# విమర్శాశాస్త్ర శస్త్రకారుడు

సాహిత్యం పుట్టినప్పటినుంచీ సాహిత్య విమర్శ ఏదో ఒక రూపంలో ఉంటూనే ఉంది. సాహిత్య స్వరూప స్వభావాల్ని సంఘ ప్రయోజనం దృష్ట్యా విశ్లేషించి, వివరించి, సాహిత్యానికి ఒక దీపంలా మార్గం చూపేది సాహిత్య విమర్శ. సాహిత్యం రోగగ్రస్థమైనప్పుడు వైద్యుడుగా పనిచేసి ఆరోగ్యాన్ని ప్రసాదించేది సాహిత్య విమర్శ. సాహిత్య విమర్శకు ఇంత శక్తి ఉందా ? ఉంటేనే దానికి ఆ పేరు సార్ధకమవుతుంది ఆధునిక యుగంలో సాహిత్య విమర్శకు ఇంత శక్తీ, పదునూ కలిగించిన వ్యక్తి కొడవటిగంటి కుటుంబరావు.

ప్రాచీన, ఆధునిక విమర్శనా ధోరణుల మధ్య స్పష్టమైన తేడా ఉంది అయినా చాలామంది ఆధునిక సాహిత్య విమర్శకులలో కూడా కొన్ని సాంప్రదాయిక ఛాందస భావాలున్నాయి. వీటిని తొలగించి, నిజమయిన ఆధునిక సాహిత్య విమర్శకు రూపు రేఖలు దిద్ది, కండపుష్టినీ, గుండెబలాన్నీ కలిగించింది కుటుంబరావే.

మనం మంచి సాహిత్యాన్ని కోరుకున్నట్టే, మంచి సాహిత్య విమర్శను కూడా కోరుకోవాలి. అసలు మంచి విమర్శ లేనిదే మంచి సాహిత్యం రాదని కుటుంబరావు గట్టి నమ్మకం. "చలంగారిని సంఘం సహృదయంతో మొదట్నుంచీ విమర్శిస్తూ వచ్చి నట్టయితే ఆయన రచనలు యదార్ధ సాంఘిక వ్యవస్థకు ఎడంగా వెళ్ళిపోయి వొట్టి తర్కంగానూ, శుష్కవేదాంతంగానూ పరిణమించటం జరిగిఉండేదిగాదు" అంటూ, ఒక ప్రతిభావంతుడైన కధకుడు అభ్యుదయ సాహిత్యానికి దూరమైపోయినందుకు కుటుంబరావు ఎంతగానో వాపోయారు. అభ్యుదయ శక్తుల్ని సరిగా అవగాహన చేసుకున్న విమర్శకులు లేకపోవడం వల్ల గొప్ప రచయితలు కూడా వక్రమార్గం పడతారనడానికి చలాన్ని ఒక ఉదాహరణగా మాత్రమే ఆయన చూపారు. రచయితల్ని అభ్యుదయ రచయితలుగా మలుచుకోడానికి సాహిత్య విమర్శ ఎలా ఉపకరిస్తుందో తొలిసారిగా శాస్త్రీయంగా వివరించిన ఘనత కుటుంబరావుదే. "రచయితను అర్ధం చేసుకోకుండా విమర్శించరాదు" అన్న ప్రాధమిక సూత్రాన్ని విమర్శకులు అర్ధం చేసుకుంటే పై పొరపాటు జరిగి ఉండేది కాదు. నన్ను మెచ్చుకునే వాళ్ళంతా నా రచనల్ని అర్ధం చేసుకున్నారనుకున్నాను, అని చలం బాధగా అంటాడొకచోట.

'విశ్వశ్రేయః, కావ్యమ్', 'హితేన సహితం సాహిత్యం' లాంటి మాటలెన్ని వినిపించినా, ప్రాచీన సాహిత్య విమర్శ కావ్యవస్తువుకన్నా ప్రధానంగా శిల్పాన్ని పట్టించుకున్నట్టు కనిపిస్తుంది. దాదాపు అంతా మత ప్రేరితమయిన సాహిత్యమే కావడంవల్ల, వాళ్ళకు ఏం చెప్తున్నారన్నది కాదు - ఎలా చెప్తున్నారన్నదే ప్రధానమయింది రచయితలందరకూ వస్తువు విషయంతో దాదాపు ఏకాభిప్రాయం ఉన్నప్పుడు విమర్శకుల దృష్టి శిల్పం మీదకే మళ్ళుతుంది. రసం, అలంకారాలు, రీతులు, గుణాలు, శబ్దసౌందర్యం, శ్లేషార్థాలు వగైరా శిల్ప సామగ్రిని ఆధారం చేసుకునే విమర్శ సాగేదిగాని - రచయిత దృక్పథం, రచనల నేపథ్యం, సంఘదృష్టి మొదలయిన వాటి ఆధారంగా విమర్శ సాగేది కాదు. అలా సాగనందుకు వాళ్ళను ఇప్పుడు నిందించి ప్రయోజనం లేదు విమర్శ ధోరణి నేటికీ అలాగే కొనసాగాలనే వాళ్ళ గురించే ఆలోచించాలి భావకవిత్వం రావడంతోటే ప్రాచీన విమర్శాధోరణి కొంత మారింది. అభ్యుదయ

సాహిత్యోద్యమంతో, విమర్శకు సంబంధించి సమూలమయిన మార్పులు వచ్చాయి. అయినా శిల్పానికి సంబంధించి ఆధునిక విమర్శకులలో కూడా కొన్ని మూఢవిశ్వాసాలు ఇంకా పోలేదు వాటిని తొలగించటానికి కుటుంబరావు విమర్శా వ్యాసాలు తప్పక దోహదం చేస్తాయి

కవి భావనకు వివశుడైపోయి కవిత్వాన్ని సృష్టిస్తాడనుకోవడం ఒక భ్రమ భావన అనేది కవిమీద పెత్తనం చలాయించకూడదు. భావనపైన కవి అధికారం సంపాదించాలి. అప్పుడే ఆ భావనను పాఠకులకు అందించగలడు. ఏ కళాకారుడైనా కళలో తాను లీనమైనట్టు కనిపిస్తాడేగాని, నిజానికి లీనం కాడు, కాకూడదు అలా లీనమయితే అది రసాభాస అవుతుంది తాను బయట వుండి కళాస్వాదకుణ్ణి కళలో లీనమయ్యేట్టు చేయాలి కళాకారుడు

ఇలాగే రచయితల్లో ఉండే మరొక భ్రమ - 'మూడ్' రానిదే రచన చెయ్యలేమనుకోవడం. 'మూడ్' అనేది ఒక మానవాతీత శక్తి అయినట్టూ, కళాకారుడికి తెలియకుండా దానంతటదే ఎప్పుడో అతనిలో ప్రవేశిస్తున్నట్టూ అనుకోవడం కూడా ఒక మూఢవిశ్వాసమే. 'మూడ్' అనబడేది రావడానికి తగిన భౌతిక పరిస్థితులు కొన్ని ఉంటాయనేది ఆధునికులు సైతం చాలామంది గుర్తించారు. తాను సృష్టించబోయే కళకు సంబంధించని విషయ పరిజ్ఞానం, తగిన మానసిక విశ్రాంతి, కళాసృష్టి చేయాలన్న పట్టుదల - ఇంతకు మించిన 'మూడ్' ఏమిటి ? భౌతికాధారం గల విషయాన్ని కూడా అభౌతికం చెయ్యడం మనకలవాటు. అందుకనే విమర్శకుడికి భౌతికవాదదృష్టి ఉండాలని కుటుంబరావు అన్నారు. 'మూడ్' అంటే ఏమిటో తనకు తెలియదని కూడా నిక్కచ్చిగా చెప్పారు. ఇలాంటి మూఢవిశ్వాసాలు ఒకవేళ రచయితలో ఉన్నా, విమర్శకుడిలో వుండరాదు. కాబట్టి విమర్శకుడు రచయితకన్నా రెండాకులు ఎక్కువ చదివి వుండాలని కుటుంబరావు అభిప్రాయం.

సాహిత్య ప్రవాహంలో కొంత చెత్త ఎప్పుడూ కొట్టుకువస్తూనే ఉంటుంది. సాహిత్య విమర్శ ఆ చెత్తను తొలగించే వడపోతగా పని చెయ్యాలి "సాహిత్య సాంస్కృతిక విమర్శ కావలికుక్కలాగా పనిచెయ్యందే సాహిత్యానికి వర్తమానంగాని భవిష్యత్తుగాని లేదు" (కొ.కు.) సాహిత్య విమర్శకుడిపైన అంత బరువైన బాధ్యత వుంది.

తెలిసినవాడికే తెలియజెప్పడం అనేది ఏ రకమయిన విమర్శలో అయినా సాధారణంగా వుండే లోపమని కుటుంబరావు గుర్తించారు. మతభావాన్ని నమ్మే వాళ్ళకు మాత్రమే నచ్చేట్టుగా మతప్రచారం చెయ్యటం, కమ్యూనిస్టు సిద్ధాంతం నచ్చినవాళ్ళు ఇష్టపడే విధంగానే కమ్యూనిస్టు ప్రచారం చెయ్యడం ఇలాటివే. మార్క్సిస్టు దృక్పథంలో వున్న కళను మార్క్సిస్టు దృక్పథం లేనివాళ్ళకు నచ్చేలా వ్యాఖ్యానించగలిగితే అది ఉత్తమ విమర్శ అవుతుంది. అసలు విమర్శ ఉద్దేశమే అది. ఆ పని చెయ్యలేనపుడు ఇక విమర్శతో పనేముంది ? చాలామంది అభ్యుదయ విమర్శకులు కూడా విమర్శలోని ఈ లక్షణాన్ని గుర్తించినట్టు కనబడరు. అయితే ఇక్కడొక తిరకాసుంది. ఒకవేళ ఏ విమర్శకుడయినా భూస్వామ్యభావాలు గల కళలను అభ్యుదయవాదులకు నచ్చేలా

విమర్శించగలిగితే అది ఉత్తమ విమర్శ అవుతుందా ? కాదని కుటుంబరావు సమాధానం. సమాజం యెప్పుడూ పురోగమిస్తుందేగాని తిరోగమించదు. సాహిత్యమయినా, సాహిత్య విమర్శ అయినా అంతే

సంఘం కళలద్వారా తేజోవంతమైనట్టే, అప్పుడప్పుడూ కళల ద్వారా నిర్వీర్యం అయే అవకాశం కూడా వుంది. అలాంటి సమయంలోనే విమర్శ అవసరం ఎక్కువగా వుంటుంది. నిత్యజీవితంలో తమ అవసరాలు ఎలాంటివో గుర్తించనంత సులభంగా, తమకు ఎలాంటి కళలు కావాలో ప్రజలు గుర్తించటం కష్టం. తమకు అవసరమయిన కళలు లభిస్తే ఆనందించి ఉత్తేజం పొందగలరు. తమను తప్పుమార్గంలో నడిపించే కళలు ఎదురైతే వాటిని బహిష్కరించేంత విమర్శనా దృష్టి వారికుండదు. కాబట్టి సమాజానికి పనికిరాని కళల్ని విశ్లేషించి, వాటి గుట్టుబయట పెట్టే కార్యక్రమం తీసుకోవలసింది విమర్శకులేనని కుటుంబరావు అంటారు.

అయితే విమర్శకు అన్ని సమయాల్లోనూ ఇంత పురోగమనశీల స్వభావం ఉంటుందా ? ఉండకపోవచ్చు. పనికిమాలిన సాహిత్యం వచ్చినట్టే, పనికిమాలిన విమర్శ కూడా రావచ్చు. సాహిత్యాన్ని సంస్కరించడానికి విమర్శ ఉపయోగపడ్డట్టే, కువిమర్శను సద్విమర్శగా మార్చడానికి కూడా విమర్శ ఉపయోగపడాలి - "అందుచేత విమర్శ కూడా విమర్శకు గురి కావాలి." (కొ.కు.)

విమర్శకు సంబంధించి కుటుంబరావు చేసిన సూత్రీకరణలు ఏవీ 'శిలా శాసనాలు'గా వుండవు. అసలు ఏ నియమాలూ ఎప్పటికీ మార్చడానికి వీలులేని స్థితిలో ఉండకూడదనే ఆయన ఉద్దేశం. సంఘం ఎప్పుడూ మారుతుంటుంది. కళలూ మారుతుంటాయి ఆ కళలతో పాటు విమర్శ సూత్రాలు కూడా అవసరమయిన మేరకు మారక తప్పదని ఆయన నమ్మారు. అయితే, విమర్శ స్వరూపంలో మార్పులు వచ్చినా, విమర్శ స్వభావం మారదు రచయితల్ని అభ్యుదయ పంథాలో నడిపిస్తూ, ఆ రచనల్ని అర్థం చేసుకునేటట్లుగా పాఠకుల్ని తయారుచేస్తూ పోవడం ఏ కాలంలోనయినా విమర్శ నిర్వహించవలసిన ధర్మం.

1937 నుంచి 1980 వరకు కుటుంబరావు రాసిన సాహిత్య వ్యాసాలలోంచి క్రోడీకరిస్తే, ఆధునిక సాహిత్యానికి సరిపోయే విమర్శాశాస్త్రం గోచరమవుతుంది. యాభై ఏళ్ళుగా తెలుగు సాహిత్యాన్ని పరిశీలిస్తూ, తాను సాహిత్యాన్ని సృష్టిస్తూ, సమాజ పరిణామాలను గమనిస్తూ, తన సూత్రీకరణలు తప్పని తేలితే సవరించుకుంటూ, సాహిత్యంలో తానొక గిరిగీసుకుని అందులోనే ఉండిపోక ఎప్పటికప్పుడు వస్తున్న సాహిత్యోద్యమాల వెంట నడుస్తూ, మార్క్సిస్టు దృక్పథాన్ని అడుగడుగునా జీవితానికి అన్వయిస్తూ, విమర్శా సాహిత్యాన్ని, శాస్త్రాన్నీ సృష్టించిన మేధావి కుటుంబరావు. సాహిత్యాన్ని అభ్యుదయ దృక్పథంతో విమర్శించిన విమర్శకులు చాలామంది ఉన్నారు గానీ, విమర్శ నిర్వహించవలసిన పాత్రను గురించి ఇంత శాస్త్రీయంగా, విపులంగా చర్చించినవారు కుటుంబరావు గాక మరెవరయినా ఉన్నారా అని అడిగితే వెతుక్కోవలసిన అగత్యం ఏర్పడుతుంది.

ఇంతవరకు విమర్శ స్వరూప, స్వభావ, ప్రయోజనాల పట్ల కుటుంబరావు దృక్పథం ఎలాంటిదో చూసాం ఇక సాహిత్యం పట్ల ఆయన చేసిన సూత్రీకరణలు ఎలాంటివో సంగ్రహంగా పరిశీలిద్దాం

ఒక వ్యక్తి రచయిత కావడానికి ప్రేరణ ఎక్కడినుంచి వస్తుంది ? ఇదొక ప్రధానమైన అంశం. పూర్వజన్మ వాసన, లేదా సంస్కారం నుండి అన్నది సాంప్రదాయ విమర్శకుల సమాధానం ఇది అబద్ధమని సులభంగానే గ్రహించగలం కాబట్టి దీనిని పట్టించుకోనక్కర లేదు. రచయితకు ప్రేరణ వర్తమాన జీవితంలోనే వస్తుంది "సాహిత్యం జీవిత వృక్షానికి పూసే పువ్వు. పువ్వుకు పువ్వులు పూయవు" (కొ.కు.). నాలుగు కథలు చదివి ఒక కథా, నాలుగు నవలలు చదివి ఒక నవలా రాసేవాళ్ళకు కుటుంబరావు పై వాక్యం మంచి సమాధానం చిత్రమేమిటంటే ఈ సూత్రాన్ని సిద్ధాంతపరంగా అంగీకరించే ఆధునికులు కూడా చాలామంది జీవితం నుండి ప్రేరణ పొందకపోవడం. అందరికీ అన్ని రకాల జీవితం తెలియకపోవచ్చు. కాని తనకు తెలిసిన జీవితాన్నే చిత్తశుద్ధితో చిత్రించడం అవసరం. కుటుంబరావు తన రచనలలో తనకు తెలిసిన మధ్య తరగతి జీవితాన్నే చిత్రించారు. ఆయనకు ప్రేరణ అక్కడి నుంచే లభించింది.

అభ్యుదయ రచయిత, అభ్యుదయ రచన - వీటి నిర్వచనంలో ఈనాటికీ చాలామందికి అస్పష్టతలు, భ్రమలు ఉన్నాయి. హృదయవిదారకంగా పేదల కష్టాల్ని చిత్రించడం, పోరాటాల్ని వర్ణించడం చేస్తేనే అభ్యుదయ రచయితలు అవుతారని సాధారణంగా అనుకుంటారు. తనకు తెలిసిన జీవితాన్ని అవగాహన చేసుకుని, అందులోని సత్యాన్ని ప్రకటిస్తే, ఆ రచయిత అభ్యుదయ రచయితే అని - ఆ మాటకు ఒక విశాలార్థాన్ని కల్పించారు కుటుంబరావు. జీవితాన్ని వాస్తవికంగా చిత్రించడం కూడా అంత ముఖ్యంకాదు. జీవిత సత్యాన్ని ప్రకటించాలంటారు. అప్పుడే అది అభ్యుదయ రచన అవుతుంది. పోతే, ఈనాడు అభ్యుదయ రచయిత అయినవాడికి మార్క్సిస్టు దృక్పథం ఉండి తీరాలంటారు కుటుంబరావు. మార్క్సు పుట్టకముందు ఎవరూ అభ్యుదయ రచనలు చేయలేదా అంటే చేశారు. కాని ఈనాటి పరిస్థితి వేరు. మార్క్సిస్టు దృక్పథంలేని రచయిత ఈనాడు కాకపోతే రేపయినా అభ్యుదయ వ్యతిరేక రచనలు చేయవచ్చు. కాబట్టి, మార్క్సిస్టు దృక్పథం లేని రచయిత కొన్ని అభ్యుదయ రచనలు చేయవచ్చేమో గాని, అభ్యుదయ రచయిత మాత్రం కాలేడని సారాంశం.

రచయితకు, ముఖ్యంగా అభ్యుదయ రచయితకు, జీవితానుభవం ఉండాల్సిందే గాని, అదొక్కటే చాలదు. జీవితానుభవం ద్వారా తానేమి చెప్పదలచుకున్నాడో అది చెప్పడానికి రాజకీయ పరిజ్ఞానం, సామాజికతత్త్వం కూడా అవసరం. జీవితానుభవాన్ని సక్రమమార్గంలో నడిపించడానికి ఇవి తప్పనిసరి "జీవితానుభవం జీర్ణం కావటానికైనా సామాజికతత్త్వం బోధపడాలి." (కొ.కు.) జీవితానుభవం అందరికీ ఉంటుంది. దాన్ని విశ్లేషించుకుని, అందులోని సత్యాన్ని గుర్తించి, సమాజానికి అన్వయించే శక్తి అందరికీ ఉండదు. శక్తి ఉన్నంతమాత్రాన

చాలదు దానిని ఉపయోగించుకునే జ్ఞానం ఉండాలి సంఘజీవిగా జీవితానుభవసారాన్ని అర్థం చేసుకునే శక్తి అందరికీ ఉంటే, అసలు కళల అవసరమే లేదంటారు కుటుంబరావు. జీవితంలోంచి ఏమి నేర్చుకోవాలి ? ఎలా నేర్చుకోవాలి ? ఎందుకు నేర్చుకోవాలి ? ఈ ప్రశ్నలకు సమాధానాలు సామాజికతత్త్వం బోధపడిన కళాకారులకే తెలుసు

మార్క్సిస్టు రచయితలు సృష్టించే సాహిత్యమంతా రాజకీయ ప్రచార సాహిత్యమేననే దురభిప్రాయం చాలామందిలో ఉంది. పెట్టుబడిదారీవర్గ ప్రయోజనాలను కాపాడే సాహిత్యం వీళ్ళ దృష్టిలో రాజకీయ సాహిత్యం కాదు. కేవలం ఒక రాజకీయ సిద్ధాంతాన్ని ఎలాగయినా సరే బలపరచాలన్న దుగ్ధతో మార్క్సిస్టు రచయితలు ఉండరు. కాని ఒక స్పష్టమయిన రాజకీయావగాహనతోనే వారు సాహిత్యసృష్టి చేస్తారు. కొ.కు. మాటల్లోనే - "సాహిత్యం స్వచ్ఛందంగా ఒక రాజకీయ ధోరణిని బలపరిస్తే అది ఆ రాజకీయ ధోరణికి ఒక కాంప్లిమెంట్ అన్నమాట. కేవలమూ ఒక రాజకీయ ధోరణిని బలపరచటానికే సాహిత్యం సృష్టించేవాళ్ళు రాజకీయాలకు అమ్ముడు పోయేవాళ్ళే." సరదా కోసం మార్క్సిజం ప్రభావంతో ఎవరూ రచనలు చెయ్యరు. అలా చేస్తే ప్రభుత్వ 'సత్కారాలు' లభిస్తాయని వారికి తెలుసు

సాహిత్య ప్రయోజనం ఏమిటి ? అన్న ప్రశ్నకు రకరకాల సమాధానాలు వినిపిస్తున్నాయి. ఆనందం, ఉపదేశం అన్నవి ప్రాచీన ఆలంకారికులు చెప్పారు. కొందరు ఈనాడూ చెబుతున్నారు నిజానికి ఇవి అస్పష్టమైన మాటలు. ఆనందం, ఉపదేశం - ఈ మాటల అర్థం ఏమిటి ? నవ్వడమే ఆనందమా ? సమాజం బాగుపడాలని అనడమే ఉపదేశమా ? బుద్ధి వికాసమే ఆనందమని కుటుంబరావు అంటారు. బుద్ధి వికాసంతో ప్రమేయంలేని ఆనందం కూడా ఉండవచ్చు కాని అది సాహిత్యం వల్లనే రానక్కరలేదు. ప్రాచీనుల 'అలౌకిక రసానందం' కూడా బుద్ధివికాసంతో ప్రమేయం లేకపోతే వ్యర్థం. మద్యపానం వల్ల కూడా అలౌకిక (ఈ లోకాన్ని మరపింపజేసే) ఆనందాన్ని పొందవచ్చు. పోతే, ఉపదేశం ఉండాలని అభ్యుదయవాదులందరూ కోరారు గాని, ఆ ఉపదేశం ఎలా ఉండాలో కుటుంబరావు బాగా వివరించారు. "ఉపదేశం మన వ్యక్తిత్వాన్ని పరాభవిస్తుంది. ఆలోచన రేపే గుణం వ్యక్తిత్వాన్ని నిద్ర లేపుతుంది " (కొ.కు.) ఒక్క ముక్కలో సాహిత్య ప్రయోజనం ఇది. ధర్మశాస్త్రాల్లో, న్యాయశాస్త్రాల్లో ఉన్న సూత్రాల్ని ఏకరువు పెట్టడానికే అయితే సాహిత్యం అక్కరలేదు. అధర్మం, అన్యాయం వల్ల కలిగే నష్టాన్ని చిత్రించి దానికి పరిష్కారం స్పష్టంగా చెప్పడం కాదు. ఆలోచన రేపే విధంగా చిత్రంచగలగాలి, ఒక సమస్య మూలకారణాల్ని వివరించి చూపినప్పుడుకూడా ఆ సమస్యపట్ల తమ కర్తవ్యం ఏమిటో నిర్ణయించుకోలేని స్థితిలో ఉండరు పాఠకులు. సాహిత్యం మనకు కలిగించాల్సిన సంస్కారం మరొకటి వుంది. స్వేచ్ఛను దుర్వినియోగం చేస్తే చట్టం శిక్షిస్తుంది. కాని స్వేచ్ఛను సద్వినియోగం చేసుకునే యోగ్యతను చట్టం కలిగించలేదు. ఆ పని సాహిత్యం చేయగలుగుతుందని కుటుంబరావు అంటారు.

సాహిత్యంలో శిల్పంకూడా కేవలం ఆనందం కలిగించడానికి కాదు శిల్పంవల్ల రచయిత ఆశయం బయటపడాలి కాని, దాని ముసుగులో పాఠకులను మభ్యపెట్టరాదు. జీవితంలోని కష్టసుఖాల వెనుకగల కారణాల మీదికి దృష్టి మరల్చడమే శిల్పం ప్రయోజనం కూడా. శిల్పం, భాష రచనకు మూలపరికరాలయితే, జీవితం ముడిపదార్థమని కుటుంబరావు అభిప్రాయం అసలెప్పుడూ రచయితకు జీవితమే ప్రమాణం. రాజకీయ సిద్ధాంతాన్ని అన్వయించి చెప్పాలేగాని, సిద్ధాంతానుగుణంగా జీవితాన్ని వక్రీకరించరాదంటారు ఆయన. ఈ వ్యాఖ్యానం చాలామందికి నచ్చకపోవచ్చు గాని, ఇలా వ్యాఖ్యానించడంలోనే కుటుంబరావు ప్రత్యేకత, గొప్పదనం ఉన్నాయి. సాహిత్య సృష్టి గురించి ఆయన చేసిన సూత్రీకరణల్లో ఇది చాలా ముఖ్యమైంది. మార్క్సిజం సిద్ధాంతం ప్రకారం జీవితాన్ని మలుచుకుంటూ పోయి చిత్రిస్తే అది మార్క్సిస్టులకే నచ్చుతుందిగాని, ఇతరులపై దాని ప్రభావం ఉండకపోవచ్చు జీవితాన్ని వక్రీకరించకుండా దానికి మార్క్సిజాన్ని అన్వయిస్తే ఎవరయినా ఒప్పుకోకతప్పదు. కుటుంబరావు సృజనాత్మక సాహిత్యం ఇలాంటిదే. సాయుధ విప్లవానికి సాంస్కృతిక విప్లవం ఒక వాహనంలాంటిది. సమాజం పురోగమించడానికి అడ్డంగా ఉన్న సాంస్కృతిక బంధాల్ని తెంచడం సాహిత్యంతోపాటు అన్ని కళల ధ్యేయం.

అన్ని కాలాలలోనూ ఒకే రకమయిన అవసరాలుండవు సంఘం మారుతుంటుంది అవసరాలూ మారుతాయి కాబట్టి, సంఘం ఇలా వుండాలి అని ఒక పథకాన్ని ఇవ్వనక్కర లేదు. సాహిత్యం ఇలా వుండాలని చెప్పుకుంటే, సంఘం ఇంకో విధంగా మారిపోవచ్చు. అందువల్ల, సాహిత్యం వివరించవలసింది సంఘం ఎలా వుండాలని కాదు, ఎలా మారాలని, అంటారు కుటుంబరావు. సంఘం ఫలాని విధంగా వుండాలని తాత్కాలికంగా అనుకున్నా, దాని సహజ గతిక్రమాన్ని గుర్తించడం రచయితకు తప్పనిసరి. సంఘం ఎప్పుడూ ఒకే విధంగా ఉండదనీ, అదినిరంతరం మారుతుంటుందనీ దీని అర్థం.

సాహిత్యంలో వాస్తవికత గురించి అవాస్తవిక ఆలోచనలు చాలామంది రచయితలలో కనిపిస్తాయి. వాస్తవికత గురించి కుటుంబరావు ప్రధానంగా మూడు విషయాలు చెప్పారు. ఒక రచయిత రాసిన పది కథల్లోకన్నా, పదిమంది రచయితలు రాసిన పది కథల్లో జీవిత వాస్తవికత ఎక్కువగా చోటు చేసుకుంటుంది అనటం మొదటిది. ఒక్కరి అనుభవాలలోకన్నా పదిమంది అనుభవాలలో వైవిధ్యం కనిపిస్తుందన్నది ఇక్కడ గమనించవలసిన విషయం జీవితంలో జరిగిన విషయాలే కాకుండా జరగదగిన విషయాలను చిత్రించడం కూడా వాస్తవికతలో భాగమే అన్నది రెండవది. ఒకోసారి జీవిత వాస్తవాలను బాగా వ్యక్తం చెయ్యడానికి - జరిగిన విషయాలకన్నా, జరగకపోయినా జరగదగినవనిపించే విషయాలు బాగా పనికిరావచ్చు. వాస్తవ జీవితం చిత్రించటమే రచయిత ధ్యేయం కాకూడదు. ఆ జీవిత వాస్తవాన్ని ఒక దృక్పథంతో వ్యాఖ్యానించగలగాలి. ఆ వ్యాఖ్యానం సూచన ప్రాయంగానైనా లేకపోతే అలాంటి వాస్తవికత వ్యర్థం. ఇది మూడవది, ముఖ్యమైందికూడా.

విప్లవ సాహిత్యం విప్లవాన్ని మాత్రమే కోరాలా లేక, మూఢ విశ్వాసాలు మొదలైన వాటినికూడా పట్టించుకోవాలా అన్న విషయంలో, విప్లవ సాహిత్యం సృష్టించేవారిలోకూడా భేదాభిప్రాయాలు కనిపిస్తుంటాయి. పెట్టుబడిదారీ వ్యవస్థతోపాటు, దాని పూర్వ వ్యవస్థల సంస్కృతి కూడా మనను పీడిస్తుంటుందని, దానిని ఉపేక్షించరాదని అంటూ, కుటుంబరావు పై సమస్యకొక పరిష్కారం చూపిస్తున్నారు మానవజాతిని ఏదో రూపంలో పీడించే ప్రతి సమస్యను రచయిత పట్టించుకోవలసిందే

చాలామంది సాహిత్య విమర్శకులు సాహిత్య స్వరూపాన్ని అర్థం చేసుకుంటారు, వివరిస్తారు. కాని సాహిత్య స్వభావాన్ని అర్థం చేసుకోలేరు. సాహిత్యం ఎప్పుడూ ఉద్యమ స్వభావాన్ని కలిగి వుండాలని కుటుంబరావు అభిప్రాయం. సాహిత్యోద్యమంలో భాగం పంచుకోలేని రచయితలు ఎంత అభ్యుదయ సాహిత్యం సృష్టిస్తున్నామని అనుకున్నా - ఊహాగానాలకు, తెచ్చిపెట్టుకున్న ఆదర్శవాదానికి గురికాక తప్పదు. సిద్ధాంతం వెలుగులో జీవితాన్ని కాక, జీవిత నేపథ్యంలో సిద్ధాంతాన్ని చూడగలిగినంతవరకూ - ఉద్యమ రూపంలో సాహిత్యం సాధించే విజయాలను వ్యక్తులుగా వుండి ఎందరు గొప్ప రచయితలుకూడా సాధించలేరు. సమాజం పూర్తిగా మారితే తప్ప కొందరి జీవితాలు బాగుపడవు. వాళ్ళే విప్లవ పోరాటంలో ప్రధాన పాత్ర వహిస్తారు. ఈ విషయాన్ని అర్థం చేసుకుని సాహిత్యాన్ని సృష్టించడం చెప్పుకున్నంత సులభం కాదు. రాజకీయోద్యమాలు అర్థంకానిదే ఉద్యమరూపంలో సాహిత్యాన్ని సృష్టించలేరు. విప్లవాన్ని కోరే చాలామంది యువరచయితలలో ఈనాడు కనిపిస్తున్న లోపం ఇదే. ఈ లోపం లేనప్పుడే అది విప్లవ సాహిత్యం అవుతుంది. విప్లవం, విప్లవ సాహిత్యం రెండూ జీవితం నుంచే పుట్టినా - విప్లవ సాహిత్యం విప్లవానికి ముందే పుట్టి, విప్లవానికి సాంస్కృతిక పరంగా వున్న అడ్డంకుల్ని తొలగిస్తుంది. విప్లవ సాహిత్యంవల్ల సాహిత్య పరిధి సంకుచితమైపోతుందని వాపోయే వాళ్ళు ముందు తమ మనసుల్ని విశాలం చేసుకోవడం మర్చిపోతారు. సాహిత్యాన్ని ఒక ఉద్యమంగా అర్థం చేసుకుంటే తప్ప వాళ్ళకు ఈ విషయాలు అర్థంకావు. సాహిత్యం ఉద్యమ స్వభావాన్ని కలిగి ఉండాలని కుటుంబరావు అనడంలో ఇంత అర్థం ఇమిడి ఉంది.

కుటుంబరావు మరొక ముఖ్య సూత్రీకరణ సాహిత్యానికి సమిష్టితత్వం ఉండాలనడం. చదువుకోవడానికి మాత్రమే పనికివచ్చి, నలుగురిలో చర్చించడానికి పనికిరాని సాహిత్యం వ్యర్థమని ఆయన ఉద్దేశం. కళలో సామూహిక లక్షణాలు వుండాలి. పదిమంది ఆలోచనను ఒక మార్గంలో పయనింపజేసే శక్తి దానికి వుండాలి. సాహిత్యంలోని ఈ సామూహిక లక్షణం వర్గ స్వభావంలోకూడా మార్పులు తీసుకు రాగలుగుతుంది బుర్రకథలు, ఒగ్గుకథలు, పాటలు, నాటకాలు వగైరా ఈ సామూహిక లక్షణాన్ని ఎక్కువగా కలిగివుంటాయి. అందుకే విప్లవ సాహిత్యం ఎవరికి వారు చదువుకునే సాహిత్యంగా కాక, పదిమంది వినే సాహిత్యంగా, రూపొందాలని కుటుంబరావు అంటారు. 'నవ్య సాహిత్య పరిషత్తు'కు ఈ శక్తి లేకపోవటం వల్లనే అభ్యుదయ సాహిత్యోద్యమం వచ్చింది అభ్యుదయ సాహిత్యోద్యమం ఈ శక్తిని కోల్పోయినందువల్లనే విప్లవ సాహిత్యం పుట్టింది విప్లవ సాహిత్యం ఈ లక్షణాన్ని నిలుపుకోలేకపోతే మరో సాహిత్యోద్యమం పుట్టక తప్పదు

మార్క్సిజం ప్రభావంలోకి రాని పాఠకులు వ్యష్టిగా సెక్సు సాహిత్యాన్ని కోరుకున్నా, సమిష్టిగా విప్లవ సాహిత్యాన్నే కోరుతారు దీనికి కారణం విప్లవ సాహిత్యంలో ఉన్న సమిష్టితత్వమే. సాహిత్య స్వభావానికి సంబంధించి ఇదొక ముఖ్యమైన అంశం

ప్రాచీన సాహిత్యం పట్ల మన దృక్పథం ఎలా వుండాలో కుటుంబరావు ఒక సందర్భంలో వివరిస్తారు. పాత సాహిత్యాన్ని ఈనాటి విశ్వాసాలతో విమర్శించవచ్చా అన్నది సమస్య. పాత సాహిత్యాన్ని పాత విశ్వాసాలతోనే విమర్శిస్తే దానివల్ల ఈనాటి సమాజానికి ప్రయోజనం వుండదని ఆయన భావిస్తారు. బానిసత్వం అన్నది బానిస సమాజంలో మంచిదై ఈనాడు చెడ్డదిగా మారిపోలేదు బానిసత్వపు సంకెళ్ళను ఛేదించే శక్తి ఆనాటి సమాజానికి లేకపోవడం వల్ల బానిసత్వం ఆనాడు నిలిచింది గాని, అది మంచిది కావడం వల్ల మాత్రం కాదు. అలాగే ప్రాచీన సాహిత్యంలో లోపాలుంటే అవి ఆనాడూ, ఈనాడూ లోపాలే అయితే ఆ లోపాలను సవరించుకునే శక్తి, అవకాశం ఆనాడు లేకపోవచ్చు కుటుంబరావు దృష్టిలో వేమన ఆనాటికి విప్లవ కవే. కాని వేమన ఆనాడు చెప్పిన విషయాలనే ఇప్పుడూ చెప్పడం నేటి విప్లవకవి లక్షణం కాదు. పాత సాహిత్యంపట్ల ఎలాంటి దృక్పథం కలిగివుండాలో కుటుంబరావు ఇచ్చిన వివరణ సాహిత్య విమర్శకులకు మార్గదర్శకం.

రచయితకు, విమర్శకుడికి మధ్య వుండవలసిన సంబంధం ఏమిటో రచయిత కంటే ఎక్కువగా విమర్శకుడికి తెలియాలి. రచయిత తన స్వేచ్ఛను దుర్వినియోగం చేసేటప్పుడు దాన్ని గుర్తు చేయవలసిన బాధ్యత విమర్శకుడిది. అయితే రచయితకు వుండే స్వేచ్ఛ ఎలాంటిది ? తన సాహిత్యాన్ని సంఘ ప్రయోజనాలకు ఉపయోగించుకునే స్వేచ్ఛ ప్రతి రచయితకూ వుంటుందని కుటుంబరావు అంటారు. కాని చాలామంది రచయితలు స్వేచ్ఛ అంటే ఇలా అనుకోరు నాలుగు డబ్బులు సంపాదించిపెట్టే రచనలు చెయ్యడం, ఏ పత్రిక ఎలా కోరితే అలా రాసివ్వడం, ప్రభుత్వంనుండి ఎట్టి ఒత్తిళ్ళు రాకుండా జాగ్రత్తపడటం స్వేచ్ఛ అని బుద్ధిపూర్వకంగానో, అజ్ఞానం వల్లనో అనుకుంటారు. ఈ విషయంలో అజ్ఞానాన్ని ప్రదర్శించుకునేవాళ్ళు తమ అజ్ఞానం తొలగిపోతే మంచి సాహిత్యాన్నే సృష్టిస్తారు. బుద్ధిపూర్వకంగా ప్రవర్తించేవాళ్ళు సాహిత్యంలో వర్గశత్రువులు సమాజంలో వర్గశత్రువుల విషపు కోరల్ని తీసేసేది విప్లవశక్తులు. సాహిత్యంలో వర్గశత్రువులను రూపుమాపే బాధ్యత విమర్శకులది. విమర్శ ఈ కార్యాన్ని నిర్వర్తించాలంటే విమర్శకు వర్గస్వభావం వుండాలంటారు కుటుంబరావు వర్గస్వభావం వున్న విమర్శ, విమర్శలోని పెడధోరణులను కూడా నివారించగలుగుతుంది.

విమర్శ గురించి ఇంత సమగ్రంగా ఆలోచించిన తర్వాత అసలు విమర్శ ఉనికినే ప్రశ్నించారు కుటుంబరావు. విమర్శతో అవసరం లేని పద్ధతిలో సాహిత్యం రూపొందినప్పుడు విమర్శే అక్కరలేదంటారు ఆయన. సాహిత్యం ఆ స్థాయికి ఎదగడానికి కొన్ని శతాబ్దాలు పడుతుంది. ఎందుకంటే సమాజం కూడా ఆ స్థాయికి ఎదగాలిగదా ! విమర్శ అక్కరలేదన్న మాట ఈనాడు అర్థం కాకపోవచ్చు. ఈ మాట అనే స్థాయికి సాహిత్య విమర్శకుడుగా కుటుంబరావు ఎదిగారు. ఆయనను అర్థం చేసుకోవడానికి సమాజంకూడా చాలా ఎదగాలి. *('భావ విప్లవకారుడు కొ.కు' 1983)*

# విమర్శను ఆహ్వానించడం రచయితల కనీసపు కర్తవ్యం

రచయితల స్వేచ్ఛ గురించి ప్రసిద్ధ (?) నవలా (?) రచయిత (?) మల్లాది వెంకట కృష్ణమూర్తి రాసిన వ్యాసంపైన 'ఆంధ్రభూమి' దినపత్రికలో పెద్ద చర్చే జరిగింది. ఒక వ్యాపార రచయిత అలవోకగా రాసిపారేసిన ఒక వ్యాసంపైన సామాజిక స్పృహ వున్న సాహిత్య విమర్శకులెందరో విజృంభించి విరుచుకుపడడం కొంత ఆశ్చర్యాన్ని కలిగించకమానదు. ఎందుకంటే మల్లాదివంటి రచయితలు బాధ్యతా రహితమైన స్వేచ్ఛనే కోరుకుంటారన్న విషయం 'రచయితలకు స్వేచ్ఛ లేదా' ? అనే వ్యాసం ద్వారా మాత్రమే కాదు, ఆయన నవలల ద్వారానే ఎప్పుడో తెలిసిపోయింది.

నిజానికి మల్లాదికి సాహిత్యం పట్ల ఒక స్పష్టమైన దృక్పథం వుంది. అదేమంటే సాహిత్యానికి సామాజిక ప్రయోజనం ఉండనక్కరలేదనీ, వ్యాపారానికి సాహిత్యం ఒక మంచి ముడిసరుకనీ. సామాన్య పాఠకుల మానసిక బలహీనతల్ని రెచ్చగొట్టి, 'రసా' నందాన్ని అందించి కాలక్షేపం కలిగిస్తూ, డబ్బు సంపాదించుకోవడానికి సాహిత్యాన్ని ఒక సాధనంగా సమర్థవంతంగా వాడుకుంటున్న కొందరు ప్రముఖుల్లో మల్లాది ఒకడు. ఇన్నాళ్ళూ ఈ వాస్తవాన్ని తన నవలల ద్వారా తెలియజేస్తే, యివాళ వ్యాసం ద్వారా స్పష్టం చేశాడు. కనీసం బూర్జువా విలువలైనా లేని మల్లాది రచనల్నీ, ఇంకా ఇలాంటి వ్యాపార రచయితల రచనల్నీ, వాటి సామాజిక ఆర్థిక నేపథ్యాన్నీ విశ్లేషించడం వల్ల మాత్రమే పాఠకులు వ్యాపార సాహిత్య స్వభావాన్ని అర్థం చేసుకోగలరు.

రచయితలకు స్వేచ్ఛ అక్కరలేదా అంటే అవసరమనే సమాధానం. రచయితలకే కాదు, ప్రతి మనిషికీ స్వేచ్ఛ అవసరమే. అయితే ఈ 'స్వేచ్ఛ' మానవ సమాజానికి అతీతమైన బ్రహ్మపదార్థం కాదు. నిర్దిష్ట దేశకాల పరిస్థితులకు లోబడే స్వేచ్ఛ గురించి ఆలోచించాలి. ఈ సమాజంలో మల్లాది ఒక్కడే రచయిత కాదు ఎందరో రచయితలున్నారు. ఎందరో పాఠకులున్నారు. తమ రచనలకు ముడిసరుకు నందించే సమాజం వుంది. ఆ సమాజానికో చరిత్ర వుంది. ఆ సమాజానికో క్రమ పరిణామం వుంది. ఈ విషయాలన్నీ పట్టించుకోకుండా రచయితలు గానీ, వ్యక్తులు గానీ స్వేచ్ఛ గురించి ఆలోచించడం అర్థరహితం. అయితే మల్లాది ఇంత అర్థరహితంగా ఆలోచిస్తున్నట్టు కనపడడానికి అతని అజ్ఞానం కారణం కాదు. కీర్తీ, డబ్బూ కారణం.

రచయితలకు స్వేచ్ఛ లేదా ? అని ప్రశ్నించిన మల్లాది రచయితలకు బాధ్యత లేదా ? అని ప్రశ్నించడు అలా ప్రశ్నించాలన్న విషయం తెలియక కాదు అలా ప్రశ్నించడం యిష్టం లేదు. యిష్టం లేకపోవడానికి కారణం తన సాహిత్య వ్యాపారానికి అది అడ్డంకి కావడమే. అంతేగాని మల్లాదికి సాహిత్య తత్వం, సాహిత్య ప్రయోజనం మొదలయిన విషయాల్లో అవగాహనా లోపం ఉందని అనుకుంటే అది అలాంటి రచయితల పట్ల మన అవగాహనా లోపమే అవుతుంది.

ఇంతకూ మల్లాది ప్రశ్నిస్తున్న స్వేచ్ఛ దేనినుంచి ? ఇదే మనం మొదట వేసుకోవలసిన ప్రశ్న ఆయనకు పాలక వర్గాలనుంచీ పోలీసుల నుంచీ స్వేచ్ఛ ఉందనేది నిర్వివాదాంశం. ఇటు మల్లాదివంటి రచయితలకూ, అటు బూర్జువా పాలక వర్గాలకూ ఉన్న సామాన్య లక్షణం బాధ్యతా రాహిత్యం కాబట్టి ఇది సాధ్యమయింది. అందువల్ల మల్లాది వంటి రచయితల వర్గ స్వభావమూ, పాలక వర్గాల వర్గ స్వభావమూ ఒకటేనన్న విషయం గుర్తించాలి.

మల్లాది రచనల్ని ప్రభుత్వం నిషేధించలేదు. పోలీసులు ఆయనపై ఏ కుట్రకేసునూ మోపలేదు. రచనల కారణంగా ఆయనెప్పుడూ జైలు కెళ్ళలేదు. అయినప్పుడు మల్లాదికి స్వేచ్ఛ లేకపోవడమేమిటి ?

అంటే ఆయన కోరుకుంటున్న స్వేచ్ఛ ప్రభుత్వ నిర్బంధం నుంచి కాదు, సాహిత్య విమర్శ నుంచి అని అర్థమవుతోంది. ప్రజాస్వామ్యవాదులయిన రచయితలు, విప్లవ రచయితలు పాలకవర్గాల క్రూర నిర్బంధం నుండి స్వేచ్ఛను కోరుకుంటుండగా మల్లాది తనపై వస్తున్న విమర్శల నుండి స్వేచ్ఛను కోరుకుంటున్నాడు. విమర్శలను సైతం భరించలేనివాడికి, విమర్శల నుండి స్వేచ్ఛను కోరుకునేవాడికి, విమర్శను విమర్శ ద్వారా ఎదుర్కోవాలన్న ధైర్యం లేనివాడికి తానొక రచయితనని చెప్పుకునే అర్హత కూడా ఉండదు. విమర్శను ఆహ్వానించడం రచయితల కనీసపు కర్తవ్యం.

మల్లాది 'తేనెటీగ' నవలపై కోర్టులో కేసు వేసినా ఆయన స్వేచ్ఛకు భంగం కలుగలేదు. ఈ మాత్రపు హామీని మన చట్టాలూ, కోర్టులూ మనకిస్తున్నాయనడంలో సందేహం లేదు. యండమూరి కుహనా వైజ్ఞానిక నవల 'తులసి'కి ముందుమాటలు రాసిన డా॥ కొమ్మూరి వేణుగోపాలరావుపైన తన విమర్శ ద్వారా రంగనాయకమ్మ ఒక చురక వేసినందుకు ఆమెపైన కోర్టులో పరువు నష్టం కేసు వెయ్యడం జరిగింది యండమూరి నవల నిషేధింపదగినదని ఒకవైపు చెబుతూనే న్యాయమూర్తి చివరకు రంగనాయకమ్మకే శిక్ష విధించి కొమ్మూరి వేణుగోపాలరావు "పరువు" కాపాడాడు రంగనాయకమ్మ విమర్శను ప్రతివిమర్శ ద్వారా ఎదుర్కొనే స్వేచ్ఛ కొమ్మూరి వేణుగోపాలరావుకున్నా, ఆయన ఆ స్వేచ్ఛను ఉపయోగించుకోలేదు. యండమూరి కుహనా వైజ్ఞానిక నవలలపై వచ్చిన విమర్శలకు ఇంతవరకు సమాధానం చెప్పకపోవడం ద్వారా ఆయన తన సాహిత్య విమర్శా స్వేచ్ఛను ఉపయోగించుకోలేదు. ఆ మాటకొస్తే ఏ వ్యాపార రచయితా తనకున్న స్వేచ్ఛను సక్రమమైన పద్ధతిలో ఎప్పుడూ ఉపయోగించుకోడు ఎప్పుడయితే సాహిత్య విమర్శ ద్వారా తమపై వచ్చిన విమర్శలకు సమాధానం చెప్పుకునే స్వేచ్ఛను ఉపయోగించుకోరో, అప్పుడు ఇతరులెవరూ తమపై విమర్శ చెయ్యరాదనే నిర్ణయానికి రాకతప్పదు. "రచయితలకు స్వేచ్ఛ లేదా ?" అనే వ్యాసం మల్లాది ఈ నిర్ణయానికి వచ్చి రాసిందేతప్ప మరొకటి కాదు.

అసలు ఈ సమాజంలో ఎవరికి స్వేచ్ఛ ఉంది గనక రచయితలకు స్వేచ్ఛ లేకపోవడానికి ? సమాజాన్ని దోచుకోవడానికీ, వ్యక్తిగత ఆస్తుల్ని పెంచుకోవడానికీ మన రాజ్యాంగమే స్వేచ్ఛ ఇచ్చింది. ఆ స్వేచ్ఛను కొంతమందైనా తమ శక్తిమేరకు

ఉపయోగించుకుంటున్నారు లాకప్ హత్యల్లోనూ, బూటకపు ఎన్‌కౌంటర్లలోనూ మరణించేవాళ్ళు జీవించే స్వేచ్ఛను కోల్పోతున్నారు. ఏ విచారణా లేకుండా సంవత్సరాల తరబడి జైళ్ళలో మగ్గుతున్నవాళ్ళు జైలుబయట జీవించే స్వేచ్ఛను కోల్పోతున్నారు చదువుకున్న, చదువులేని కోట్లాదిమంది నిరుద్యోగులు పని స్వేచ్ఛను పొందలేకపోతున్నారు. సుఖమైన బ్రతుకుతెరువు అన్వేషణలో ఎందరో మేధావులు, కళాకారులు రచయితలు పాలకవర్గ భావజాలానికి బానిసలై పోవడం ద్వారా వ్యక్తిత్వంతో జీవించే స్వేచ్ఛను స్వచ్ఛందంగా వదులుకుంటున్నారు. రచయితలకే కాదు, ఎవరికీ నిజమైన స్వేచ్ఛ ఈ వ్యవస్థలో రాదు. ఈ వ్యవస్థకు విముక్తి కలిగిస్తే తప్ప నిజమైన స్వేచ్ఛ రావడానికి వీల్లేదు. ఈ నిజమైన స్వేచ్ఛ కోసం, అశేష పీడిత ప్రజానీకం పక్షాన నిలబడ్డ శ్రామికవర్గ పక్షపాత స్వభావం గల ప్రజా రచయితల, కళాకారుల స్వేచ్ఛకోసం వ్యాపార రచయితలెప్పుడూ ప్రశ్నించరు. విప్లవ రచయిత వరవరరావు ఏ విచారణా లేకుండా మూడున్నర సంవత్సరాలబాటు ఎందుకు జైలు నిర్బంధాన్ని అనుభవించవలసి వచ్చింది ? గద్దర్‌లాంటి కళాకారులు ప్రజల ముందుకు వచ్చి స్వేచ్ఛగా ప్రదర్శన లివ్వలేని పరిస్థితికి కారకులెవరు? యువతీ యువకుల్ని మత్తులో ముంచే సెక్స్ నవలలు, క్రైమ్ నవలలు ఇంకా ఎన్నెన్నో సెకాల్డ్ 'ప్రయోగాత్మక పరిశోధనాత్మక' నవలలు స్వేచ్ఛగా మార్కెట్‌లోకి వస్తున్నప్పుడు ప్రజారచయితలకూ, కళాకారులకూ ఆ స్వేచ్ఛ ఎందుకు లేదు ? బూర్జువా వ్యవస్థ పునాదుల్ని కదిలించే ప్రజా ఉద్యమాల ప్రేరణతో వస్తున్న రచనలన్నా, కళారూపాలన్నా పాలకవర్గాలు బెంబేలెత్తిపోయి వాటిని నిర్బంధానికి గురిచేస్తాయి. ఇది చరిత్ర చెప్పిన విషయం. అయితే చరిత్ర దీనికి పరిష్కారం కూడా చెప్పింది. అది మర్చిపోకూడదు.

ఇటీవల అభ్యుదయ భావాలున్నాయని చెప్పుకునేవాళ్ళు కొందరు 'మూడుతరాలు' నవలను నిషేధించమని ప్రభుత్వాన్ని డిమాండ్ చెయ్యాలని భావించారు. చట్టపరమైన నిషేధాల వల్ల చెడు రచనల్ని లేకుండా చెయ్యగలమని అభ్యుదయవాదులు భావించడం వింతగా కనిపిస్తుంది. ఆ నవలలో అక్రమ స్త్రీ, పురుష సంబంధాలు చిత్రించబడ్డాయనేది వాళ్ళు నిషేధించాలని కోరాలనుకోడానికి కారణం. నిజానికి నిషేధించే కార్యక్రమాల ద్వారా ఎవరూ దేన్నీ ఆపలేరు. ప్రజల్ని పక్కతోవ పట్టించే రచనలు ఏ జనంలోకి వెళుతున్నాయో, ఆ జనంలోకి వెళ్ళగల సాహిత్య విమర్శ ద్వారా, ప్రజాసాహిత్యం ద్వారా, వీటికి మూలమైన ప్రజా ఉద్యమ నిర్మాణం ద్వారా మాత్రమే ప్రజా వ్యతిరేకమైన రచనలను ఆపగలం. కనీసం అవి ప్రజావ్యతిరేక స్వభావం గల రచనలనే అవగాహనను కలిగించగలం.

*(అరుణతార : అక్టోబర్ - నవంబర్ 1989)*

# ఇరవయ్యేళ్ళ విరసం

విప్లవ రచయితల సంఘానికి ఇరవై యేళ్ళు వచ్చాయి. సామాజిక పరిణామ చరిత్రలో 20 యేళ్ళ కాలం పెద్దగా గుర్తింపదగింది కాదు. కానీ ఒకానొక నిర్దిష్ట వ్యవస్థలోని ఒక దశలో ఒకానొక రంగంలో పనిచేసే ఒక సంస్థకు రెండు దశాబ్దాలంటే గుర్తింపదగిన కాలపరిమితే. ఈ 20 యేళ్ళ కాలంలో విరసం ఏం సాధించిందో వరసబెట్టి చెప్పడంకన్నా, అది ఎలా సజీవంగా నడుస్తూ వస్తున్నదో తెలుసుకోవడం అవసరం.

మారుతూ వున్న సమాజంలో మనం ఉన్నాం. సమాజాన్ని అర్థం చేసుకోవడం అంటే మారుతున్న సమాజాన్ని అర్థం చేసుకోవడమే. మారుతున్న సమాజాన్ని - దాని పరిణామక్రమ సూత్రాన్ని తెలుసుకుని - మరింత వేగవంతంగా మార్చడం మన కర్తవ్యం సమాజం మారడం లేదు, అది మారదు అని అనుకుంటే, మనల్ని వెనక్కి నెట్టేసి అదే ముందుకు పోతుంది. మారుతున్న సమాజాన్ని అర్థం చేసుకుంటూ, తాను మారుతూ, సామాజిక పరిణామ క్రమంలో తన వంతు పాత్రను నిర్వహించడం ద్వారా విరసం సజీవంగా సాగుతోంది.

ఈ క్రమంలో విరసానికి రెండు బాధ్యతలున్నాయి. సమాజంలో నానాటికీ పెరుగుతున్న వ్యాపార విలువల్ని ధ్వంసం చెయ్యడం మొదటిది. వాటికి ప్రత్యామ్నాయంగా నూతన ప్రజాస్వామిక విలువల్ని ప్రతిపాదించి ఆమోదింపజెయ్యడం రెండోది. ఎంత పనికిరానిదైనా అది పనికిరాదని చెప్పడంతో మన బాధ్యత తీరదు. ప్రత్యామ్నాయం చెప్పి దాన్ని సాధించడంలో మన బాధ్యతను గుర్తింపజెయ్యాలి. ఈ బాధ్యతల్ని ఎంతో కొంతమేరకు నిర్వర్తిస్తున్నందువల్లనే విరసం సజీవంగా ఉండగలుగుతోంది

ఈ రెండు దశాబ్దాల్లో విరసం అనేక సవాళ్ళు ఎదుర్కొన్నది. వాటి నెదుర్కొని, తన వునికిని కాపాడుకొని ముందుకు సాగగలగడం విరసం ప్రత్యేకత. అనేక వైరుధ్యాలతో కూడుకొనివున్న ఈ సమాజంలో ఏదీ శాంతియుతంగా జరగదు. విరసం పుట్టుకే అలా జరగలేదు. పదిమందీ కలసి ముందుగా అనుకొని ఒక తేదీ నిర్ణయించుకుని తాపీగా విరసాన్ని ఏర్పాటు చెయ్యలేదు. ఒకానొక చారిత్రక అవసరంలోంచి, సంఘర్షణలోంచి అది పుట్టింది. సమాజంలోనూ, సాహిత్యంలోనూ ఆనాడు జరుగుతున్న సంచలనం లోంచి విరసం పుట్టింది పాత విలువలకూ, కొత్త విలువలకూ మధ్య సాగిన యుద్ధం లోంచి విరసం పుట్టింది అందుకే అది 'అర్ధరాత్రి అర్జంటు'గా పుట్టవలసిన పరిస్థితి ఏర్పడింది.

నక్సల్బరీ, శ్రీకాకుళాల్ని గుర్తించని కమ్యూనిస్టు పార్టీల్ని నక్సల్బరీ సంతాలులూ, శ్రీకాకుళ గిరిజనులూ చెత్తబుట్టలోకి విసిరేశారు. శ్రీశ్రీలాంటి విప్లవకవులు సజీవంగా ఉంటారేమో అని భయపడి, శ్రీశ్రీని తమలాగే నిర్జీవంగా మార్చదల్చుకున్న సోకాల్డ్ అభ్యుదయ రచయితల్ని శ్రీశ్రీ షష్టిపూర్తి సందర్భంగా రచయితల బాధ్యతను గూర్చి విశాఖ విద్యార్థులు వేసిన ప్రశ్న చెత్తబుట్టలోనికి నెట్టివేసింది. నక్సల్బరీ, శ్రీకాకుళ గిరిజన

రైతాంగ పోరాట చైతన్యాన్నీ, ఆ పోరాటంలో పెన్నుకూ, గన్నుకూ ఒక సమన్వయాన్ని చేకూర్చే క్రమంలో తన ప్రాణాల్నే అర్పించిన సుబ్బారావు పాణిగ్రాహి విప్లవ వారసత్వాన్నీ తన జీవనాడిగా మార్చుకుని పుట్టింది విరసం. ఈ పుట్టుకలో ఘర్షణ వుంది. ఈ పుట్టుకలో చలనం ఉంది. ఈ పుట్టుకలో సంచలనం వుంది. ఈ పుట్టుకలో జీవం వుంది. ఈ పుట్టుకలో పరిణామక్రమ సూత్రం వుంది. అందుకే అది రాత్రి పుట్టినా 'రాత్రి'ని చీల్చ గలుగుతూ వుంది. అర్జంటుగా పుట్టినా స్థిరంగా మనగలుగుతూ వుంది. ఎందరు ఎన్ని విమర్శలూ, దాడులూ చేసినా రెట్టింపు బలంతో ఎదుర్కొంటూ ముందుకు సాగుతూ వుంది.

విరసం అవసరాన్నీ, విరసం శక్తినీ, విరసం పోరాట స్వభావాన్నీ విరసం లోనేగాదు, విరసం పుట్టుకతో దిక్కుతోచక శవాలంకరణ చేసుకోవడం ప్రారంభించిన అభ్యుదయ రచయితల ఆదుర్దాలో చూడవచ్చు. విరసం ఆవిర్భావంతో బెంబేలుపడి సాహిత్యంలో కూడా నక్సలైట్లు ప్రవేశిస్తున్నారని ఆనాటి హోంమంత్రి వెంగళరావుకు విన్నవించుకున్న విశ్వనాథ సత్యనారాయణ భయంలో చూడవచ్చు. సాహిత్యరంగంలో ఇంక సాంప్రదాయిక వేషం పనికిరాదని గుర్తించి వేషం మార్చుకుని ముందుకు రా ప్రయత్నించిన గుంటూరు శేషేంద్రశర్మ, ఆరెస్ సుదర్శనంలాంటి సరికొత్త ఆధునిక ఛాందసుల కొత్త సీసాలో పాతసారా స్వభావంలో చూడవచ్చు కత్తికంటే కలం గొప్పదని పాఠశాలల్లో విద్యార్థులు చేసే చర్చల్లో వాస్తవం వున్నదని నిరూపిస్తున్నట్టుగా విప్లవ రచయితలపై ప్రయోగింపబడ్డ ప్రభుత్వ క్రూర నిర్బంధంలో చూడవచ్చు.

విప్లవ సాహిత్యాన్ని సృష్టించడంలో మాత్రమే లేదు, విరసం శక్తి. ఆ సాహిత్యాన్ని ప్రజల దగ్గరకు తీసుకుపోవడంలో కూడా వుంది. బహిరంగ సభల్లో చేసిన సాహిత్యోపన్యాసాలూ, వినిపించిన కవితలూ, పాడిన పాటలూ ఇందుకు నిదర్శనాలు. మాండలిక భాషల్లో రచనలు చెయ్యడం, ఇతర రచయితలకు ఆ ప్రేరణ కలిగించడం కూడా ఇందుకు తార్కాణాలే. ఈ వర్గ సమాజంలో ప్రజల శ్రమ ఫలితం వారికి దక్కకుండా చేస్తూన్న దోపిడీదారులున్నట్టే, ప్రజల భాషలో సాహిత్యాన్ని చదువుకునే అవకాశం వారికి లేకుండా చేసే శక్తులూ అనేక రూపాల్లో వుంటాయి. ఒకనాడు శిష్ట వ్యావహారిక భాషకు ప్రామాణికత్వాన్ని కలిగించడం కోసం గిడుగు రామ్మూర్తి పంతులు భాషోద్యమాన్ని లేవదీయవలసి వచ్చింది. ఈనాడు విరసం సాహిత్యోద్యమం ద్వారా మాండలికాలకు సాహిత్యంలో ఒక గౌరవ స్థానాన్ని సంపాదించే ప్రయత్నం చేస్తోంది.

నక్సల్బరీ నిప్పురవ్వ రాజుకునేంతవరకు కమ్యూనిస్టు పార్టీల్లో, వాటి కార్యకలాపాల్లో వ్యాపించివున్న రివిజనిస్టు ధోరణిని గుర్తించలేకపోయాం. మార్క్సిజానికి శత్రువులు ముసుగులో గాక స్పష్టంగానే ఉంటారనుకున్నాం. మార్క్సిజం ముసుగులో కూడా మార్క్సిజానికి శత్రువులు వుండవచ్చునన్న వాస్తవాన్ని నగ్నంగా బయట పెట్టింది నక్సల్బరీయే. సాంస్కృతిక రంగంలోని రివిజనిజాన్ని విరసం గుర్తించి బయటపెట్టడానికి దోహదం చేసింది ఈ నేపథ్యమే. విప్లవ పోరాటం లేకుండా విప్లవ సాహిత్యం పుట్టదనే మాటలో వున్న వాస్తవం కూడా యిదే. భౌతికాధారం నుంచే చైతన్యం పుడుతుందన్న ప్రకృతి సూత్రంలో వున్న సత్యమూ యిదే.

నిషేధాలూ, అరెస్టులూ, కుట్రకేసులూ, పోలీసులు, భూస్వాములు చేసే హత్యలూ మొదలైన పాలకవర్గ నిర్బంధ రూపాలన్నిటికీ విరసం గురికావడం ఒక్కటే దాని గొప్పకాదు. వీటన్నిటికీ తట్టుకొని, తనను తాను నిలదొక్కుకుని సాంస్కృతిక రంగంలో ప్రజాస్వామిక సంస్కృతిని తీసుకురావడంలో ప్రత్యక్షంగానూ, పరోక్షంగానూ విరసం నిర్వహించిన పాత్ర ముఖ్యమైంది. అందువల్లనే అఖిలభారత విప్లవ సాంస్కృతిక సమితిని ఏర్పరచడంలో విప్లవ రచయితల సంఘమే చొరవ తీసుకోవలసి వచ్చింది. భారతదేశంలో చెల్లాచెదురుగా వున్న విప్లవ రచయితలకూ, కళాకారులకూ, సాంస్కృతిక బృందాలకూ విరసం తాత్వికంగా మార్గదర్శకం కాగలిగింది

అభ్యుదయ రచయితల సంఘం వచ్చింతర్వాత కూడా సాహిత్యరంగంలో చోటు చేసుకుని సాహిత్యాన్ని పట్టి పీడిస్తూ వున్న చాదస్తాన్నీ, అశాస్త్రీయ ధోరణుల్నీ విరసం ఎండగట్టగలిగింది. ఏ సాహిత్యమైనా వర్గస్వభావానికతీతంగా ఉండదన్న నిజాన్ని కుండబద్దలు కొట్టినట్టు విప్పి చెప్పింది. సాహిత్యం నిర్దిష్ట దేశకాలాలకు లోబడే వుంటుందని గుర్తింపజేసింది. సాహిత్యరంగంలో కనిపించే అన్నిరకాల ముసుగుల్నీ తొలగించి, సాహిత్యంలోని స్వచ్ఛతనూ, సహజత్వాన్నీ, పోరాట స్వభావాన్నీ చూపించింది. వర్గపోరాటంలో సాహిత్యం కూడా ఒక బలమైన ఆయుధం అని నిరూపించింది. సభ్యుల సంఖ్యకు వందరెట్లుగా పెరిగిన అభిమానుల, అనుచరుల సంఖ్య దీన్ని రుజువు చేస్తుంది. సాంస్కృతిక రంగంలోని వ్యాపార వర్గాలు తమ వ్యాపారాన్ని యథేచ్ఛగా కొనసాగించుకోడానికి విప్లవ ధోరణిని ఒక ముసుగుగా తగిలించుకోవలసిన స్థితి ఏర్పడడం కూడా దీన్నే బలపరుస్తుంది.

విరసం ఈ 20 ఏళ్ళలో సాధించినదానికన్నా సాధించవలసిందే ఎక్కువ వుందన్న విషయం ఇతరులకంటే విరసానికే ఎక్కువ తెలుసు తన బలాన్నీ, బలహీనతనూ సక్రమంగా అంచనా వేసుకోగల ఆత్మ విమర్శనా దృక్పథం విరసానికి వుంది. నాటకరంగంలోనూ, కథారచనలోనూ విరసం వెనకబడి వుందన్న ఆరోపణ పాక్షిక సత్యమే. విరసం ఆ రంగాల్ని నిర్లక్ష్యం చెయ్యలేదు. అయితే పాఠకులు ఆశించినంతగా కృషి జరిగివుండకపోవచ్చు. ఇలాంటి సమస్యల్ని ఎప్పటికప్పుడు సమీక్షించుకోవడం, వీలైనమేరకు ఆచరణ సాధ్యమైన పరిష్కారాన్ని అన్వేషించడం, కొన్ని సాధించడం, కొన్ని సాధించలేకపోవడం - ఇవన్నీ విరసం పని విధానంలో భాగాలే.

విప్లవ రచయితల సంఘానికి వున్న ఒక బలం స్పష్టమైన రాజకీయ దృక్పథం కలిగివుండడం. ప్రణాళికలో మొదట మార్క్సియన్ సోషలిజం అని వున్నా, తర్వాత దాన్ని మార్క్సిజం - లెనినిజం - మావో ఆలోచనా విధానంగా మార్చుకుని ఒక సమగ్రతను, స్పష్టతను తీసుకురావడం జరిగింది. రాజకీయాలకూ, సాహిత్యానికీ సంబంధాన్ని మనం ప్రత్యేకంగా కలిగించనక్కరలేదనీ, అది సహజంగానే వుంటుందనీ, మనం చెయ్యవలసిందల్లా బూర్జువా రాజకీయాల స్థానంలో ప్రజా రాజకీయాల్ని తీసుకురావడమేననీ విరసం తన సాహిత్య కృషిద్వారా స్పష్టం చేసింది.

ఒక్కమాటలో చెప్పాలంటే - చరిత్ర విరసాన్ని సృష్టిస్తే, విరసం తెలుగు సాహిత్యరంగంలో చరిత్రను సృష్టించింది. *(అరుణతార · జనవరి 1990)*

# పాతికేళ్ళ కిందట.....

సరిగ్గా పాతికేళ్ళ కిందట ఆరుగురు దిగంబర కవులు - నగ్నముని, జ్వాలాముఖి, చెరబండరాజు, నిఖిలేశ్వర్, భైరవయ్య, మహాస్వప్నలు - ఈ 'కుష్ఠు' వ్యవస్థపైన తమ కవితాయుధాన్ని సంధించారు. అంతవరకూ నిశ్శబ్దంగా, స్తబ్దంగా వున్న తెలుగు సాహిత్యరంగం ఒక్కసారి అదిరిపడి నిద్రలేచింది. నిద్రయితే లేచిందిగాని, కాస్తతేరుకుని దిగంబర కవిత్వంపైన విరుచుకుపడింది దిగంబర కవిత్వాన్ని ఆడిపోసుకుంది. దిగంబర కవితా ధోరణిని సహించలేకపోయింది. 'దిగంబర' అనే మాటకు పెడర్థాలు లాగి విసుర్లు విసరడం మొదలు పెట్టింది. అయినా దిగంబర కవులు భయపడలేదు. ఏటికి ఎదురీదినట్టుగా సాహిత్యరంగంలో ఒంటరిపోరాటం చేశారు. కలాన్ని కత్తిలాగా ఝుళిపించారు

అయితే దిగంబరకవిత్వాన్ని ఆహ్వానించినవాళ్ళు ఆనాడు అసల్లేకపోలేదు. వాళ్ళలో మొదటివాడు మహాకవి శ్రీశ్రీ. దిగంబరకవుల్లోని ఆవేదననూ, తపననూ, కోపాన్నీ, కసినీ, పైకి కనబడకపోయినా అంతర్లీనంగా సమాజంపట్ల ఉన్న ప్రేమనూ గుర్తించి, ఒకవిధంగా సాహిత్యరంగంలో 'బహిష్కృతు'లయిన దిగంబర కవుల్ని ఆప్యాయంగా పలకరించి, వెన్నుతట్టి ముందుకు పదమన్నవాడు శ్రీశ్రీ.

ముందుముందు రాబోయే విప్లవ సాహిత్యోద్యమానికి గల నేపథ్యంలో తామూ ఒక భాగం కాగలమని దిగంబరకవులు కూడా ఊహించివుండరు. సాహిత్యరంగంలో తాము నిర్వహించబోయే చారిత్రక కర్తవ్యపాత్ర పట్ల స్పృహ ఉండిఉండదు. ఒక అసంకల్పిత ప్రతీకారచర్యలాగా దిగంబరకవులు దూసుకువచ్చారు. అవినీతినీ, అన్యాయాన్నీ, నటననూ, మోసాన్నీ, కపటత్వాన్నీ, నయవంచననూ, ముసుగుల్నీ సరికొత్త పద ప్రమాణాలతో కడిగేశారు. వాళ్ళవి సొంత గొంతులు, అరువు తెచ్చుకున్నవి కావు. వాళ్ళవి హృదయాల్ని చీల్చుకువచ్చిన మాటలు, పెదవులపై నుంచి రాలినవికావు. అందుకే ఆ కవిత్వానికి అంత వాడి, వేడి వచ్చింది.

శ్రీశ్రీ మహా ప్రస్థాన కవితలు రాస్తున్న రోజుల్లోనే అవి కవితలు కావు, నినాదాలన్న వారున్నారు. ఆ తర్వాత శ్రీశ్రీని ఆధునికయుగ మహాకవిగా గుర్తించక తప్పలేదు. కానీ యివాళ అది కవిత్వం కాదు అనేవాళ్ళు దాదాపులేరు. కవిత్వంలో కొత్తదనాన్ని వ్యతిరేకించేవాళ్ళు ప్రయోగించే మొదటి అస్త్రం ఇది.

1965లో ఒకటీ, 66లో ఒకటీ, 68లో ఒకటీ- మొత్తం మూడు కవితా సంకలనాలు వచ్చాయి దిగంబరకవులవి. నాలుగు సంవత్సరాల కాలంలో వచ్చిన ఈ మూడు కవితాసంకలనాల్నీ పరిశీలిస్తే దిగంబరకవుల్లో వచ్చిన పరిణామం తెలుస్తుంది. బలమైన నిరసనతో ప్రారంభమై, ఆవేశంతో ఊగిపోయి, కాస్త ఆలోచించి, అస్పష్టంగానైనా ఒక కమిట్‌మెంటును ఏర్పర్చుకుని, మార్క్సిస్టు దృక్పథాన్ని అలవర్చుకున్న పరిణామక్రమం కన్పిస్తుంది. ఈ ప్రకృతిలో, ఈ సమాజంలో ఏదీ మార్పుకు అతీతం

కాదు మార్పు ప్రకృతి సమాజాల చలన సూత్రం ఈ మార్పు - తాత్కాలిక ఒడిదుడుకులు కొన్ని ఉన్నప్పటికీ - అభివృద్ధికరమైంది కూడా అవుతుంది. అదే దిగంబర కవిత్వంలో కన్పిస్తుంది.

అయితే దిగంబర కవిత్వంలో వచ్చిన ఈ అభివృద్ధికరమైన మార్పును దిగంబర కవుల్లోనే కొందరు వ్యతిరేకించారు. వాళ్ళలో ముఖ్యుడు మహాస్వప్న. కవిత్వానికి కమ్యూనిస్టు వాసన తగలడం అతనికిష్టంలేదు. సిద్ధాంతాలూ, పార్టీలూ అవసరంలేదని అతని అభిప్రాయం. ఇజాలకతీతంగా నిజం ఉంటుందనేది అతని నమ్మకం ప్రకృతి పరిణామానికి ఒక నియమం ఉన్నప్పుడు, సమాజాభివృద్ధికి ఒక సూత్రం ఉన్నప్పుడు, కవిత్వానికొక సిద్ధాంతం లేకుండా ఎలా ఉంటుంది ? ఈనాటికీ ఇలాంటి భ్రమల్లో ఉన్న కవులు అనేకమంది ఉన్నారు అయితే వీళ్ళలో కొందరు నిజంగా అలా నమ్ముతున్నవాళ్ళు కాదు, దాన్ని తమ స్వార్థానికీ, తమ బాధ్యతారాహిత్యానికీ ముసుగుగా తగిలించుకుంటున్న వాళ్ళు. ఇవాళ వచనకవిత్వం ఈ ముసుగు కవుల కబంధహస్తాల్లో బాధింపబడే ప్రమాదానికి లోనవుతోంది. పాట ఎలాగూ వీళ్ళకు లొంగదు. అది కాలికి గజ్జ కట్టుకుని గిరిజన జీవితాల్నీ, ప్రజావుద్యమాల్నీ, పీడిత తాడిత హృదయ స్పందనల్నీ ప్రజాయుద్ధరంగంలో గానం చేస్తోంది. అటువైపు చూడ్డానికి కొందరు వచనకవులు ప్రయత్నిస్తున్నవారూ లేకపోలేదు.

దిగంబరకవుల మూడో సంకలనం వెలువడే (1968) నాటికే నక్సల్బరీ నిప్పురవ్వ శ్రీకాకుళాన్ని కూడా మండించింది. వెంపటాపు సత్యం వంటి గిరిజన నాయకులు ఆయుధంతోబాటు అక్షరాయుధాల్నీ ధరించారు సుబ్బారావు పాణిగ్రాహి లాంటి కవులు కలంతోబాటు కత్తినీ పట్టారు. పెన్నూ, గన్నూ ఏకమయ్యాయి. కవిత్వం ఉద్యమంతో పెనవేసుకుపోయింది. ఇలాంటి నేపథ్యంలో దిగంబర కవులు నాలుగో సంపుటానికి ప్రయత్నంచేసే అవకాశం కూడా లేకుండా పోయింది. 1970 ఫిబ్రవరిలో విశాఖలో శ్రీశ్రీ షష్టిపూర్తి కార్యక్రమంలో విశాఖ విద్యార్థుల సవాల్ రచయితల్ని రెండు వర్గాలుగా మార్చింది నక్సల్బరీ శ్రీకాకుళ రైతాంగపోరాటాన్ని ఆహ్వానించేవాళ్ళు ఒక వర్గమైతే, దాన్ని వ్యతిరేకించేవాళ్ళు మరో వర్గం పాణిగ్రాహి లాంటి కవులు పీడిత ప్రజల విముక్తికోసం ప్రాణార్పణ చేస్తుంటే, సన్మాన కార్యక్రమాల నుంచి బయటపడి, ప్రజావుద్యమాలలో మమేకం కావడానికి కొందరు కవులైనా సిద్ధపడ్డారు. కాలంతోపాటు, సమాజంతోపాటు మారుతూ, సహజ పరిణామ క్రమాన్ని అర్థంచేసుకుని, సమాజాన్ని ఒకడుగు ముందుకు నడిపించే ప్రజా ఉద్యమాల ప్రేరణతో సాహిత్యాన్ని సమాజపరం చెయ్యాలనుకున్న కవులూ, రచయితలూ, విమర్శకులూ, కళాకారులూ 1970 జూలై 4న హైద్రాబాద్‌లో విప్లవరచయితల సంఘాన్ని ఏర్పరచారు. దానికి శ్రీశ్రీ అధ్యక్షుడు దిగంబర కవుల్లోని చెరబండరాజు, జ్వాలాముఖి, నగ్నముని, నిఖిలేశ్వర్‌లు విరసంలో చేరారు. దిగంబరకవుల ఈ పరిణామాన్ని అంగీకరించలేక భైరవయ్య, మహాస్వప్నలు దూరంగా ఉండిపోయారు తన జీవితకాలంలో చివరిక్షణందాకా విప్లవసాహిత్యోద్యమంతో, విరసంతో ఉన్నవాడు మాత్రం 'దిగంబర' కవుల్లో చెరబండరాజు ఒక్కడే విరసం

ఏర్పడకముందునుంచీ చెరబండరాజు 'దిగంబర' కవిత్వంలో దిగంబర ధోరణి కొంత ఉన్నదేగాని, దిగంబరావేశం లేదు. తక్కిన దిగంబర కవులకూ, చెరబండరాజుకూ ఈ మౌలికమయిన తేడా మొదట్నించీ కనిపిస్తుంది విప్లవసాహిత్యోద్యమంలో భాగస్వామి అయ్యాక చెరబండరాజు పాటకు ప్రాణంపోశాడు. రాసిలోనూ, వాసిలోనూ తన ప్రత్యేకతను నిరూపించుకున్నాడు.

దిగంబరకవులు సాహిత్యలోకంలో కలిగించిన సంచలనం పెద్దదే. అందరూ దాని తాకిడికి గురయిన వాళ్ళే ఎంత వ్యతిరేకులయినాసరే దాన్ని ignore చెయ్యలేకపోయారు. అన్నిరకాల వాళ్ళనీ సాహిత్యం గురించి ఆలోచింపజేశారు దిగంబర కవులు. సాహిత్య ప్రయోజనం గురించీ, సాహిత్యానికీ, సమాజానికీ ఉన్న సంబంధం గురించీ అందరూ చర్చించసాగారు. విరసం పుట్టుకతో ఆ చర్చ ఒకకొలిక్కి వచ్చింది.

దిగంబర కవులకు ఎంత ఆవేశం ఉందో సామాజిక అవగాహనపట్ల అంత ఆలోచన లేదు. దిగంబర కవులకు ఎంత నిరసనశక్తి ఉందో అంత నిర్మాణాత్మక దృష్టిలేదు. అందువల్ల అదొక బలమైన నిరసన ఉద్యమంగా మిగిలిందేగాని, సామాజిక చైతన్యంతో కూడిన సాహిత్యోద్యమంగా నిలవలేక పోయింది. దిగంబర కవుల్ని పొగడ్డానికి వాళ్ళకు పూర్తిగా సామాజిక చైతన్యం ఉందని అనక్కరలేదు దిగంబరకవుల్ని తిట్టడానికి తెలుగు సాహిత్యరంగంలో వాళ్ళు నిర్వర్తించిన చారిత్రక పాత్రను విస్మరించనక్కర లేదు. దిగంబర కవులు పుట్టినప్పటి నుంచి ఈ పాతికేళ్ళ కాలంలో ఎవరు ఏమిటో, ఎవరు ఎక్కడ మిగిలిపోయారో, ఎవరు ఎక్కడ ఆగిపోయారో, ఎవరు అలుపూ సలుపూ లేకుండా కవితా ప్రస్థానం సాగించారో, ఎవరు విప్లవ కవులో, ఎవరు కాదో ప్రత్యేకంగా చర్చించి వాదవివాదాలు చెయ్యాల్సిన అవసరం లేదు. తమ సామర్థ్యాలనూ, తమ బలహీనతలనూ, తమ మంచినీ, తమ చెడ్డనూ ఎవరికి వాళ్ళే స్పష్టంగా నిరూపించుకున్నారు.

*(అరుణతార · జులై 1990)*

# సామాజిక స్పృహ - సామాజిక చైతన్యం

విప్లవ కవులు తాము మాత్రమే సామాజిక స్పృహతో విప్లవ కవిత్వం రాస్తున్నామని భావించడం సరైంది కాదనీ, సామాజిక స్పృహ విప్లవ కవుల గుత్తసొత్తు కాదనీ ఇటీవల విజయవాడలో "నడుస్తున్న గాయాలు" కవితా సంకలనాన్ని ఆవిష్కరిస్తూ నండూరి రామమోహనరావు గారు అన్నారు. సామాజిక స్పృహ అంటే సమాజం గురించి స్పందించడమనీ, అలా స్పందించి రాయడానికి విప్లవ కవులే కానవసరం లేదనికూడా అన్నారు.

విప్లవ కవులకు సామాజిక స్పృహ గురించి నండూరి రామమోహన రావుగారు పాఠం చెబుతున్నారు. ఎవరు చెప్పినా వినడానికి విప్లవ కవులు వ్యతిరేకం కాదు. ఆ చెప్పేదేమిటనేదే ముఖ్యం. విప్లవ కవులు ఎవరు చెప్పినా వింటారు, కాని నోరుమూసుకుని, తలాడించే పద్ధతిలో వినరు విన్న దాన్ని విశ్లేషించుకుంటారు. ఆచరణ గీటురాయిపైన గీసి చూస్తారు.

విప్లవ కవులందరూ గొప్ప కవిత్వాన్ని రాసివుండకపోవచ్చు విప్లవ కవులు గొప్ప కవిత్వాన్నికూడా చాలానే రాశారు. నక్సల్బరీ, శ్రీకాకుళ పోరాటాల ప్రేరణతో, రివిజనిస్టులు మార్క్సిజానికి పట్టించిన తుప్పును వదల గొట్టి, మార్క్సిజాన్ని పదునుబెట్టి, కవిత్వాన్ని విప్లవీకరించిన పాణిగ్రాహి, చెరబండరాజు, శ్రీశ్రీ, శివసాగర్, గద్దర్, వంగపండు- ఎందరి పేర్లయినా చెప్పవచ్చు. ఒకటీ అరా గొప్ప విప్లవ కవిత్వం రాసి పేరులోకి కూడా రాకుండా అజ్ఞాతంగా ఉండిపోయిన కవులెందరో ఉన్నారు గత రెండు దశాబ్దాలుగాపాట, వచన కవితల్లో విప్లవ కవిత్వం బలంగా చోటుచేసుకోవడం ఎవ్వరూ కాదనలేని వాస్తవం

వెనకటికి ఒక పండితుడు స్పృహ అనే మాట అప్పత్రుల్లోనూ, విప్లవ కవిత్వంలోనూ మాత్రమే వినిపిస్తుందని వెటకారంగా మాట్లాడాడు ఈనాడు రామమోహనరావుగారు ఆ 'స్పృహ' విప్లవ కవులకే కాదు, అందరికీ ఉంటుం దంటున్నారు. 'స్పృహ'నే హేళనచేసే రోజులు పోయి, ఆ స్పృహ మాకూ ఉందని సంజాయిషీ చెప్పుకునే రోజులు వచ్చాయి. ఇది నిస్సందేహంగా కవిత్వంలో మార్క్సిజం తీసుకొచ్చిన మార్పే. కవిత్వంపైన మార్క్సిజం సాధించిన విజయమే.

మార్క్సిస్టు దృక్పథంలో కవిత్వం రాయడం ప్రారంభించాక 'సామాజిక స్పృహ' అనే మాటకు బాగా ప్రచారం వచ్చింది. సామాజిక స్పృహకూ మార్క్సిస్టు దృక్పథానికీ భేదం లేదనికూడా చాలా రోజులు చాలామంది అనుకున్నారు. నిజానికి సామాజిక స్పృహలేని కవి ఎవడూ ఉండడు. సోషలిస్టు వ్యవస్థను కోరుకొని "మరో ప్రపంచం, మరో ప్రపంచం, మరో ప్రపంచం పిలిచింది" అంటూ కవిత్వం రాసిన శ్రీశ్రీకే కాదు, వైదిక సంస్కృతిని పునరుద్ధరించాలని కవిత్వం రాసిన విశ్వనాథ సత్యనారాయణకూ ఉంది సామాజిక స్పృహ. మహాభారతం అనువదించిన కవిత్రయానికీ, ప్రజలకు దగ్గరగా

రావడానికి ప్రయత్నించిన శివకవులకూ, ఇంకా తదితర కవులకూ సామాజిక స్పృహ లేదనుకోవడం అశాస్త్రీయం. ప్రతి కవీ తాననుకున్న పద్ధతిలో సమాజం ఉండాలని కోరుకుంటాడు దానికోసం ఒక సిద్ధాంతం చెబుతాడు. ఆ సిద్ధాంతం వెలుగులో కవిత్వాన్ని రాస్తాడు. తన కవిత్వాన్ని ప్రచారం చేసుకుంటాడు. తమ ఆనందం కోసమే కవిత్వం రాసుకుంటూన్నమని భ్రమపడే లేదా భ్రమపెట్టే కవులు కూడా ఈ కోవలోకే వస్తారు

సమాజం పట్ల అస్పష్టంగానైనా, అశాస్త్రీయంగానైనా ఒక అభిప్రాయంగానీ, ఒక దృక్పథంగానీ లేని కవి ఉండడు. అయితే చాలామంది కవులకు లేనిదల్లా సామాజిక చైతన్యం మాత్రమే. సామాజిక చైతన్యం ఉన్న కవి సమాజాన్ని సరిగ్గా అర్థం చేసుకుంటాడు. సమాజంలోని వైరుధ్యాల్ని గ్రహిస్తాడు. ఆ వైరుధ్యాల పరిణామాన్ని, ఫలితాన్నీ ఊహిస్తాడు. సమాజ పరిణామ క్రమం ఏ సూత్రాల ప్రకారం ఉందో తెలుసుకుంటాడు గత చరిత్ర పరిణామాన్ని గుర్తిస్తాడు. వర్తమాన పరిస్థితిని అర్థం చేసుకుంటాడు. సమాజ భవితవ్యాన్ని అంచనా వేస్తాడు. సామాజిక చైతన్యం ఉన్న కవి ఇంత విశ్లేషణ చెయ్యడానికి అతనికున్న ఏకైక మూలశక్తి మార్క్సిస్టు దృక్పథం. ఇలాంటి కవుల్నే విప్లవ కవులంటారు.

ప్రపంచాన్ని విశ్లేషించి, వ్యాఖ్యానించిన శాస్త్రవేత్త లెందరో ఉన్నారు. కానీ ప్రపంచాన్ని మార్చడానికి మార్గంచూపిన తత్వవేత్త మార్క్స్ ఒక్కడే. సమాజంలోని కష్టాల్నీ, కన్నీళ్ళనీ హృదయవిదారకంగా చిత్రించిన కవులు ఎందరో ఉన్నారు. వాళ్ళందరూ సమాజంలోని సంఘటనలకు స్పందించిన కవులే. వాళ్ళందరకూ ఎంతో కొంత సామాజిక స్పృహ ఉన్నట్టే. కానీ సామాజిక చైతన్యం కలిగించి భావాల్ని భౌతిక శక్తిగా మార్చగల కవులు కొందరే.

కష్టాలకు కన్నీళ్ళు కార్చడం సామాన్య మానవుల పని కన్నీళ్ళను వర్గకసిగా మార్చడం విప్లవకారుల పని. సామాజిక పరిణామ క్రమంలో విప్లవకారుడు నిర్వర్తించే బాధ్యతనే సాహిత్యరంగంలో విప్లవకవి నిర్వర్తిస్తాడు. విప్లవ కవి తనకున్న పరిమితుల్లో నుండే విప్లవకారుడుగా ఎదగడానికి ప్రయత్నిస్తాడు

అలా ఎదిగి పెన్నుకూ, గన్నుకూ మధ్యనున్న సరిహద్దు రేఖను చెరిపివేసిన సుబ్బారావు పాణిగ్రాహి విప్లవ కవులకు ఆదర్శం. ఒకవైపు విప్లవ రచనలు చేస్తూనే, మరోవైపు విప్లవ పోరాటాల్లో పాల్గొని, పీడిత ప్రజల కోసం ప్రాణత్యాగం చేసిన పాణిగ్రాహి, వెంపటాపు, పరిటాల శ్రీరాములు, జ్ఞానేశ్వర్‌కీర్తి, రిక్కల సహదేవ్‌రెడ్డి మొదలయిన వాళ్ళందరూ విప్లవ కవులకు ప్రేరణనిచ్చే వాళ్ళే .

మతాలన్నీ దుఃఖ నివారణకోసం ప్రారంభమయ్యాయనీ, మార్క్స్ కూడా దుఃఖ నివారణోపాయాలు చెప్పాడనీ, అందుకని మార్క్సిజంకూడా ఒక మతమేననీ భావించే నండూరి రామమోహనరావుగారిలో ఉన్నది తర్కమే గాని గతి తర్కం కాదు తర్కానికీ, గతితర్కానికి తేడా తెలియాలంటే మార్క్సిజం తెలియాలి. సామాజిక స్పృహకూ, సామాజిక చైతన్యానికీ తేడా తెలియాలన్నా మార్క్సిజం తెలియాలి "నువ్వు సైంటిస్టువి కావాలంటే ఆర్టిస్టువి కావాలంటే ముందుగా నువ్వు కమ్యూనిస్టువి కావాలి" అని శ్రీశ్రీ అన్నదిందుకే.

విప్లవ కవిత్వం ప్రభుసమ్మితంలా ఆదేశిస్తుందనీ, నిజమయిన కవిత్వం కాంతాసమ్మితంలా పరిస్థితిని విరించాలనీ చెప్పే రామమోహనరావు గారు సాంప్రదాయిక పదాల్ని సాంప్రదాయిక అర్థంతోనే ప్రయోగించి విప్లవ కవిత్వాన్నీ, విప్లవ కవుల్నీ అంచనాకట్టే ప్రయత్నం చేస్తున్నారు. సాంప్రదాయిక విమర్శ సూత్రాల పరిధిని దాటి రాలేనివాళ్ళకు విప్లవ కవిత్వాన్ని అంచనా కట్టే హక్కేకాదు, శక్తీ ఉండదు.

సమాజంలో జరిగే సంఘటనలను వివరించడం అందరూ చేసేపనే. కానీ ఆ సంఘటనలు జరగడం వెనుకవున్న మూలకారణాల్నీ, వాటి పరిణామ ఫలితాల్నీ, వాటి వర్గ స్వభావాన్నీ వివరించి, పాఠకుడి బాధ్యతను గుర్తింపజేసే వాడు విప్లవ కవి.

*(అరుణతార : ఆగస్ట్ 1990)*

# సాహిత్యం - సమాజం

సాహిత్యం సమాజానికి ప్రతిబింబమనీ, సాహిత్యానికి సామాజిక ప్రయోజనం ఉందనీ, అది ఆనందాన్ని కలిగిస్తుందనీ సాధారణంగా అందరూ చెబుతున్నమాట. కానీ సాహిత్యానికీ సమాజానికీ ఉన్న అంతస్సంబంధం ఏమిటన్నది ప్రధాన ప్రశ్న. ఏకాలంలో ఏ సాహిత్యం ఎందుకు పుట్టిందో తెలిస్తే దానివల్ల జరిగే లాభనష్టాలు కూడా తెలుస్తాయి. దాన్ని సమీక్షించి సరైనా అంచనా వెయ్యడానికి అవకాశం ఉంటుంది.

సాహిత్య ప్రయోజనం దేశకాలాల్ని బట్టి ఉంటుంది. ప్రయోజనం అనేమాట ఒకటే అయినా దేశకాలాల్ని బట్టి దాని అర్థాలు వేరు. "విశ్వ శ్రేయః కావ్యమ్" అని 11వ శతాబ్దంలోని "ఆంధ్రశబ్ద చింతామణి"లో ఉన్నా ఆ 'విశ్వ శ్రేయస్సు'కూ మన 'విశ్వ శ్రేయస్సు'కూ సంబంధం లేదు. 'ధర్మం' అనేమాట ప్రాచీనులు ఎన్ని సార్లు ప్రయోగించినా ఆ 'ధర్మం' వేరు మన 'ధర్మం' వేరు. ప్రాచీనుల 'విశ్వ శ్రేయస్సు' మోక్షాన్ని కోరుకునేది. మన 'విశ్వ శ్రేయస్సు' ఆర్థిక సామాజిక రాజకీయ సమానత్వాన్ని కోరుకునేది. ప్రాచీనులు 'ధర్మం' అని ప్రయోగిస్తే దానికి వర్ణధర్మం అని అర్థం. ఈనాడు 'ధర్మం' అనేమాట న్యాయం అనే అర్థంలో వాడుతున్నాం. వర్ణ, కుల, మత, సంపద ప్రమేయంలేని న్యాయాన్ని ధర్మంగా భావిస్తున్నాం. వర్గ వ్యవస్థ బలంగా ఉన్న ప్రాచీన భూస్వామ్య వ్యవస్థలో ధర్మం అనేమాట వర్ణ వ్యవస్థకు అతీతమైంది కాదు ధర్మాన్ని కాపాడ్డం అంటే వర్ణ ధర్మాన్ని కాపాడ్డమనే అర్థం. ఎవరైనా ధర్మాన్ని అతిక్రమించారంటే వర్ణ ధర్మాన్ని అతిక్రమించారనే అర్థం. శూద్ర వర్ణ ధర్మాన్ని అతిక్రమించి తపస్సు చెయ్యడానికి పూనుకున్నాడు కాబట్టే శంబుకుణ్ణి రాముడు చంపాడు. ఆ విధంగా రాముడు 'ధర్మా' న్ని కాపాడాడు. రామరాజ్యం ధర్మాన్ని కాపాడిన రాజ్యం అంటే వర్ణధర్మాన్ని కాపాడిన రాజ్యం. కాబట్టి ప్రాచీన సాహిత్యం కూడా శ్రేయస్సును కోరుకున్నదనీ, ధర్మాన్ని గురించి చెప్పిందనీ అంటే ఈ స్పృహతో ఆలోచించడం అవసరం. దేశకాలాల్ని బట్టి మాటలకు అర్థాలు మారడం అనేది ఏ భాషకైనా సహజం.

ఎక్కడయినా సాహిత్యం పుట్టుక ప్రజల జీవన విధానంతో ముడిపడి వుంటుంది. కాలక్రమంలో అది ఎవరి ప్రయోజనాల్ని అయినా నెరవేర్చడానికి ఉపయోగపడవచ్చు. వర్గపూర్వ వ్యవస్థలో కూడా మానవులు తమ అనుభూతుల్నీ, ఆశల్నీ వ్యక్తం చేస్తూ సాహిత్యాన్ని సృష్టించుకున్నారు. సాహిత్యం తొలిరూపం మౌఖికంగానే ఉంటుంది. వేదాలు అలా పుట్టినవే. వేదాలు మొదట రాయబడలేదు, చెప్పబడ్డాయి. ఒకరు చెబుతుంటే తక్కినవాళ్లు పలికేవాళ్లు. విని మాత్రమే నేర్చుకునేవాళ్ళు. అందుకే వేదాలకు 'శ్రుతులు' అని కూడా పేరు. భాషకు లేఖన సంప్రదాయం వచ్చిం తర్వాత అవి లిఖిత రూపాన్ని పొందాయి. "ఓ ఇంద్రుడా ! మాకు వర్షాన్నివ్వు, మాకు పశువుల నివ్వు" లాంటి మాటలు వేదాలలో కనిపిస్తున్నాయంటే, ఆనాటి మానవుల అవసరాలు వాటిలో వ్యక్తం అవుతున్నాయని అర్థం. తమ జీవితాలకు ఉపయోగపడే, తమ జీవితాల్ని

తీర్చిదిద్దే ప్రకృతిని ఆరాధించేవాళ్ళు ప్రకృతి ఆరాధన వారికి సరదా కాదు, అవసరం ఆ అవసరం నుంచి పుట్టిందే తొలి సాహిత్యం. ప్రకృతి శక్తుల్ని దైవశక్తులుగా భావించడం, ఆ తర్వాత అవి అనేక అద్భుత శక్తులుగా చిత్రింపబడడం మొదలయినవన్నీ తర్వాతి పరిణామాలు. వేదాలు ఒక కాలంలో, ఒక ప్రాంతంలో ఒకరు చెప్పినవి కావు. భిన్నకాలాలలో, భిన్న ప్రాంతాలలో ఎందరో చెప్పినవి. కొంత కాలం అయిం తర్వాత అవన్నీ ఒక క్రమ పద్ధతిలో కూర్చబడ్డాయి వేదాల్లోగానీ, పురాణాల్లోగానీ ఎప్పటి కప్పుడు అనేక విషయాలు చేర్చబడ్డాయి వీటినే ప్రక్షిప్తాలు అంటారు. ఈ సంప్రదాయం మనకు చాలా కాలం కొనసాగింది వేమన పద్యాలలో కూడా అనేక ప్రక్షిప్తాలున్నా యనేది తెలిసిన విషయమే.

ప్రాచీన కాలంలో అభివృద్ధికరమైన ఆలోచనలు మతం ఆధారంగానో, తాత్విక చింతన ఆధారంగానో వ్యక్తం చెయ్యబడ్డాయి. ప్రతి కొత్త ఆలోచనా మత రూపాన్ని ధరించేది. చివరకు చార్వాకుల అభిప్రాయాల్ని కూడా చార్వాక మతం అన్నారు వైదికమతంలోని జంతుబలినీ, కర్మకాండల్నీ, వర్ణవ్యవస్థలోని అణచివేత ధోరణినీ నిరసించింది బౌద్ధమతం. వైదిక మతంలోని అణచివేత ధోరణిని తీవ్రంగా నిరసించిన అంబేద్కర్ చివరకు బౌద్ధమతాన్ని ఆశ్రయించాడు. ఆ రోజుల్లో బౌద్ధమతం నిర్వహించిన పాత్ర గొప్పదే కావచ్చు. కానీ ఈ రోజుల్లో కూడ దాన్నే ఆశ్రయించాల్సిన అవసరం లేదు బుద్ధుడికీ, ఈ కాలానికీ రెండున్నర వేల సంవత్సరాల అంతరం ఉంది ఇవాళ మన సమస్యలకు పరిష్కారాన్ని మతంలో వెతకక్కరలేదు. ఆధునిక దృక్పథంతో సామాజిక, ఆర్థిక, రాజకీయ విశ్లేషణ చేసుకోగలుగుతున్నాం. మూల కారణాలు తెలుసుకోగలుగుతున్నాం. రెండున్నర వేల సంవత్సరాల క్రితం ఒక సమస్యను పరిశీలించడానికి ఇవాళ మనకున్న వనరులు బుద్ధుడికి లేవు. ఆనాడు బుద్ధుడు చెప్పిన అహింస వేరు, ఈనాడు మనం చెప్పుకుంటున్న అహింసవేరు. వ్యవసాయ సమాజం అభివృద్ధి చెందుతున్న సమయంలో వైదికమత కర్మకాండల పేరుతో జరుగుతున్న విపరీతమయిన జంతుబలుల్ని నిరసించాడు బుద్ధుడు. ఆనాటి సమాజానికి జంతువుల అవసరం బాగా ఉంది అందుకే బుద్ధుడు చెప్పిన భూతదయ, అహింస అనేవి ప్రజల నుంచి రాజుల దాకా అందరినీ ఆకట్టుకున్నాయి. బౌద్ధమత సాహిత్యాన్ని ఈ నేపథ్యంలో చూడాలి.

ప్రాచీన కాలంలో దేవతల చరిత్రనీ, మతచరిత్రనీ పరిశీలిస్తే మానవజాతి చరిత్రనూ కొంతవరకు తెలుసుకోవచ్చు. వీటిన్నిటినీ తెలుసుకోడానికి ఇతర ఆధారాలతోపాటు ఆనాటి సాహిత్యం కూడా ఒక ముఖ్యమైన ఆధారమే. భారత యుద్ధంగానీ, రామ రావణ యుద్ధంగానీ ఆస్తి తగాదాలు తప్ప వేరు కావు. రాజుల ఆస్తి రాజ్యమే. ఆ రాజ్యం కోసమే అన్నదమ్ములయిన పాండవులూ, కౌరవులూ తలపడ్డారు. పురాణ కథల్లోని అద్భుత సంఘటనలనూ, దైవశక్తులనూ, నీతులనూ పక్కనబెట్టి చూస్తే ఆనాటి సమాజంలోని వైరుధ్యాలు కొంతవరకైనా అర్థం అవుతాయి. ఉత్పత్తి సంబంధాల్లోనూ, ఆస్తి సంబంధాల్లోనూ వచ్చిన మార్పులు ఆ కట్టు కథల్లోకూడా

కనిపిస్తాయి నిజంగా ఇది జరిగిందా లేదా అనిగాక ఈ కథ పుట్టటానికి గల సామాజిక వైరుధ్యం ఏమిటని పరిశీలించాలి. పరశురాముడు బ్రాహ్మణుడైనా గండ్రగొడ్డలి ధరించి రాజులందరినీ ఇరవయ్యొక్కసార్లు నరికిపారేశాడని కథ. రాజులందర్నీ ఒక్కసారి నరికెయ్యడం కూడా ఎవ్వరికీ సాధ్యం కాదు. అసలీ కథ ఎందుకు పుట్టిందనేది ముఖ్య విషయం. మానవుడు ఆహారసేకరణ దశ దాటి ఆహారోత్పత్తి దశలో ప్రవేశించిం తర్వాత వ్యవసాయం అభివృద్ధి చెందింది. నాగలి అనే పనిముట్టు వ్యవసాయంలో గణనీయమైన అభివృద్ధిని తీసుకొచ్చింది. వ్యవసాయం వల్ల అదనపు ఉత్పత్తి రాసాగింది. ఇది ఎవరికి చెందాలి అనే విషయంలో సహజంగా రాజులూ, బ్రాహ్మణులూ పోటీ పడతారు. రాజ్యాధికారం, భూమ్మీద అధికారం రాజులదయితే, వారి అధికారాలకు ఆమోదముద్ర వేసేది బ్రాహ్మణవర్గం -అంటే పురోహితవర్గం. వీళ్ళిద్దరిమధ్యా మిగులు ఉత్పత్తి కోసం తగాదావస్తే చివరకు గెలిచేది రాజులే. అందుకే రాజులపట్ల బ్రాహ్మణవర్గంలో ఉన్న అసంతృప్తిని పోగొట్టుకోడానికీ కసిని తీర్చుకోడానికీ ఈ కథను సృష్టించి ఉండాలి. వర్ణ వ్యవస్థ నియమాల ప్రకారం పరశురాముడు ఆయుధం పట్టకూడదు. అయినా పట్టాడు. దీని లక్ష్యం వర్ణధర్మాల చట్రాన్ని చెరిపెయ్యడం కాదు. ఇలాంటి ఉదాహరణల్ని చూపి ఆనాడు కూడా వర్ణభేదాలు లేవని చెప్పడానికి ప్రయత్నించడం అశాస్త్రీయం. ఋగ్వేద కాలానికి ఇంద్రుడే ప్రధానమైన దేవుడు. ఆ తర్వాతి కాలంలో ఇంద్రుడు ప్రాధాన్యాన్ని కోల్పోయి త్రిమూర్తులు అవతరించారు. వ్యవసాయ సమాజంలో వ్యవసాయంతో ముడిపడివున్న అనేక ఇతర వృత్తులు ఏర్పడ్డాయి. ఒక్కొక్కవృత్తిని అనుసరించే మానవబృందాలు ఏర్పడ్డాయి. వృత్తులు ఏర్పడ్డాయి. ఒక్కొక్క వృత్తిని అనుసరించే మానవబృందాలు ఏర్పడ్డాయి. మానవ సమాజంలో వచ్చిన శ్రమ విభజనకూ, త్రిమూర్తుల సృష్టికీ ఎంతో కొంత సంబంధం ఉండి ఉండాలి. చరిత్ర రచనకు మన ప్రాచీన సాహిత్యం కూడా ఒక ఆధారం అవుతుందని సుప్రసిద్ధ ఆధునిక చరిత్రకారుడు కోశాంబి నిరూపించాడు.

తెలుగు సాహిత్యం నన్నయ్యతోనే ప్రారంభం కాలేదు. మనకు దొరికినంత వరకు లిఖిత సంప్రదాయంలో వచ్చిన మొదటి పెద్ద రచన భారతం. నన్నయ భారతానువాదానికి నడుంగట్టాడేగాని, స్వతంత్ర కావ్యరచనకు పూనుకోలేదు. భూస్వామ్య సమాజంలో రాజాస్థానాల్లో, పండితలోకంలో సంస్కృతానికున్న ఆదరణ, గౌరవం ఇతర భాషలకు లేవు. అందుకే ప్రముఖ కవులందరూ సంస్కృత కావ్యాలనే అనువదించారు లేదా అనుసరించారు. సంస్కృతంలోనూ కావ్యాలూ, లక్షణ గ్రంధలూ రాశారు. సంస్కృత సాహిత్యం ఉన్నవారికే రాజాస్థానాల్లో చోటు. తెలుగు సాహిత్యం సంస్కృతపదభూయిష్టం కావడానికి ఈ నేపథ్యం ఒక ముఖ్య కారణం. అయితే సంస్కృతానికి ఇంతగౌరవం ఎందుకొచ్చింది ? వైదికమత సంబంధమైన రచనలు సంస్కృతంలో ఉన్నాయి. సంస్కృతం కాలక్రమంలో సంస్కరింపబడ్డ భాష. ఈ సంస్కరింపబడిన సంస్కృతం ఎవరికీ మాతృభాష కాదు. ఇది రాజభాషగా చెలామణి అయింది. ఈ భాషను ఆధారం చేసుకొని వృద్ధిచెందిన వైదికమతం దాని అభివృద్ధికి దోహదం చేసింది భారతాన్ని

అనువాదం చెయ్యమన్న రాజులుగానీ, చేసిన కవులుగానీ వైదికమత పునరుద్ధరణను కోరుకున్నవారే. అందుకే రాజులు సంస్కృతానికి అంత ప్రాధాన్యం ఇచ్చారు. వైదికమతం పుట్టుకతోనే దోపిడీ స్వభావం కలిగిందిగా కనిపిస్తుంది. ఏ తిరుగుబాటునైనా నిర్వీర్యం చేసి తనలో ఇముడ్చుకోగల శక్తి దానికుంది. కాబట్టే ఇది పాలక వర్గాలకు బాగా ఉపయోగపడుతుంది అందువల్ల రాజులందరూ సంస్కృత భాషకూ సంస్కృత సాహిత్యానికీ, సంస్కృతం తెలిసిన పండితులకూ విలువ ఇచ్చారు

గొప్ప కవులుగా పేరు ప్రతిష్ఠలు పొందిన వాళ్ళందరూ రాజుల్ని ఆశ్రయించిన వాళ్ళే. రాజులకు కవిత్వాన్ని అమ్ముకుని బతికిన వాళ్ళే. పాల్కురికి సోమన వంటి శివకవులు సంస్కృత ప్రాబల్యాన్నుంచి తెలుగు కవిత్వాన్ని కొంతవరకు రక్షించారు అంతవరకూ వైదిక మతంలో ఉన్న దారుణమైన అసమానతలకు అడ్డుకట్ట వేశారు. శివభక్తులైతే చాలు అన్ని వర్ణాల వాళ్ళూ ఒకటే అని చాటారు. ఈ సమానత్వం ఉండడం వల్ల శివకవుల కవిత్వం ఆనాడు ప్రజలకు దగ్గరైంది. కొంతవరకైనా ప్రజల భాషను స్వీకరించింది. కవితా సరస్వతిని రాజులకు అమ్మనని చెప్పుకున్న పోతనగానీ, "రాజుల్మత్తులు, వారిసేవ నరకప్రాయంబు" అని చెప్పిన ధూర్జటిగానీ సారాంశంలో నన్నయాది కవుల కంటే భిన్నంకాదు.

కృష్ణదేవరాయల కాలం కవులకు మాత్రమే స్వర్ణయుగం. రాజులతో బాటు కవులు కూడా సుఖభోగాలనుభవించిన కాలం అది. ఆ సుఖభోగాలే వాళ్ళ కవిత్వంలోనూ చోటు చేసుకున్నాయి. రాయల కాలంలో కొత్త ప్రక్రియగా వచ్చిన ప్రబంధం రాజుల విలాస జీవితానికి ప్రతిబింబం అయింది. స్త్రీ కేవలం భోగ వస్తువుగా చిత్రింపబడింది భారతం, రామాయణం వంటి పురాణ కథల్లో ఉన్న వ్యక్తిత్వం కూడా స్త్రీకి లేకపోయింది.

రాజాస్థానాలకు భిన్నంగా, సంస్కృత సంప్రదాయానికి భిన్నంగా, ప్రజలకు దగ్గరగా వచ్చిన తెలుగు కవిత్వం లేకపోలేదు. పదాలు పాటలు, తత్వాలు, కీర్తనలు చాటువులు, శతక పద్యాలు మొదలయినవన్నీ ఈ కోవలోకి వస్తాయి. అయితే వీటికి రాజాస్థానంలో చోటులేదు. అందుకే ఈ కవులకు పేరు ప్రతిష్ఠలు రాలేదు. తెలుగులో వందల సంఖ్యలో శతకాలున్నాయి. ఈ శతకాలన్నీ ప్రజల జీవితాన్ని చిత్రించాయని కాదు. ఎంతో కొంత ప్రజల జీవితానికి అద్దం పట్టేవి కొంతవరకైనా యివే. ప్రబంధాలు రాజాస్థానానికే పరిమితం అయివుంటే, ప్రజల్లో సజీవంగా ఉన్నది ఈ సాహిత్యమే. రాయలసీమ ప్రాంతంలో అక్షరాస్యులు కాని వాళ్ళకు కూడా వేమన పద్యాలు ఒకటీ రెండూ రాకుండా వుండవు. రాజులపైనా, రాజాస్థానాలకు పరిమితమైపోయిన కవులపైనా ఆనాడు నిరసన లేకపోలేదు. ఆ నిరసన పద్యాల రూపంలో వ్యక్తం కాకుండానూ పోలేదు. కృష్ణదేవరాయలపైనా, అల్లసాని పెద్దనపైనా తెనాలి రామలింగని పేరుతో ఉన్న పద్యాలు, కథలు ఇలాంటివే. తెనాలి రామలింగనికి అంటగడితే ఆ నిరసన ధ్వనులకు కొంతైనా విలువ ఉంటుందని వారి అభిప్రాయం అయి వుండాలి, "తోటకూరకైన, దొగ్గలాకునకైన, కవిత చెప్పగాడ్డె కొడుకులు ఘనులైరి" అని వేమన పద్యాలలో ఉన్నదీ ఇలాంటి నిరసనే. ఈ పద్యాన్ని వేమనే చెప్పి ఉండకపోవచ్చు

రాజుల నిరాదరణకు గురైన కవులు, రాజుల్ని నిరసించి దూరంగా ఉన్న కవులు పని చేసుకుని బతికేవాళ్ళు దేవుడిపైన భారం వేసేవాళ్ళు పాలకవర్గాన్ని నిలదీసి ప్రశ్నించే వాళ్ళకు ఈనాడు ప్రజాశక్తి ఆధారమయితే ఆనాడు దేవుడు ఆధారం. ఏదో ఒకశక్తి అండగా లేకపోతే రాజుల్ని నిరసించడం అంత తేలికైన పని కాదు.

ఆ తర్వాత దశ అయిన దక్షిణాంధ్ర యుగాన్ని క్షీణ యుగం అని అనడం అలవాటైపోయింది. నిజానికి సాహిత్యం బాగా ప్రజల దగ్గరకు వెళ్ళింది ఈ కాలంలో. యక్షగానం అనే ప్రక్రియ బాగా అభివృద్ధి కావడమే గాక, అది దృశ్యం కూడా కావడంతో ప్రజలకు చేరువైంది. యక్షగానాల్ని ప్రదర్శించే వాళ్ళు కూడా సంఘంలో సామాన్యులే గనుక వారి జీవితం కొంతవరకైనా వాటిలో వ్యక్తం కావడం సహజం.

తెలుగులో ఆధునిక సాహిత్యం బ్రిటిష్ ప్రభుత్వ పాలనలో 19వ శతాబ్ది చివరి భాగంలో మొదలయింది. సంప్రదాయ సాహిత్య రూపాలనూ, నవలవంటి ఆధునిక రూపాలనూ సంఘ సంస్కరణ భావ ప్రచారానికి బాగా వాడుకున్నది కందుకూరి వీరేశలింగం. రాజకీయాధికారాన్ని కోరకుండా సంఘ సంస్కరణ కార్యకలాపాలు ఎంత ఎక్కువ చేసినా బ్రిటిష్ పాలకులకు అభ్యంతరం లేకపోయింది. మూఢ విశ్వాసాల నిర్మూలన, సాంఘిక దురాచారాల పట్ల నిరసన, స్త్రీ విద్య, వితంతు వివాహాలు మొదలైన సంఘ సంస్కరణలు బ్రిటిష్వారికి తక్షణ ప్రమాదాన్ని తీసుకొచ్చేవి కావు. అందుకే వాళ్ళు సంఘ సంస్కరణ కార్యకలాపాల్ని ప్రోత్సహించారు.

తెలుగు సాహిత్యంలో సంప్రదాయ ప్రభావాన్నుంచి పూర్తిగా బయటపడి నిజమయిన ఆధునిక సాహిత్య సృష్టి చేసింది గురజాడ, వస్తువు విషయంలో కందుకూరికీ, గురజాడకూ పెద్ద తేడా లేకపోయినా సాహిత్య రూపాలలో సంప్రదాయం వదిలించుకున్నాడు గురజాడ. కన్యాశుల్కం, ముత్యాలసరాలు దీని కుదాహరణలు. సాంప్రదాయికంగా అనుసరిస్తూ వస్తున్న నాయికా నాయకుల లక్షణాలు, రసం మొదలయిన విషయాల్లో అలంకార శాస్త్ర నియమాలకు చెంప పెట్టు లాంటి సమాధానం కన్యాశుల్కం.

అయితే గురజాడకు వెంటనే వారసులు లేకపోయారు. రాయప్రోలు సుబ్బారావుతో ప్రారంభమయిన భావకవిత్వ ధోరణి దేవులపల్లితో పరాకాష్ఠకు చేరుకుంది. తమది అమలిన శృంగారం అన్నాడు రాయప్రోలు. ప్రబంధాల్లో ఉన్నది మలిన శృంగారం అని అర్థం. ప్రబంధాల్లో శృంగారం శ్రుతిమించింది. భావకవుల్లో 'పవిత్రమైంది'. శరీరంతో సంబంధం లేని స్వచ్ఛమైన ప్రేమగా చెప్పుకున్నారు. ప్రబంధ స్త్రీకి శారీరక సౌందర్యం తప్ప మనస్సు లేదు. భావకవిత్వంలోని స్త్రీకి మనస్సు తప్ప శరీరం లేదు. స్త్రీని ప్రబంధ కవులు ఒక చివరికి తీసుకెళ్ళినా, భావకవులు మరో చివరికి తీసుకెళ్ళారు. మొత్తంమీద రెండు చోట్లా స్త్రీకి స్వతంత్ర వ్యక్తిత్వం లేకుండా పోయింది. ఏమయినా భావకవిత్వంలో ఎన్ని నెగటివ్ అంశాలున్నా, ఒకటి రెండు పాజిటివ్ అంశాలు కూడా లేకపోలేదు ఒకటి స్త్రీ విలాస వస్తువు కాదని చెప్పడం అయితే, రెండోది జాతీయోద్యమ ప్రేరణతో ఏదో తెలియని స్వేచ్ఛను కోరుకోవడం. ఆ స్వేచ్ఛ రాజకీయమైనదా, సామాజికమైనదా,

ఆర్థికమైనదా అనే స్పష్టత లేకపోయినా, నేను ఎవరికీ బానిసను కాను, స్వేచ్ఛా పరుణ్ణి అని చెప్పుకునేంత మేరకైనా అది పాజిటివ్ అంశమే. భావకవుల దృష్టిలో స్త్రీ విలాస వస్తువు కాదు. అయితే పవిత్ర వస్తువు. మొత్తం మీద వస్తువే అయింది. ఆ 'వస్తువు' పైన పురుషుడిదే పెత్తనం అయింది

భావ కవిత్వంలో ఒక శాఖగా చెప్పబడుతున్న జాతీయోద్యమ కవిత్వం నిజానికి ఉద్యమ కవిత్వం. దీనికీ, భావకిత్వానికీ స్వరూపంలోనూ, స్వభావంలోనూ చాలా తేడా వుంది. స్వరాజ్య సంపాదన, బ్రిటిష్ పాలకుల పట్ల నిరసన జాతీయోద్యమ కవిత్వంలో విషయాలు. భావకవిత్వంలో కొంత స్వేచ్ఛా ధోరణి కనిపించినా, అది జాతీయోద్యమ కవిత్వానికి భిన్నమైందిగానే కనిపిస్తుంది. కాల్పనికత, మార్మికత భావకవిత్వంలో ప్రధానంగా చోటు చేసుకున్నాయి జాతీయోద్యమ ప్రభావం అనేక మందిపైన అనేక రకాలుగా ఉంది. ఉప్పుపైన కూడా కొంతమందిచేత పాటలు చెప్పిస్తే, గత వైభవాన్ని తల్చుకునే విధంగా కొందరిచేత కవిత్వం రాయించింది

శ్రీశ్రీ 'మహాప్రస్థాన' గేయాలు తెలుగు కవిత్వానికి పట్టిన పాత బూజును పూర్తిగా దులిపేశాయి. రష్యా విప్లవం, ప్రపంచ వ్యాప్తంగా పెట్టుబడిదారీ దేశాలను కుదిపేసిన ఆర్థిక సంక్షోభం, అంత ఆర్థిక సంక్షోభంలోనూ సోవియట్ యూనియన్ నిలదొక్కుకున్న తీరూ శ్రీశ్రీని ప్రభావితం చేశాయి. ప్రపంచంలోని పీడిత వర్గానికి మార్క్సిజమే శరణ్యం అని భావించాడు. సోవియట్ యూనియన్ తొంగిచూసిన ఆ మరో ప్రపంచం గురించి కలలు కన్నాడు ఆ ప్రపంచాన్ని చేరుకోడానికి మహా ప్రస్థానం ప్రారంభించాడు. తెలుగు కవిత్వాన్ని విప్లవీకరించిన ఘనత శ్రీశ్రీది. ఆ విధంగా శ్రీశ్రీ అభ్యుదయ సాహిత్యోద్యమానికి నాయకుడయ్యాడు. నిజాం పాలనలో భూమి కోసం, భుక్తి కోసం జరిగిన సాయుధ రైతాంగ పోరాటానికి కమ్యూనిస్టు పార్టీ నాయకత్వం వహించింది. ఆ ఉత్తేజంతో అభ్యుదయ రచయితల సంఘం కొంత కాలం సజీవంగా పనిచేసింది. అయితే రాను రాను అది పుష్పక విమానంలా తయారయింది. అభ్యుదయం అన్న ప్రతి కవికీ అందులో చోటు దొరికింది. విశ్వనాధ, దేవులపల్లి వంటివారు కూడా అరసం వేదిక లెక్కారు. అభ్యుదయ రచయితలకు మార్క్సిజం తప్పనిసరి కాకుండా పోయింది. అప్పటికే రష్యాలో రివిజనిజం ప్రవేశించి అది సోషల్ సామ్రాజ్యవాదంగా మారడానికి సిద్ధంగా వుంది. కృశ్చేవ్ ప్రవేశపెట్టిన శాంతియుత పరివర్తన, శాంతియుత పోటీ, శాంతియుత సహజీవనం అనే వాటిపట్ల భారత కమ్యూనిస్టు పార్టీ కూడా ఆకర్షింపబడింది. 1964లో భారత కమ్యూనిస్టు పార్టీ చీలింది అప్పటికే నక్సల్బరీ, శ్రీకాకుళాలలో గిరిజనులు భూమిపై హక్కును సాధించడానికి చిన్న చిన్న పోరాటాలు చేస్తున్నారు. 1967 నాటికి అవి బద్ధలయ్యాయి. మార్క్సిస్టు పార్టీ అగ్రనాయకత్వం ఈ పోరాటాలకు నాయకత్వం వహించలేదు. బెంగాల్‌లో మార్క్సిస్టు పార్టీ నాయకత్వంలోని ప్రభుత్వమే ఆ పోరాటాన్ని దారుణంగా అణిచివెయ్యటానికి కంకణం కట్టుకుంది. ఈ నేపథ్యంలో 1969లో భారత కమ్యూనిస్టు పార్టీ (మార్క్సిస్టు లెనినిస్టు) ఏర్పడింది

భారత కమ్యూనిస్టు పార్టీ తెలంగాణా పోరాటాన్ని ఆపివెయ్యడంతోనే ఆత్మహత్య చేసుకున్నట్టయింది. 1956 మధ్యంతర ఎన్నికల్లో ఆంధ్రలో కాంగ్రెస్, కమ్యూనిస్టు పార్టీలు నువ్వా నేనా అన్నట్టుగా తలపడ్డాయి. కమ్యూనిస్టు పార్టీ దారుణంగా ఓడిపోయింది. కేరళలో ఏర్పడ్డ కమ్యూనిస్టు ప్రభుత్వాన్ని నెహ్రూ ప్రభుత్వం రద్దుచేసింది. పార్లమెంటరీ విధానం ఎంత బూటకమో గుర్తించడానికి తగిన నేపథ్యం ఉన్నా కమ్యూనిస్టుపార్టీ ఆ బురదలోనే మరీ కూరుకుపోయింది. పోరాట చేవను కోల్పోయింది అటు అంతర్జాతీయంగానూ, ఇటు జాతీయంగానూ వచ్చిన ఈ తిరోగమన ధోరణి సాంస్కృతిక రంగంలో అరసాన్నీ, ప్రజానాట్య మండలినీ నిర్వీర్యం చెయ్యనారంభించాయి. చివరకు నిర్వీర్యం చేశాయి. ఈ నేపథ్యంలో రాత్రి కవులు, దిగంబర కవులు, తిరుగబడు కవులు సాహిత్య రంగంలో ఒక సంచలనం సృష్టించారు సమాజంలో పేరుకుపోయిన అవినీతినీ, కుళ్ళునూ కడిగిపారేశారు. సాహిత్య రంగంలోని గోడమీది పిల్లి వాటాన్ని నిరసించారు. రచయితల నిస్పృహాయతనూ, నిర్వీర్యతనూ నిలదీసి ప్రశ్నించారు. దీంతో అందరూ సాహిత్య ప్రయోజనం గురించీ, సాహిత్య సమాజాల అంతస్సంబంధం గురించీ తీవ్రంగా చర్చించారు. అప్పటికే శ్రీకాకుళ గిరిజనుడు రక్తం చిందిస్తున్నాడు. సుబ్బారావు పాణిగ్రాహితో సహా చాలామంది నేలకొరిగారు. 1970 ఫిబ్రవరిలో విశాఖలో జరిగిన శ్రీశ్రీ షష్టిపూర్తి సభలో విశాఖ విద్యార్థులు రచయితలారా మీ రెటువైపని సవాల్ విసిరారు. ఒకవైపు పాణిగ్రాహిలాంటి రచయితలు ప్రాణాలకు తెగించి పోరాడుతుంటే షష్టిపూర్తులూ సన్మానాలూ ఏమిటని ప్రశ్నించారు ఈ సంఘటనల ఫలితమే 1970 జులై 4న విప్లవ రచయితల సంఘం స్థాపన. ఆనాడు విరసం ఏర్పడడం ఒక చారిత్రక అవసరం. విరసం ఏర్పడ్డ ఆరు రోజుల్లోనే శ్రీకాకుళ పోరాట వీరులు వెంపటాపు సత్యం, ఆదిభట్ల కైలాసంలను కసాయి కాంగ్రెస్ ప్రభుత్వం కాల్చి చంపింది నక్సల్బరీ శ్రీకాకుళ పోరాట నాయకుల్ని జైళ్ళల్లో పెట్టడమో, చంపడమో దాదాపు పూర్తయింది. విప్లవ వీరులు చిందించిన రక్తపు మడుగులోంచి, సుబ్బారావు పాణిగ్రాహి వారసత్వంలోంచి, మార్క్సిజం, లెనినిజం, మావో ఆలోచనా విధానం ప్రాపంచిక దృక్పథంగా విరసం ఏర్పడింది. విరసం ఏర్పడేటప్పటికి ఉద్యమం దాదాపు అణగారిపోయింది. అయినా విరసం ఆ ఉద్యమ స్ఫూర్తిని, పోరాటపు చైతన్యాన్ని, విప్లవ అవసరాన్ని తన రచనల ద్వారా, ప్రసంగాల ద్వారా, పాటలద్వారా, ప్రదర్శనల ద్వారా ప్రచారం చేసింది. సాంస్కృతిక రంగంలో విరసం ఒక ప్రభంజనంలా వీచింది. వందలాది అమరవీరుల త్యాగాలను కొనియాడడమే కాదు, ఆ త్యాగాల ఫలితాల పట్ల ప్రజల్లో ఆశలు రేకెత్తించింది. త్యాగం వ్యర్థంగా పోదని నిశ్చయంగా, నిర్భయంగా పలికింది. నిజాన్ని నిర్భయంగా చెప్పినందుకు నిర్బంధాలకు లోనయింది విప్లవ రచయితలు ప్రజల్లో కలిగించిన ఆశలు చిగురించాయి. జగిత్యాల జైత్రయాత్ర మొదలయింది. మళ్ళీ తెలంగాణా జిల్లాల్లో గిరిజనుడు సాయుధుడయ్యాడు. పటిష్ఠమయిన నిర్మాణంతో మరింత శక్తిమంతుడయ్యాడు గిట్టుబాటు ధరలు కల్పించమనీ, సారాయిని నిషేధించమనీ,

భూముల్ని పేదలకు పంచమనీ ప్రజా ఉద్యమాలు పెల్లుబుకుతున్నాయి. వాటిని చూసి పాలకవర్గాలు బెంబేలు పడిపోయి కేంద్ర ప్రభుత్వాన్ని దేబిరించి సరిహద్దు భద్రతా దళాన్ని రప్పించుకున్నాయి. ప్రజా పోరాటాల్ని తుదముట్టించాలని పగటి కలలు కంటున్నాయి. ఈ నేపథ్యంలో విప్లవ రచయితల పాత్ర మరింత కఠిన తరమైంది రచయితల కలాలు పదునెక్కవలసింది ఇప్పుడే.

గత 21 సంవత్సరాలుగా విరసం సాంస్కృతిక కృషి పట్ల ఎవరు ఎన్ని అభిప్రాయాలు వెలిబుచ్చినా ఒక్కటి మాత్రం నిజం. ఉజ్వల భవిష్యత్తు కోసం జరిగే వర్తమాన శ్రామికవర్గ పోరాటాల్ని విరసం గానం చేసింది, చేస్తోంది, చేస్తుంది. విప్లవ రచయితలు కేవలం రాజకీయ ప్రచారానికే పరిమితం కాలేదు. ప్రజా రాజకీయాల బలంతో సాహిత్యాన్ని మరింత శక్తిమంతం చేస్తున్నారు. సమకాలీన ప్రజా ఉద్యమాల ప్రేరణే గొప్ప సాహిత్యాన్ని సృష్టిస్తుందని నిరూపించారు. సాహిత్యాన్ని ఆనందం కోసం రాసిన వాళ్ళున్నారు. సాహిత్యంలో సమాజాన్ని ప్రతిబింబించి సంతృప్తిపడ్డ వాళ్ళున్నారు. సాహిత్యంతో వ్యాపారం చేసుకునే వాళ్ళున్నారు. సాహిత్యాన్ని నగ్నంగా నడివీధుల్లో తిప్పేవాళ్ళూ వున్నారు. కానీ సాహిత్యాన్ని పీడిత ప్రజల చేతిలో ఒక బలమైన ఆయుధంగా మారుస్తున్నవాళ్ళు విప్లవ రచయితలు. ఈ ఆయుధాన్ని మరింత శక్తిమంతంగా తయారుచేసుకోవడానికి ఇంకా ఎంతో శ్రమ పడవలసి వుంది.

*(అరుణతార : డిసెంబర్ 1991 - జనవరి 1992)*

# రచయితల బాధ్యత

సమాజంలో రచయితల బాధ్యత చాలా వుంటుంది. ఒక వ్యక్తి రచయితగా రూపొందడానికి సమాజం పరోక్షంగా ఎంతో దోహదం చేస్తుంది ఎందరో శ్రామికులు రెక్కలు ముక్కలు చేసుకుని ఉత్పత్తిలో ప్రత్యక్షంగా పాల్గొని మేధావులకూ, రచయితలకూ, కళాకారులకూ విశ్రాంతిని కల్పిస్తున్నారు. ఆ విశ్రాంతి వీరి బాధ్యతను మరింత పెంచుతోంది. ఏ సమాజం తమను రచయితలుగా మార్చిందో, ఆ సమాజం పట్ల బాధ్యత కలిగివుండడం రచయితల కనీసపు బాధ్యత.

సమాజాన్ని అర్థం చేసుకోవడానికి రచయితలకు అధ్యయనం అవసరం. ఆ అధ్యయనం సక్రమ పద్ధతిలో సాగడానికి ఒక దృక్పథం వుండాలి. ఆ దృక్పథాన్ని కలిగించడానికి ఒక తాత్విక చింతన ఉండాలి. ఇదే రచయిత ప్రాపంచిక దృక్పథం. శతాబ్దాల కాలంలో ప్రపంచాన్ని వ్యాఖ్యానించే ఎన్నో సిద్ధాంతాలు, దృక్పథాలు వచ్చాయి. కానీ శాస్త్రీయమైన ప్రాపంచిక దృక్పథంగా మార్క్సిజం బలంగా ముందుకొచ్చింది. ఎవరు ఎన్ని విమర్శలు చేసినా ఇది తిరుగులేని సత్యం.

మార్క్సిస్టు దృక్పథంతో ఎన్నాళ్ళనుంచో సాహిత్యం వస్తున్నా, నక్సల్బరీ వెలుగులో వస్తున్న సాహిత్యాన్ని విప్లవ సాహిత్యం అంటున్నాం. కమ్యూనిస్టు పార్టీలు రివిజనిజం ఊబిలో కూరుకుపోయిన నేపథ్యంలో నక్సల్బరీ నిజమైన విప్లవోద్యమానికి ప్రారంభ సంకేతంగా నిలిచింది. ఆ ప్రేరణతోనే విప్లవ సాహిత్యం ఒక ఉద్యమ రూపాన్ని ధరించింది.

ఇవాళ విప్లవ సాహిత్యం పని అయిపోయిందని కొందరు తీర్పు చెప్పేస్తున్నారు. విరసం మరణించిందని శివసాగర్ అంటే, విప్లవ కవితావిపంచి ఒక విరామ చిహ్నంగా మిగిలిపోయిందని ఎ.బి.కె. ప్రసాద్ అన్నారు. ఆయుధం పట్టమని చెప్పడం వరకే విప్లవ కవిత్వం పరిమితమయిందని చేరా అంటే, అసలు జీవితం శాస్త్రీయ విశ్లేషణకు లొంగదనీ ఆ ప్రయత్నం చెయ్యడం వల్లనే మార్క్సిస్టులు విఫలం అయ్యారని ఇస్మాయిల్ తేల్చిపారేశారు. ఇటీవల 'సుప్రభాతం' వెలువరించిన 'కవిత' ప్రత్యేక సంచికలో ఇలాంటివే ఇంకా కొన్ని విమర్శలున్నాయి. ఈ విమర్శలు చేసిన వాళ్ళలో ఎన్నో వైరుధ్యాలున్నాయి. వీళ్ళందరికీ సమాజం పట్ల ఒకే దృక్పథం లేదు. సామాజిక పరిణామ క్రమంలో సాహిత్యం పాత్ర ఏమిటనేది తమ అభిప్రాయాలు చెప్పడం పైనగాక విప్లవ సాహిత్యాన్ని తూలనాడటంపైనే అందరూ కేంద్రీకరించారు. దానికి ఎవరి ప్రయోజనాలు వారికున్నాయి. 'సుప్రభాతం' వీళ్ళందరినీ తన వేదికపైకి తెచ్చుకుని తన అవసరానికి ఉపయోగించుకున్నది.

విప్లవ కవిత్వం అంటే 'ఆయుధం పట్టుకో' అనడం తప్ప మరేమీ కాదని చెప్పడం ఎంత అన్యాయమో ఎవరికివారే సులభంగా అర్థంచేసుకోవచ్చు. ఇతర కవిత్వాలలో కూడా లేని వైవిధ్యం నిజానికి విప్లవ కవిత్వంలో ఉంది. విప్లవ కవిత్వం

అంటే నినాద ప్రాయమనో, `కొట్టు చంపు, నరుకు' అనో లూజ్ కామెంట్ చెయ్యడం ఒక ఫ్యాషన్ అయిపోయింది. విప్లవ కవితలన్నిటినీ పరిశీలించి చెప్పిన మాటలు కావివి గత దశాబ్ద కాలంలోనే విరసం సభ్యులు వెలువరించిన కవితా సంకలనాల్లో రానివెన్నో ఉన్నాయి. ఒకసారి వాటిని తిరగేసే ఓపిక ఉంటే పై విమర్శలు రావు.

కమ్యూనిజంపైనా, విప్లవ సాహిత్యంపైనా ఇటీవల పెద్ద దాడి జరగడానికి ఒక నేపథ్యం లేకపోలేదు. అంతర్జాతీయంగా వచ్చిన పరిణామాల్ని దృష్టిలో పెట్టుకుని కమ్యూనిజానికి కాలం చెల్లిందని బూర్జువా ప్రపంచం చేస్తున్న ప్రచార హోరులో కొట్టుకు పోవడం ఈ విమర్శకుల కున్న ఒక పరిమితి. సోషల్ సామ్రాజ్య వాదం సంక్షోభానికి గురైతే, అమెరికన్ సామ్రాజ్యవాదం సంక్షోభంలో కొట్టుమిట్టాడుతుంటే, ఆ సంక్షోభాల సంఘర్షణలో పెట్టుబడిదారీ సమాజం విజయం పొందినట్టూ, సోషలిజం పతనమైనట్టూ కలిగిన భ్రమాజనిత సంతోషంలో మునిగితేలుతున్న మేధావి వర్గం ఒకటి కనిపిస్తోంది ఆ మత్తుతో కమ్యూనిజం పతనాన్ని ఊహించుకుంటున్నంత కాలం వారికి వాస్తవాలు కనబడవు.

గత రెండున్నర సంవత్సరాలుగా శివసాగర్ విరసంపైన చేస్తున్న అర్థం పర్థం లేని విమర్శలను విరసం పట్టించుకోకపోవడం కూడా విరసంపై దాడి పెరగడానికి ఒక కారణం కావచ్చు. విరసం సభ్యుడిగా ఉండి బాధ్యతారహితంగా మాట్లాడ్డం శివసాగర్‌కి చెల్లింది. విరసంలో చర్చకు పెట్టని విషయాలను నేరుగా బయట మాట్లాడ్డం ఆయన అలవాటు. పచ్చి అబద్ధాలు చెప్పడం ఆయనకు వెన్నతో బెట్టిన విద్య. విరసంలో ఒకరిద్దరు వ్యక్తులపై ఉన్న కోపాన్ని విరసంపై ప్రదర్శించడం ఆయన కుట్రపూరిత స్వభావానికి నిదర్శనం. ఆయనకు బాధ్యత లేకపోతే సంస్థకు బాధ్యత లేకుండా పోదు అందుకే రెండు సంవత్సరాల పాటు విరసం ఆయనను భరించింది ఆయన పట్ల విరసం ప్రదర్శించిన ఉదార స్వభావాన్ని ఆయనే భరించలేక పోయాడు శివసాగర్ పట్ల విరసం ఒక పద్ధతికి కట్టుబడి ఉండడాన్ని అసమర్థతగా భావించాడు ఆయనతోబాటు చాలామంది అలాగే భావించారు. అందుకే విరసం పని అయి పోయిందని తృప్తిపడ్డారు. వీళ్లు విప్లవ సాహిత్యోద్యమానికి ప్రత్యామ్నాయంగా మరొక సాహిత్య ఉద్యమాన్ని సృష్టించలేరు విప్లవ సాహిత్యాన్ని గౌరవించనూ లేరు. అటూ ఇటూ గాని ఈ వ్యాధితో బాధపడుతున్నవాళ్ళు విరసాన్ని తిడుతూ ఊరట చెందుతున్నారు విరసాన్ని తిట్టడం ద్వారా తమ ఉనికిని కాపాడుకుంటున్నారు.

వర్గ సమాజం ఉన్నంత కాలం దోపిడీ తప్పదు. దోపిడీని నిర్మూలించాలంటే దోపిడీకి గురయ్యే శ్రామిక వర్గం మొత్తం ఏకమై విప్లవించాలి శ్రామిక వర్గాన్ని ఏకతాటిపై నడిపించగలిగేది మార్క్సిజం మాత్రమే ఇవాళ విప్లవోద్యమం పాలక వర్గంతో రాజీలేని పోరాటం చేస్తోంది ఆ ఉద్యమం విప్లవ సాహిత్యానికి ప్రేరణ ఇవాళ పేరు ప్రతిష్ఠలు లేని సాధారణ వ్యక్తులు కూడా గొప్ప సాహిత్యాన్ని సృష్టిస్తున్నారు. అలాంటి యువ విప్లవ రచయితలూ, రచయిత్రులూ సృష్టిస్తున్న సాహిత్యాన్ని చూడ నిరాకరించేవాళ్ళను పురోగమిస్తున్న సమాజం కాలం చెత్తబుట్టలోకి విసిరేస్తుంది

*(అరుణతార : జులై 1992)*

# విప్లవ భావాలకు పద్యం వాహిక కాలేదు

ఇటీవల కొన్ని నెలలుగా ఆంధ్రజ్యోతి, ఆంధ్రప్రభ, ఉదయం దినపత్రికల్లో పద్యం భవిష్యత్తు గురించి, దాని స్వరూప స్వభావాల గురించి తీవ్రంగా చర్చ జరుగుతోంది. ఈ చర్చలో కల్లూరి, చేరా, వల్లభాచార్య, బేతవోలు రామబ్రహ్మం, తంగిరాల, సి.వి. కృష్ణారావు, ఎ.కె ప్రభాకర్, ప్రసేన్ మొదలయినవారు పాల్గొన్నారు. మొత్తంమీద ఈ చర్చ పద్యాన్ని అభిమానించేవాళ్ళకు ఉత్సాహాన్ని కలిగిస్తోంది. ఇంత సీరియస్‌గా చర్చ జరుగుతోందంటే పద్య ప్రక్రియ బలంగా ఉండబట్టే గదా అనే భ్రమను కలిగిస్తోంది.

పద్యం గురించి జరుగుతున్న ప్రస్తుత చర్చ సందర్భంగా మనం వేసుకోవాల్సిన మొదటి ప్రశ్న - ఇప్పుడీ చర్చ జరగడానికున్న నేపథ్యం ఏమిటనేది.

భారతీయ జనతాపార్టీ అయోధ్య పేరుతో ముందుకు వచ్చింతర్వాత అది పార్లమెంటులో ప్రధాన ప్రతిపక్షం అయి కూర్చుంది. రేపో మాపో అధికారంలోకి కూడా వస్తాననే ఆత్మవిశ్వాసంతో వుంది దీంతో ఇతర పార్టీల నుండి కొందరు నాయకులు బిజెపిలోకి దూకడం ప్రారంభించారు. రామాలయ నిర్మాణం పేరుతో హిందూమత పునరుద్ధరణ రాజకీయంగా జరుగుతోంది. ఇది సాంస్కృతిక రంగంలో సాంప్రదాయిక భావాల పునరుద్ధరణకు ప్రేరణ అయింది. 1989 నుంచీ, ముఖ్యంగా అద్వానీ రథయాత్ర నుంచీ ఇది ప్రారంభమయింది. 1992 డిసెంబర్ 6న బాబ్రీ మసీదును హిందూ మతోన్మాదులు కూలగొట్టడంతో అటు రాజకీయంగా హిందూమత శక్తులకూ, ఇటు సాంస్కృతికపరంగా సాంప్రదాయికులకూ ఉత్సాహం వచ్చింది 1990 సెప్టెంబర్‌లో జి.వి. సుబ్రహ్మణ్యం ఆంధ్రపత్రికలో విశ్వనాథ సత్యనారాయణ గురించి ఒక వ్యాసం వ్రాశాడు. ఆ తర్వాత అదే పత్రికలో వల్లభాచార్య మరికొన్ని వ్యాసాలు రాశాడు. విశ్వనాథను ఆధారం చేసుకొని అయోధ్య ప్రేరణతో హిందూమత భావజాలాన్ని తవ్వి తీయడమే ఈ వ్యాసాల పని. ఈ క్రమంలోనే అదే ప్రయోజనం కోసం 'పద్యం' ఆధారంగా జరుగుతున్న చర్చ ఇది. ఈ చర్చకు ప్రారంభంలో ఈ ఉద్దేశం లేకపోయినా క్రమక్రమంగా ఏర్పడింది. ముఖ్యంగా వల్లభాచార్య వ్యాసంలో ఇది స్పష్టంగా కనిపిస్తుంది. గతంలో పద్యం అనే ప్రక్రియ "హిందూ దటీజ్ భారతీయ" భావనకే ప్రాతినిధ్యం వహించిందనీ, రాబోయే కాలంలో ఇంకా బలపడుతుందనీ చెప్పాడు. ఇన్నాళ్ళూ హిందువు అని చెప్పుకోడానికి భయపడ్డవారు ఇవాళ భయపడడం లేదు గదా ! అదే విధంగా పద్యం రాయడానికి ఇన్నాళ్ళూ జంకుతున్నవాళ్ళు ఇక నిర్భయంగా రాస్తారని ఆయన ఉద్దేశం హిందూ మతోన్మాదంలాగా ఇది పద్యోన్మాదం తప్ప మరొకటికాదు.

సజీవమైన ప్రక్రియగా పద్యం చచ్చిపోయిందని వల్లభాచార్య కూడా ఒప్పుకుంటున్నాడు. అయితే ఆయన దృష్టిలో పద్యాన్ని హత్య చేసినవాడు పద్యకవే.

ఎన్నో ఛందస్సులుండగా పదీ పన్నెండు ఛందస్సులకే పరిమితం అయిపోయి పద్యకవులు కూపస్థమండూకాల్లా ఉండడం వల్ల (ఇది ఆయన అన్నమాటే) పద్యవిస్తృతీ, దాని శక్తీ తెలియకుండా పోయాయనీ, అందువల్ల పద్యం సంకుచితమై చివరకు చచ్చిపోయిందనీ ఆయన మాటల సారాంశం. ఈ లెక్కన నన్నయ నుంచీ నేటి పద్య కవివరకూ అందరూ పద్య హంతకులే కావాలి. ఎందుకంటే పద్య కవులందరూ ఆ పదీ పన్నెండు ఛందస్సుల్లోనే తొంభైశాతం రాశారు. తక్కిన ఛందస్సుల్ని అక్కడక్కడా మాత్రమే ప్రయోగించారు. పద్య రచనలో అరితేరిన మహాకవుల పరిస్థితే ఇలా వుంటే ఇక మామూలు పద్యకవుల దయనీయ స్థితి ఎలాంటిదో అర్థం చేసుకోవచ్చు. ప్రచురంగా రాయడానికి కొన్ని తప్ప అన్ని ఛందస్సులూ పనికిరావని పద్యకవులే తేల్చేశారు. ఇంతకూ పద్యం బతుకుతుందా, చస్తుందా అనే చర్చ అంతా ప్రధానంగా ఆ పదీ పన్నెండు ఛందస్సులకు సంబంధించిందేనని గుర్తించాలి.

ఆ పదీ పన్నెండు ఛందస్సుల్లో కూడా ఆటవెలది, తేటగీతి, సీసం, ద్విపద మొదలైన దేశి ఛందస్సులున్నాయి. ఛందశ్శాస్త్రం వీటిని గణబద్ధ ఛందస్సులుగా వివరిస్తున్నా, నిజానికివి మాత్రాబద్ధ ఛందస్సులు. ఈనాటి మాత్రా ఛందస్సులో ఉన్న గేయాల లాగా వీటి నడక వుంటుంది. వీటిలో లయకు ప్రాధాన్యం వుంటుంది. యతి దగ్గర స్పష్టమైన విరామం వుంటుంది. ఈ లక్షణాలన్నీ రచనలో రచయితలకు కొంత సౌకర్యాన్ని కలిగిస్తాయి. ఈ పద్యాలు ప్రజలకు చేరువైనంతగా మిగతావి కాలేదు పద్యాలను ఒకచోట కూర్చుని రాయకుండా దేశాటనం చేస్తూ చెప్పినవాడు వేమన. ఈ కవి ఆటవెలది ఛందస్సును ప్రధానంగా గ్రహించాడు వేమన ఆటవెలది పద్యాలను పండితులు పరిష్కరించకుండా దొరికినవాటిని యధాతథంగా అచ్చువేసి వుంటే ఆ పద్యాల నడకకున్న ప్రజాస్వామిక స్వభావం తెలిసివుండేది. ఆటవెలది ఛందస్సులో ఉన్న గణాలకు వేమన ప్రాధాన్యం యివ్వలేదు. నడక (లయ) కు మాత్రమే ప్రాధాన్యమిచ్చాడు. అందువల్ల ఛందశ్శాస్త్రంలో ఆటవెలదికి చెప్పబడ్డ గణాలు వేమన పద్యాల్లో చాలాచోట్ల ఆ నియమాల ప్రకారం వుండవు. ఇవి తప్పు అని భావించి పండితులు సరిదిద్ది అచ్చు వేశారు. లిఖిత సంప్రదాయంలో ఉన్న పద్యాలకే గాక, మౌఖిక సంప్రదాయంలో ఉన్న పద్యాలకు కూడా ఈ 'పరిష్కరణ' జాడ్యం పట్టుకుంది. పద్యాల్లో దేశి ఛందస్సుల్లో ఒకటైన ఆటవెలది వేమన భావప్రచారానికి ఉపయోగపడింది. ఆయన వృత్త పద్యాన్ని ఎందుకు ఎంచుకోలేదు ? రెడ్డిరాజుల రాజ్యం పతనమయ్యాక రాజాస్థానాల్లో చోటు లేక బయటికి గెంటివేయబడ్డ శ్రీనాథుడు కూడా చివరి దశలో దేశాటనం చేస్తూ చెప్పిన చాటువుల్లో కందంలో చెప్పినవే పాపులర్ అయ్యాయి. తన కావ్యాల్లో కూడా శ్రీనాథుడు సీస పద్యాన్ని కదను తొక్కించినవాడుగా పేరు పొందాడు. దేశి ఛందస్సుల్లో మరొక వింత లక్షణం కూడా వుంది. కొన్ని సందర్భాల్లో ద్విపద పాదం తేటగీతి పాదంగా కూడా సరిపోతుంది. తేటగీతి పాదం ఆటవెలది పాదంగా సరిపోతుంది. ఆటవెలది పాదాలు సీస పద్య పాదాలుగా సరిపోతాయి. "గ్రుడ్డివయితి నీవు కుంటి దానను నేను / నగరికెట్లు మనము నడువగలము" ఈ పాదాలు సీసపద్యం, ఆటవెలది

- రెండింటి నియమాలకూ సరిపోతాయి అడవిరాముడు సినిమాలో వేటూరిపాట "ఆరేసుకోబోయి పారేసుకున్నాను / కోకెత్తు కెళ్ళింది కొండగాలి" సీసపద్యం ఛందస్సులో వుంది కాబట్టి ఈ దేశి ఛందస్సులో గేయ స్వభావం, పాట స్వభావం కనిపిస్తాయి వీటిని పద్యాల పేరుతో ప్రచారం చేసి, గణాలలో ఇరికించడం వల్ల ఇవికూడా పాఠకుల్నీ, కవుల్నీ కొంతవరకు భయపెట్టగలిగాయి. ఇంతకూ ఆటవెలదుల్ని చెప్పిన వేమనను చాలామంది సంప్రదాయ పండితులు అసలు కవిగా కూడా గుర్తించలేదు.

అబ్బూరి పద్యంలో పుట్టి పెరిగి, తర్వాత వచన కవితకు వెళ్ళి మళ్ళీ పద్యానికి తిరిగివచ్చి, ఛందస్సు లేకుండా కవిత్వం లేదని నమ్మినవాడిగా వల్లభాచార్య అన్నాడు అబ్బూరి పద్యం గేయంలాగా, వచన కవితలాగా వుంటుందని సోదాహరణంగా వివరించాడు. పద్యం గొప్పతనాన్ని చెప్పడానికి ఈ వివరణ అంతా ఇచ్చాడు. పద్యాన్ని గేయంలాగా, వచన కవితలాగా రాయడం నిజానికి పద్యం గొప్పదనాన్ని తెలియజేయదు. పద్యం పైన కూడా గేయ, వచన కవితల ప్రభావం ఎలా వుందో తెలియజేస్తుంది. అబ్బూరి కూడా గేయాన్నీ, వచన కవితనూ ప్రేమించినంతగా పద్యాన్ని ప్రేమించలేదు. అందుకనే పద్యాన్ని కూడా గేయంగా, వచన కవితగా రాశాడు. లేదా పద్యంపైనే అబ్బూరికి అభిమానం ఉందనుకుంటే - ఆ పద్యాన్ని గేయంలాగా, వచన కవితలాగా రాస్తే తప్ప పాఠకులు చదవరని అలా చేసి వుండాలి. ఏమైనా వచన కవిత అనిపించేలా పద్యాన్ని రాయడం ఒక రకమైన సర్కస్ ఫీట్ తప్ప మరేమీ కాదు. అలాగే బేతవోలు రామబ్రహ్మం శివారెడ్డి, ఆశారాజుల వచన కవితల్ని పద్యాలుగా మార్చి తన పద్యాభిమానాన్ని ప్రకటించుకున్నాడు. ఇదీ మరొక సర్కస్ ఫీట్‌లాంటిదే. అబ్బాయికి అమ్మాయి వేషమో, అమ్మాయికి అబ్బాయి వేషమో వేసి తల్లిదండ్రులు సంతోషించడం లాంటిదే ఇది.

ఈనాటికీ వచన కవితా సంకలనాలకన్నా పద్య సంకలనాలే ఎక్కువగా వస్తున్నాయనీ, అందువల్ల పద్యం చావలేదనీ ఒక అభిప్రాయం వుంది. దీనికి తగ్గట్టు పద్యం ఇపుడు బతికే వుందనీ, ఈనాటికీ పద్యాన్ని ఆస్వాదించే వాళ్ళున్నారనీ, పద్యం ఈ కాలానికి తగదు అనుకోవడం సమంజసం కాదనీ చేరా సర్టిఫికేట్ ఇచ్చాడు. పద్యాభిమానులు ఊగిపోవడానికి ఇలాంటి మాటలు చాలు. పద్యం ఈ కాలానికి తగిందేనని చెప్పడంలో చేరా ఉద్దేశం ఆధునిక భావాలన్నిటినీ పద్యంలో సమర్థవంతంగా చెప్పవచ్చుననేదే. దీనికి ఆయన కొన్ని ఉదాహరణలు కూడా చూపాడు త్రిపురనేని రామస్వామి, దువ్వూరి రామిరెడ్డి, జాషువా మొదలయిన కవుల పద్యాలను పేర్కొంటూ, అభ్యుదయ సాహిత్యంలో భాగమైన సుంకర, వాసిరెడ్డి నాటకాలలోని పద్యాలనూ సాక్ష్యం తెచ్చుకున్నాడు సుంకర, వాసిరెడ్డి నాటకాలు వచ్చేటప్పటికి పద్యానికి ఎంతో కొంత విలువ వుంది. నక్సల్బరీ తరంలో వచ్చిన పాణిగ్రాహి సుబ్బారావు కూడా విప్లవ భావాలను సీస పద్యాలలో చెప్పాడు. ఇంకా ఇటీవలి కాలానికొస్తే 1983 లో జననాట్యమండలి సభ్యుడైన కె.సి. జైలు పద్యాలనే పేరుతో కొన్ని పద్యాలు రాసి అతనే రాగయుక్తంగా పాడేవాడు. అవి హరిశ్చంద్ర నాటకంలోని కాటిసీను పద్యాల శైలిలో వుండేవి. వీటిలో వృత్తాలూ, సీసపద్యాలూ ఉన్నాయి. అక్రమంగా జైలుపాలయిన

ఒక విప్లవకారుడి స్వగతం ఈ పద్యాలలోని సారాంశం ఇవీ ఆకర్షణీయంగానే ఉండేవి తమాషా ఏమిటంటే నిజానికీ జైలు పద్యాలు పద్యాలు కావు. వీటిలో పద్య లక్షణాలైన గణాలూ, యతిప్రాసలూ ఏమీ లేవు కానీ పాడుతూంటే అచ్చం పద్యాలే అనిపిస్తాయి సుంకర, వాసిరెడ్డి నాటకాలలోని పద్యాలుగానీ, పాణిగ్రాహి పద్యాలుగానీ, ఈ జైలు పద్యాలు గానీ కేవలం ప్రయోగాలు మాత్రమే. వీటిని తర్వాతి కాలాల్లో అనుసరించిన కవులు ఎవ్వరూ లేరు. పైగా ఈ పద్యాలు పాడేటప్పుడు అందులోని విషయాన్ని శ్రోతలు సీరియస్‌గా తీసుకోరు. చెప్పదల్చుకున్న విషయాన్ని వ్యంగ్యంగా చెప్పడానికి మాత్రమే పనికొచ్చేవి. సెటైర్ అనే ప్రక్రియకు పనికొచ్చినంతగా విప్లవభావ ప్రచారంలో మరో విధంగా పనికిరాలేదు ఇన్ని పరిమితుల్లో వేళ్ళమీద లెక్కబెట్టదగిన కవులు మాత్రమే పద్యాలలో విప్లవ భావాల్ని చెప్పడానికి ప్రయత్నించారనీ, వాళ్ళైనా పద్యాలను ప్రయోగాత్మకంగానే రాశారనీ గుర్తించడం అవసరం. ఈ ఉదాహరణలు అపవాదాలు మాత్రమే. ఎవరైనా విప్లవకవులు పద్యాలు రాయదల్చుకుంటే రాసే అవకాశం వుంది గదా అని అనడం తర్కవే గాని గతితర్కం కాదు. పద్య కవిత్వం చదివే పాఠకులున్నంతవరకూ పద్య కవిత్వం ఉంటుందని చేరా అనడం ప్రాణం ఉన్నంతవరకూ మనిషి బతికే వుంటాడన్నట్టుంది ఎటొచ్చీ ప్రాణం ఉందా, ఉంటే ఏ స్థితిలో ఉంది అన్నదే ప్రశ్న. మనదేశంలో పాతది ప్రతిదీ ఏదో ఒక స్థాయిలో నిలిచి ఉంటూనే కొత్తది వచ్చి చేరుతుంటుందని సుప్రసిద్ధ ఆధునిక చరిత్రకారుడు కోశాంబి చరిత్ర రచన సందర్భంగా చెప్పిన విషయం ఇక్కడా సరిపోతుంది. పద్యం ఎప్పటికీ వుంటుంది - కనీసం మ్యూజియంలో వస్తువుగానైనా సరే

ఒకానొక వ్యవస్థలో లేదా నిర్దిష్ట పరిస్థితిలో ఒకానొక అవసరం కోసం ఒక సాహిత్య రూపం పుడుతుంది. అలా చూసినప్పుడు పద్యం భూస్వామ్య వ్యవస్థలో పుట్టింది వచన కవిత పెట్టుబడిదారీ వ్యవస్థ లేదా ప్రజాస్వామ్యయుగంలో పుట్టింది పాట మానవ శ్రమలో పుట్టింది. పద్యం, వచన కవితలకంటే ముందే పుట్టి, వాటితోపాటు కొనసాగుతూ, అవి అదృశ్యం అయినా నిలవగలిగేది పాట ఈ మూడు ప్రక్రియలకున్న కాలవైశాల్యం వాటి పుట్టుకను బట్టి పై విధంగా అర్థం చేసుకోవచ్చు. ఇక్కడ ఇంకో ప్రశ్న వస్తుంది - సాహిత్య రూపాలకు వర్గ స్వభావం ఉంటుందా అని చేరా ఖచ్చితంగా వుండదన్నాడు. ఏ సాహిత్యరూపంలో ఏ విషయాన్నైనా చెప్పవచ్చునని ఆయన అభిప్రాయం. ఏ రకపు భావాలనైనా నిరోధించే శక్తి ఏ సాహిత్య రూపానికీ లేకపోవచ్చుగానీ, బలంగా చెప్పగల శక్తి ఎంతవరకుంటుందనేది ఆలోచించవలసిన విషయం పద్యం ప్రధానంగా విశ్రాంతి వర్గాల వారి ప్రక్రియ అయిపోయింది కాకుంటే కొందరు ప్రజాస్వామ్య స్వభావం గల కవులు దాన్ని ప్రజలకు అందుబాటులోకి తేవడానికి ప్రయత్నించారు ఈ ప్రయత్నం వల్లనే పద్యం మరికొంతకాలం బతకగలిగింది భారత భాగవతాలు తెలుగులో పుట్టిన కాలానికి తెలుగు పద్యాన్ని సాధారణ ప్రజలకు వివరించి చెప్పగల పౌరాణికులుండేవారు. అందువల్ల ఆ కాలంలో కొంతవరకైనా పద్యం ప్రజలకు దగ్గరయ్యింది. నిజానికి అప్పుడు కూడా పద్యం ప్రజలకు దగ్గరయ్యింది అనడంకన్నా

పద్యంలోని విషయం ప్రజలకు చేరింది అనడం న్యాయం ప్రబంధకాలం వచ్చేసరికి పద్యం పాండిత్య ప్రకర్షకు ఒక సాధనం అయింది. ఇంకా చిత్ర, బంధ కవిత్వాలు వచ్చి పద్యాలతో బాటు పాఠకుల్నీ చిత్రహింసలు పెట్టేశాయి పద్యం పుట్టిన కాలానికి ఎవ్వరంటే వాళ్లు కవిత్వం రాయగూడదని నియమం వుండేది.కానీ వచన కవిత పుట్టిన ప్రజాస్వామ్య యుగంలో కవిత్వం రాసే హక్కు అందరికీ వచ్చింది కాబట్టి సామాన్యులు కూడా కవిత్వం రాసే ప్రయత్నం చెయ్యడానికి వచన కవిత అనే సాహిత్య రూపం కొంతవరకు అవకాశం కల్పించింది. కవితాశక్తిని ప్రదర్శించగలిగినవాళ్ళకు వచన కవిత అనే రూపం ఏ విధంగానూ ఆటంకం కాదు. కానీ పద్యం కొంతవరకు - కాదు - చాలావరకు ఆటంకం అవుతుంది. అయినా సామాన్యులు కూడా పద్య విద్యను నేర్చుకుని చెప్పడానికి ప్రయత్నించవచ్చు. కొందరికి వచ్చిన పద్య విద్య నేర్చుకుంటే ఇంకా చాలామందికి వస్తుంది కానీ తేలిగ్గా చెప్పడానికి అవకాశం కల్పించే సాహిత్య రూపం వున్నప్పుడు పద్యంతో కుస్తీ పట్టవలసిన అవసరం మానవుడికి వుండదు. దగ్గరదారి వున్నప్పుడు చుట్టూ తిరిగి వెళ్ళడం అనవసరం గదా ! అనవసరమైందే ఒక దశలో అసాధ్యంగా కనిపిస్తుంది. పైగా అనేక నియమాలతో బంధింపబడ్డ పద్యం ఎంత తేలిక చెయ్యాలన్నా దాని సంక్లిష్టత దానికుంటుంది ఇంకో విషయం : కొన్ని శతాబ్దాలుగా పద్యం ఒక వర్గ ప్రయోజనాలకు వాహికగా ఉపయోగపడ్డ చరిత్ర ఉన్నప్పుడు, దాన్ని మరోవర్గ ప్రయోజనాలకు వుపయోగించడం అంత సులభం కాదు. ఇంత సుదీర్ఘ చరిత్రలో పద్యానికి ఆ వర్గ స్వభావం సహజాతం లాగా అయిపోతుంది. తెలుగులో పౌరాణిక పాత్రలకు ఇంగ్లీషు మాటలతో కూడిన తెలుగును వాడడం ఎంత ఎబ్బెట్టుగా వుంటుందో పద్యంలో విప్లవ భావాలు చెప్పడం కూడా అంతే ఎబ్బెట్టుగా వుంటుంది అందుకే సెటైర్‌గా కొంతవరకు పనికొస్తుంది ఈ సెటైర్‌కు కూడా వచన కవిత పనికొస్తున్నప్పుడు పద్యం జోలికి వెళ్ళాల్సిన అవసరం వుండదు పద్యం సజీవంగా లేకపోవడానికి ఇన్ని కారణాలున్నాయి.

కవిత్వాన్ని పీడితవర్గ విముక్తి కోసం ఉపయోగించడం శ్రీశ్రీ మహాప్రస్థానంతో బలంగా ముందుకొచ్చింది. "ఛందస్సుల సర్ప పరిష్వంగం" వదలాలనీ, "ఛందో బందోబస్తులన్నీ ఛట్ ఫట్ ఫట్‌మని" తెంచాలనీ అనవలసిన అవసరం శ్రీశ్రీకి ఇందువల్లనే కలిగింది. పద్యం రాయగలిగిన శక్తి వుండీ, పాండిత్యం వుండీ కవితారూపాన్ని పద్యం నుండి గేయానికీ, వచన కవితకూ మార్చడానికి కారణం శ్రీశ్రీ చెప్పదల్చుకున్న భావాలు పద్యంలో ఇమడకపోవడమే (బేతవోలు రామబ్రహ్మం మహాప్రస్థాన కవితల్ని పద్యాలలోకి మార్చుకుండుగాక !) విరసం ఏర్పడింతర్వాత కవిత్వాన్ని ఇంకా విస్తృతంగా ప్రజల దగ్గరకు తీసుకెళ్ళే ప్రయత్నంలో భాగంగా శ్రీశ్రీ తన మహాప్రస్థాన భాషనూ, శైలినీ వదులుకొని "యిప్లవం యాడుందిరా, ఆడనే నీ కూడుందిరా, నీ గూడుందిరా' ' అని రాయడం ప్రారంభించాడు. కాబట్టి చేరా భావిస్తున్నట్టు కవిత్వం ఛందస్సులోనే వుండకూడదనుకోవడం అపోహ కాదు. సోషలిజం గురించి చెరబండరాజు అన్నట్టు "ఆకలంత సహజమది, అన్నమంత అవసరమది." బేతవోలు అనుకుంటున్నట్టు కవిత్వం

ఏనాడయినా కడుపు నిండినవాడి కాలక్షేపం మాత్రమే కాదు, కడుపు మండినవాడి ఆయుధం కూడా.

ఈనాడు పద్యం కడుపు నిండినవాడికి పనికొచ్చినంతగా కడుపు మండినవాడికి పనికిరాదు.

ఇంకో వాస్తవం చూడండి - పద్యం అనే సాహిత్య రూపాన్ని గూర్చి ఇంత తీవ్రంగా చర్చ జరుగుతున్నదే గానీ, ప్రజలకోసం రాయబడ్డ పద్య కవిత్వం (అది నిజంగా వుంటే) గూర్చి చర్చ లేదు. 'లక్ష్యం' లేకుండా లక్షణం గురించి చర్చించడం దేనికి ?

శ్రీశ్రీ వర్ధంతి
(15-6-1993)

*(అరుణతార : జూన్ : జులై 1993)*

# చలం దృక్పథం

ఇది చలం శత జయంతి సంవత్సరం. ఇప్పటి పరిస్థితుల్లో చలం సాహిత్యాన్ని మరొకసారి పరిశీలించి, బేరీజు వేసుకుని, ప్రేరణ పొందడానికి ఇదొక అవకాశం.

చలం పుట్టింది 19-5-1894న. చనిపోయింది 4-5-1979 న. 85 సంవత్సరాల సుదీర్ఘ జీవితం. మేలోనే పుట్టి మేలోనే మరణించిన చలం తెలుగు సాహిత్యాకాశంలో మేనెల సూర్యుళ్లా చండ ప్రచండుడయ్యాడు. ఆయన వేడికి ఆ రోజుల్లో చాలామంది తట్టుకోలేకపోయారు.

చలం రచనలు యువతీ యువకుల్ని చెడగొట్టేవని అప్పట్లో ఒక బలమైన అభిప్రాయం ఉండేది. ఈ అభిప్రాయానికి సమాధానంగానే చలం "నా పుస్తకాలు చదివి చెడిపోయిన వాళ్ళుంటే, వాళ్ళు ఎంత బాగుపడ్డారో !" అని ఆత్మవిశ్వాసంతో చెప్పుకోగలిగాడు. చెడిపోయిన సమాజం ఇంకా చెడిపోవడమంటే బాగుపడ్డమనే చలం సమాధానం.

భార్యలు భర్తలకు విడాకులివ్వడాలూ, భర్తలు భార్యల్ని వదిలెయ్యడాలూ, లేచిపోవడాలూ, ఒకే సమయంలో ఒక స్త్రీ ఇద్దరు పురుషులతో ఉండగలగడాలూ వగైరాలన్నీ వివాహ వ్యవస్థను అంగీకరించి, భూస్వామ్యపు విలువలతో నడుస్తున్న సమాజానికి మింగుడు పడకపోవచ్చుగానీ, చలం సాహిత్యం నుంచి నేర్చుకోదగిన విలువలు వేరే ఉన్నాయి. అవి ధైర్యం, ఆత్మగౌరవం, హిపోక్రసీని అసహ్యించుకోవడం. చలం కథల్లో, నవలల్లో, నాటకాల్లో వున్న సంఘటనలకన్నా, వాటి ద్వారా ఆయన అందించిన పై విలువలు పాఠకులకు ముఖ్యం.

పెళ్ళికి తిరగబడ్డవాళ్ళని స్వేచ్ఛ కోసమే ప్రోత్సహించానంటాడు చలం బలవంతమూ, డబ్బూ ప్రవేశించేసరికి వ్యభిచారమూ, వేశ్యాత్వమూ కూడా వివాహ మంత నీచ దశకు దిగజారుతాయని చలం అభిప్రాయం. అమల్లో ఉన్న వివాహ వ్యవస్థ అంటే స్త్రీ పురుషులు ఒకర్నొకరు వంచించుకోవడమే కాదు, తమనుతాము వంచించుకోవడం కూడా అని చలం గట్టి నమ్మకం. పెళ్ళిలోకన్నా వ్యభిచారంలోనే ఎక్కువ నీతి ఉందంటాడు. ఎందుకంటే వేశ్యశరీరాన్నే అమ్ముకుంటే, భార్య శరీరాన్నీ, మనసునీ, అభిమానాన్నీ, నీతినీ, ఆత్మనూ అన్నిటినీ అమ్ముకుంటుంది గనుక. స్త్రీని అలాంటి దుస్థితిలోకి పురుషాధిక్య వ్యవస్థ నెట్టి వేసింది గనుక. చలానికి ముందున్న సాహిత్యంలో స్త్రీలు తమ దుస్థితికి బాధపడేవాళ్ళు. ఏడ్చేవాళ్ళు. తమలో తాము కుమిలిపోయేవాళ్ళు. ఆత్మహత్యలు చేసుకునేవాళ్ళు. కాని చలం సాహిత్యంలో స్త్రీలు ఆలోచిస్తారు, ఎదురుతిరుగుతారు. "మేము పతితులమా ? మీరే పతితులు. మమ్మల్ని అలా అనడంలోనే మీ పతనం ఉంది" అని నిలదీస్తారు.

చలానికి స్త్రీని ప్రేమించడమే గాదు, గౌరవించడం కూడా తెలుసు స్త్రీకున్న శక్తి సామర్థ్యాలు తెలుసు. ధైర్యసాహసాలు తెలుసు. స్త్రీ ఎలా ఉండాలో, ఎలా

ఉండకూడదో తెలుసు. అందుకే ఒక సందర్భంలో "భర్త నీచుడైతే గుర్తించని స్త్రీ అంతకన్నా నీచురాలు భర్తని ఆ నీచత్వంలోంచి తప్పించడానికి ప్రయత్నించని స్త్రీ వ్యర్థురాలు. ప్రయత్నించినా అతను మారకపోతే అంటిపెట్టుకున్న స్త్రీ వ్యభిచారి" అని చెబుతాడు. స్త్రీకి జరుగుతున్న అన్యాయాన్ని, ఆమెపై జరుగుతున్న దోపిడిని ఒక్కమాటలో చెప్పాలంటే "స్త్రీ జీతంలేని సంఘ బానిస". భర్తనుగానీ, ప్రియుణ్ణిగానీ అవసరమయితే వదిలివెయ్యడానికీ, మరొకర్ని ప్రేమించడానికీ స్త్రీకి స్వేచ్ఛ ఉండాలని చెబుతూనే, అది ఉపయోగించవలసి రావడం దురదృష్టం అనికూడా అంటాడు చలం. చాలామంది మొదటి అంశాన్ని గుర్తించినంతగా రెండో అంశాన్ని గుర్తించినట్టు కనబడదు ఒక స్త్రీ, ఒక పురుషుడు జీవితాంతం స్నేహపూర్వకంగా కలిసి ఉండగలిగితే అదే గొప్ప చలం దృష్టిలో. కానీ అలా ఉన్నట్టు నటించడాన్ని తీవ్రంగా వ్యతిరేకిస్తాడు.

మన ప్రాచీన సమాజం స్త్రీని ఎంతగానో పొగిడింది. స్త్రీ శక్తి స్వరూపిణి అంది. అయినా పురుషాధిక్యతను ఎదిరించగల స్త్రీని ఊహించలేదు. తరతరాల నుండి స్త్రీకి జరుగుతున్న అన్యాయానికి చలించిపోయాడు చలం. అందుకే ఆయన సాహిత్యంలో స్త్రీకి అంత ప్రాధాన్యం వచ్చింది. ఇది ప్రపంచమే తన ప్రియురాలు అని భావించేటంత తీవ్రస్థాయికి వెళ్ళింది. తనకు తప్ప స్త్రీని ప్రేమించడం ఇంకెవ్వరికీ తెలియదని అనుకునేంత గర్వానికి దారి తీసింది. స్త్రీకి కావలసిందేమిటి అనే ప్రశ్నకు చలం అన్న ఈ మాటలే సరైన సమాధానాన్ని యిస్తాయి. "స్త్రీకి కూడా శరీరం వుంది, దానికి వ్యాయామం యివ్వాలి. ఆమెకి మెదడు వుంది దానికి జ్ఞానం యివ్వాలి ఆమెకి హృదయం వుంది, దానికి అనుభవం యివ్వాలి"

స్త్రీలాగే పిల్లలు కూడా తండ్రి ఆస్తికాదు అని గట్టిగా చెప్పినవాడు చలం తండ్రి ఆలోచనలనే పిల్లలు గౌరవించాలనే ధోరణి ఏదో ఒక రూపంలో సమాజంలో వస్తూనే వుంది. తండ్రులకోసం పిల్లలు త్యాగం చెయ్యాల్సిన కాలం గతించిందనీ, ఇవాళ పెద్దలే పిల్లలకోసం త్యాగం చెయ్యాలనీ గుర్తించినవాడు చలం కుటుంబంలో గానీ, పాఠశాలల్లో గానీ పిల్లల్ని పెట్టే మానసిక హింసను భరించలేడు చలం. పాఠశాలలు బాలల పాలిటి శాపాలంటాడు. సుందరమైన బాల్యానికి అవి పీడకల లంటాడు. పిల్లలు స్వేచ్ఛగా ఉండాలంటే తల్లి ప్రేమ, విద్య, వివాహం అనే మూడు భూతాల నుంచి విముక్తి కలిగించాలంటాడు. విద్య అంటే ఆనందించే శక్తిని వృద్ధి చెయ్యడం అంటాడు. ఎవరి అధికారమూ లేని ఒక కుటుంబాన్ని తయారు చెయ్యాలని విఫల ప్రయత్నం చేశాడు. ఒకరి భావాలకు, చర్యలకు ఇంకొకరు అడ్డు రాకూడదనే విషయాన్ని గట్టిగా చెప్పే క్రమంలో ఒకరివల్ల మరొకరు ప్రభావితం కాకూడదనే స్థితికి వెళతాడు. ఒకరి వల్ల మరొకరు ప్రభావితం కావడం తప్పుకాదు. ప్రభావితమైనా తన వ్యక్తిత్వాన్ని నిలుపుకోగలిగినప్పుడు అది లాభదాయకమే చివరకు చలం రమణమహర్షి వల్ల ప్రభావితుడయ్యాడు గదా !

స్త్రీ విషయంలోనూ, పిల్లల విషయంలోనూ చలం తన అభిప్రాయాల్ని రమణాశ్రమం వెళ్ళిం తర్వాత కూడా పెద్దగా మార్చుకోలేదు రమణాశ్రమం చేరింతర్వాత

చలాన్ని చాలామంది ఒక ప్రశ్న వేసేవాళ్ళట. అదేమిటంటే - మీ పాత పుస్తకాలమీద మీ అభిప్రాయం మారిందా అని. నేనే మళ్ళీ ఆ పుస్తకాలు ఈనాడు రాయవలసి వస్తే ఇంకా గట్టిగా, సూటిగా, బరువుగా, బాధించేట్లుగా ఏం మాటలు దొరుకుతాయా అని వెతుకుతాను అన్నది చలం జవాబు. ఈ మాటలు ఆయన 1973లో చెప్పినవి. అయితే అనేక విషయాల్లో చలం మాటల్లో వైరుధ్యాలు కనిపిస్తాయి. రమణ మహర్షి ప్రభావం ఒక్కటే దీనికి కారణం కాదు. రమణ మహర్షితో సంబంధం లేకుండానే ఈ వైరుధ్యాలున్నాయి. చలం ఆలోచనా ధోరణిలోనే ఈ అంశం ఉంది ఎప్పటికి ఏది నిజమని తోస్తే దాన్ని చెప్పెయ్యడం అన్నది చలం పాలసీ. ఇది ఒక విధంగా కరక్టే ఒక విధంగా కరక్టు కాదు కూడా ఏదైనా ఒకటి నిజమని తోచడానికి ఉన్న పునాది ఏమిటన్నది ముఖ్యం ప్రకృతి, సమాజం, మానవుడు - వీటి పరిణామ దశలకు సంబంధించిన ఒక ప్రాపంచిక దృక్పథం ఉంటే తోచే నిజం వేరు. అది లేనప్పుడు తోచే నిజం వేరు. ఇవాళ సత్యం అనుకున్నది రేపు అబద్ధమని తేలడం మానవుడు ఎదిగే క్రమంలో అశాస్త్రీయం కాదు. మానవుడు భూమిని బల్ల పరుపుగా ఉందని భావించాడొకనాడు. ఆ తర్వాత గుండ్రంగా ఉందని తెలుసుకున్నాడు అది మానవుడి జ్ఞానం పెరిగే క్రమాన్ని సూచిస్తుంది కాని ఒక ప్రాపంచిక దృక్పథం లేకుండా ఎప్పటికి ఏది తోస్తే అప్పటికి అది నిజమని చెప్పే ధోరణి సరైంది కాదు. ఇది గందరగోళాన్ని కలిగిస్తుంది. చలంలో ఈ ధోరణి ఉందని చెప్పడంవల్ల ఆయన గొప్పదనానికీ, ఆయన సాహిత్యం అందించిన విలువలకూ వచ్చే నష్టం ఏమీ లేదు. ఈ లోపమే గనక చలం సాహిత్యంలో లేకుంటే ఆయనను అందుకోగలిగిన రచయిత మరొకరుండే వారే కాదు.

రమణాశ్రమానికి వెళ్ళకముందు చలం నాస్తికుడనీ, ఆ తర్వాత ఆస్తికుడనీ అనుకోవడం కూడా సరైన అంచనాకాదు. రమణాశ్రమం వెళ్ళకముందే చలంలో ఈ రెండు ధోరణులూ కనిపిస్తాయి. 1929లోనే ఆయనకు జాతకాలపై నమ్మకం ఏర్పడింది. జాతకాలు నిజమో కాదో పరీక్షించడానికి ఒకసారి వెళ్ళి చెప్పించుకున్నాడు. ఆ చెప్పిన విషయాలు నిజమయ్యేసరికి వాటిపై నమ్మకం ఏర్పడింది. బ్రహ్మ సమాజంలో చేరగానే జందెం తీసేశాడు ఆయన భార్య రంగనాయకమ్మ తన మంగళసూత్రాన్ని కూడా తీసేసింది. 1931లో నిరీశ్వరవాదిగా మారాడు. చలం కుమారుడు ఏడేళ్ళు వ్యాధితో బాధపడి 14వ యేట మరణించాడు దీంతో ఆయన నాస్తికుడయ్యాడు. మొదటిసారి చలం 1936లో రమణమహర్షిని కలిశాడు అప్పుడు ఏ ప్రభావమూ కలగలేదు 1939లో రమణమహర్షికి అంకితమయ్యాడు 1950 ఫిబ్రవరిలో రమణాశ్రమం చేరాడు 1951 ఆగస్టు 15న తన కుమార్తె సౌరిస్‌లో ఈశ్వరుడు ప్రవేశించాడని నమ్మాడు. రమణాశ్రమం వెళ్ళాక కూడా "విధిని తారుమారు చేస్తుంది సాహసం" వంటి అభిప్రాయాల్ని వ్యక్తం చేసిన సందర్భాలున్నాయి. ఆయన ఆలోచనల్లో జాతకం, స్వాతంత్ర్యం అనే రెండు అంశాలూ ఉన్నాయి. వీటి మధ్య నిరంతర ఘర్షణ ఉంది. రమణాశ్రమం వెళ్ళిం తర్వాత ఈ ఘర్షణ శాతం చాలావరకు తగ్గిందనే చెప్పవచ్చు. దేవుడికి చలం పెట్టుకున్న పేరు ఈశ్వరుడు. ఆయన దృష్టిలో ఈశ్వరుడు జ్ఞానం కాదు, ఒక అనుభవం.

హృదయానికేగాని, మనసుకు తెలియదని అంటాడు. చలం ఈశ్వరుడు ద్వంద్వాతీతుడు అంటే ఉన్నాడు, లేడు- అనే రెండింటికీ అతీతుడు. ఈశ్వరుడున్నాడనడం కూడా ఆయన అనంతత్వానికి అవధిని నిర్ణయించడమే నంటాడు చలం. మానవుడు తెలుసుకునేదంతా జ్ఞానమే అయినా చివరికి అదంతా ఈశ్వరుడని తెలుసుకున్నప్పుడే అది నిజమయిన జ్ఞానం అవుతుందంటాడు. దుర్మార్గుల్ని శిక్షించే ఆయుధం ఈశ్వరుడిచేతిలో ఉన్నా, శిక్షించే విధానం చలానికి నచ్చలేదు. ఎవరికీ కనబడకుండా ఈశ్వరుడు ఎంతమందిని శిక్షించినా ఏం ప్రయోజనం ? ఓ రూపం ప్రత్యక్షంగా వచ్చి శిక్షిస్తే ప్రజల్లో పరివర్తన సులభం అవుతుందంటాడు. ఇవన్నీ 'ఈశ్వరుడి' చుట్టూ చలం అల్లుకున్న ఆలోచనలు

తరతరాలుగా ఈశ్వరుడికి ఎవరి నిర్వచనం వాళ్ళిచ్చుకున్నారు. చలంలోని మంచితనం అంతా 'ఈశ్వరుడు' అయిపోయాడు. చలానికి అందమే ఆనందం. ఈ ఆనందాల్లో కూడా ఆధ్యాత్మికానందం ఆయన దృష్టిలో చాలా గొప్పది. "ఆడపిల్ల నుంచి నేను పొందిన ఆ ఆనందంకన్నా గొప్ప ఆనందాన్ని ఇస్తానంటున్నాడు భగవాన్. ఆ ఆనందం కోసమే నా అన్వేషణ" అంటాడు. మొత్తం మీద భౌతిక ప్రపంచంలోనూ, ఆధ్యాత్మిక ప్రపంచంలోనూ ఆనందమే చలం పరమావధి ఈ సౌందర్య దృష్టి చలం జీవితంలో మనకు కనిపించే అంతస్సూత్రం. చుట్టూ ఆనందం ఉన్నా ప్రజలకు అనుభవించడం చేత కాదంటాడు. ఈ 'ఆనందం'లో పడి చలం ఈ ప్రపంచాన్నీ, అందులోని వాస్తవాన్నీ, మానవ జీవితాన్నీ, అందులోని కష్టసుఖాలనూ మర్చిపోతాడు తినడానికి పిడికెడు కూడూ, ఉండడానికి జానెడు గూడూ లేని మానవుడు ఏ ఆనందాన్ని అనుభవించగలడు ? బాధల్లోనే ఆనందాన్ని పొందగలిగిన అతని అనుభవాన్ని ఎంతమంది రచయితలు తమ అక్షరాల్లో బంధించగలరు? చలం తన దృష్టిని ఈ వైపు మళ్ళించి ఉంటే ఎంత బాగుండేది !

అసలు రచనకు తెలియని ప్రోద్బలం ఏదో కారణమని చలం ఉద్దేశం. చలం రచనలకు కొన్ని లక్ష్యాలు మనకు కనిపించినా, లక్ష్యం పెట్టుకుని రాయడమనేది చలం స్వభావం కాదు. "పాత్రని కాగితంపై పెట్టగానే వాళ్ళే నడిపించుకుంటారు కథని. వాళ్ళు బతుకుతారు. అందుకే నా థియరీస్‌కి విరుద్ధంగా ఉంటాయి, నేను రాసేవి చాలాసార్లు" అని చెప్పుకున్నాడు. కళకు అందమే ప్రయోజనం గాని, విషయం కాదని స్పష్టంగా చెబుతాడు. ఆయన దృష్టిలో కళ సామాన్య ప్రజలకు అందుబాటులో ఉండక్కరలేదు. కళకు సౌందర్యారాధనే ముఖ్యం కళ ఆత్మ ఔన్నత్యం కోసమే గాని ప్రపంచాన్ని ఉద్ధరించడం కోసం కాదు. ఇవి కళ గురించీ, సాహిత్యం గురించీ చలం అభిప్రాయాలు. అయితే ఈ అభిప్రాయాల ప్రకారమే ఆయన రాయలేదు కానీ వీటి ప్రభావం తన రచనలపై లేక పోలేదు. ఎందుకు నీతిగా ప్రవర్తించాలో, ఎందుకు ఇంద్రియాల్ని నమ్మాలో, ఎందుకు ఈ తారతమ్యాలు పోవాలో రచయిత అయినవాడు సరైన జవాబు చెప్పాలనీ అంటాడు. అలా చెప్పడానికి ప్రయత్నించాడు కూడా. అసలు ఏ కళ అయినా సమాజాన్ని మారుస్తుందా ? అలా మార్చినట్టుపైకి కనబడదు గానీ, కనబడని లోతైన మార్పు జరుగుతుందని మాత్రం చలం అంగీకరిస్తాడు. ఇది వాస్తవం.

చలం ఎప్పుడు ఏ వాస్తవాన్ని అంగీకరిస్తాడో, ఎప్పుడు ఏ వాస్తవాన్ని తిరస్కరిస్తాడో తెలియదు.

రచయిత అయినవాడు ఒక ప్రాపంచిక దృక్పధాన్ని అంటే ఒక సిద్ధాంతాన్ని కలిగి ఉండడం సరైంది కాదు చలం దృష్టిలో. ఒక సిద్ధాంత అవగాహనతో సమాజాన్ని పరిశీలించడం వల్ల సంకుచితత్వం చోటు చేసుకుంటుందంటాడు. కమ్యూనిజం భౌతిక బాధల్ని పోగొడుతుందేమో గాని, అంతకంటే భిన్నమైన విలువల్ని అంగీకరించదంటాడు. కూటికీ, మాటకీ, ఓటుకీ కాదు స్వతంత్రం కావలసింది, వాటికి మించిన స్వతంత్రం కావాలంటాడు నా జోలికి ఎవ్వరూ రాని, ఎవరూ దేనికీ నన్ను బలవంతం చెయ్యని స్వతంత్రం కావాలంటాడు. చలంలో తొలినుంచీ ఈ వ్యక్తివాదం ఉంది. సమిష్టి తత్వం ఆయనకు పడదు. స్త్రీలకు జరుగుతున్న అన్యాయాల్ని గురించి ఎంత బలంగా రాసినా వ్యక్తిగత స్థాయిలోనే పరిష్కారాల్ని చూపుతాడు. మనిషికి తనలోపల తనకు స్వేచ్ఛ ఉండడం ముఖ్యంగాని, బయటి స్వేచ్ఛ ముఖ్యం కాదంటాడు. అందువల్ల ముందు మనిషి మారితే తర్వాత దేశం మారుతుందంటాడు. అసలు ఏకత్వం, సమానత్వం అనేవి సృష్టి సూత్రానికే విరుద్ధమంటాడు. అంతమాత్రంచేత చలం సమాజంలోని హెచ్చుతగ్గుల్ని నిరసించకపోలేదు. ఆయనకు కులమత భేదాలు లేవు. వ్యక్తిగత జీవితంలో వాటిని వదిలివేసినందుకు ఆయన బాధలు పడ్డాడు కూడా. చలం ఉంటే హిందువులు తమ ఇళ్ళు చెడిపోతాయని భావించేవాళ్ళట. అందుకని హరిజనులో, మహమ్మదీయులో, క్రైస్తవులో ఇళ్ళు ఇచ్చి సహాయపడేవారట. అయితే వ్యక్తిగత జీవితంలో ఇలాంటి సమస్యల్ని ఎదుర్కోవడం వేరు. ఆ సమస్యల పరిష్కార లక్ష్యంతో కలం పట్టటం వేరు. తన కళ్ళముందు కనిపించిన దుర్మార్గాన్నీ, అన్యాయాన్నీ, కుళ్ళునూ, కపటాన్నీ, ఆత్మవంచననూ తన రచనల్లో తీవ్రంగా నిరసించాడు. కానీ అవి మానవ సమాజంలో ఎందుకున్నాయో,ఎలా పోతాయో అనే విషయాల్ని పట్టించుకోలేదు. ఇలా పట్టించుకోకపోవడానికి కారణం ఆయనలో జీర్ణించుకుపోయిన సిద్ధాంత వ్యతిరేకత, వ్యక్తివాదం.

సమానత్వం సృష్టి సూత్రానికే విరుద్ధమంటూనే, అందరం సమానం కావాలంటే బయట వున్న వ్యత్యాసాలతోగాక, మనసులో ఉన్న వ్యత్యాసాలతో పోట్లాడాలంటాడు. సూటిగా, ఘాటుగా, బాధించేట్టుగా రాయాలంటూనే, ఇతరులకి బాధ కలిగించడం కన్నా తనలో తాను బాధ ననుభవించడం నయమంటాడు. ఇలాంటి విరుద్ధ భావాలు చలంలో చాలా కనిపిస్తాయి. దీనికి కారణం అతనిలోని ఆవేశం, ఆవేదనా అతని వ్యక్తివాదానికి ఇమిడేవి కాకపోవడమే

తన గురించి ఇతరులు ఎలాంటి అభిప్రాయం వ్యక్తీకరిస్తే చలానికి కోపం వస్తుందో, అలాంటి అభిప్రాయాన్నే చలం కమ్యూనిస్టుల పట్ల వ్యక్తం చేస్తాడు. తన అభిప్రాయాలనుంచి తన శైలిని విడదీసి చూసేవాళ్ళపైన కోపాన్ని ప్రదర్శిస్తూ, తన రచనల వల్ల పొందిన ఆనందాన్ని శైలికీ, రచనల వల్ల కలిగిన బాధని తన కవిత్వానికీ ఆరోపిస్తారని అంటాడు. నిజమే, చలం కోపం సమంజసమే. కానీ కమ్యూనిస్టులు

చెప్పే మాటలు ఏవగింపు కలిగిస్తాయంటూనే వాళ్ళ త్యాగాన్ని చూసినప్పుడు వాళ్ళ పాదాలముందు శిరసు వొంగుతుందంటాడు. చలం అభిప్రాయాల్నీ,శైలినీ విడదియ్యడం ఎంత అన్యాయమో, కమ్యూనిస్టుల అభిప్రాయాల్నీ, త్యాగాన్నీ వేరు చెయ్యడం కూడా అంతే అన్యాయం.

ఎప్పటికేది సత్యంగా కనిపిస్తుందో దాన్ని చెప్పడం గదా చలం ధోరణి ? ఒక పరిధిలో దీన్ని అంగీకరిస్తూనే కమ్యూనిస్టులు ఇంకాస్త ముందు కెళతారు. ఇప్పుడు మన కళ్ళకు కనిపిస్తున్న దోపిడి వాస్తవమే మరి ఆ దోపిడిని మానవుడు ఎదిరించి విజయం సాధిస్తాడన్నది రేపటి సత్యం అవుతుంది. ఈ రేపటి సత్యాన్ని చలం పట్టించుకోలేదు. ఎప్పుడో ఏదో మనిషికి ఒరుగుతుందనడం పైన ఆయనకు నమ్మకం లేదు. అందుకే కమ్యూనిజాన్ని స్వర్గంతో పోలుస్తాడు. కమ్యూనిజం వస్తుందని ఆశించడం ఒక భక్తుడు స్వర్గానికి పోతానని ఆశించడంతో సమానమని ఆయన అభిప్రాయం ప్రాచీన ధర్మశాస్త్రాలు, పురాణాల్లోని విషయాల్ని గుడ్డిగా నమ్మే సాంప్రదాయికులూ, సైన్సుని గుడ్డిగా నమ్మే ఆధునికులూ చలం దృష్టిలో ఒకటే. ఇందులో పాక్షిక సత్యం లేకపోలేదు. జ్ఞానం కొద్దిమంది మేధావుల సొత్తే అని భావించడానికి అవకాశం కల్పించే వర్గ వ్యవస్థలో సైన్సు విషయాలు శాస్త్రీయాలే అయినా అవి ప్రజలకు అందుబాటులో ఉండవు. అందుబాటులో లేకుండా చేస్తారు. సైన్సు చెప్పే విషయాల్ని ఎంత గుడ్డిగా నమ్మినా అలానమ్మడానికి సరైన కారణం ఉంది. కరెంటుతో లైట్లు ఎలా వెలుగుతాయో ప్రజలకు తెలియక పోవచ్చుగానీ, లైట్లు వెలుగుతాయని మాత్రం ఖచ్చితంగా తెలుసు. దైవశక్తి వల్ల ఏదో జరుగుతుందని ఎవరైనా అంటే అది వ్యక్తిగత అనుభవం అంటారేగానీ, అందరికీ సంబంధించిన అనుభవం కాలేదు. చలానికి ఈ విషయాన్ని గ్రహించే శక్తి లేక కాదు, ఆసక్తి లేదు. ఒంటరితనం, సౌంర్యారాధన, అంతర్ముఖత్వం చలాన్ని ఇటువైపు చూడనివ్వలేదు.

ఒక్కోసారి కమ్యూనిజం కూడా చూడనంత ముందుకు చలం దృష్టి సాగుతుంది. ఈ భూమి ధనవంతులది కాదని కమ్యూనిస్టులంటారు. అయితే మానవులది కూడా కాదని చలం అంటాడు. ఈ భూమిపై మీకెవరు హక్కు నిచ్చారని భూస్వాముల్ని ప్రశ్నించినట్టే, ఈ భూమిపైన మానవులకు మాత్రం ఎవరు హక్కు నిచ్చారని కోట్లాది జీవరాసులు ప్రశ్నిస్తాయంటాడు. నోరు లేదు కాబట్టి అవి ప్రశ్నించడం లేదు గానీ, ప్రశ్నించే హక్కయితే వాటికుంది గదా అని ఎవరికైనా అనిపిస్తుంది. ప్రశ్నిస్తే మొత్తం జీవరాసుల మధ్య ఉండే వ్యత్యాసాలను ప్రశ్నించాలనీ, లేకపోతే అసలు మనుషుల మధ్య ఉండే వ్యత్యాసాల్ని కూడా ప్రశ్నించ కూడదనీ అనడం సరైంది కాదు. ఒకేసారి ప్రకృతిలోని వైరుధ్యాలన్నిటినీ పరిష్కరించడం ఎప్పటికీ సాధ్యం కాదు. అదొక క్రమపద్ధతిలో సాగాలి. ఆ పద్ధతిలో మానవులమధ్య ఉండే వ్యత్యాసాల్ని తొలగించుకోవడం మొదట మానవులకు అవసరం. మానవుల మధ్య ఉండే వ్యత్యాసాలు కూడా అన్నీ ఒకేసారి పోవు. ఏది ముందు, ఏది వెనుక, ఏది తక్షణ అవసరం, ఏది కాదు అనే ఆలోచన ఉండాలి ఇప్పటి వ్యవస్థలోని అవలక్షణాలన్నీ

ఒక్కసారిగా వచ్చినవి కావు గదా, ఒక్కసారి పోవడానికి ! ఈ భూమిపైన అన్ని జీవరాసులకూ హక్కుంది అనడం, దున్నేవాడికి భూమిపైన హక్కుంది అనడాన్ని నిర్లక్ష్యం చెయ్యడానికే అన్నట్టు కనిపిస్తుంది చలం వాదన. అన్ని జీవరాసులూ మానవుడితో సమానం అనే భావం చలం సాహిత్యంలో కూడా ప్రధానమైన విషయం కానే కాదు.

చలం నిరంతరం ఏదో సత్యాన్ని అన్వేషిస్తున్నట్టు కనిపిస్తాడు. ఈ అన్వేషణ క్రమంలోనే రమణాశ్రమం చేరాడు. అప్పటికీ ఆయన మనసులోని ఘర్షణ పూర్తిగా పోలేదు ఈ సత్యాన్వేషణలో ఆయన తెలుసుకున్న చివరి సత్యం - మనసు ఏ సత్యాన్నీ సంపూర్ణంగా తెలుసుకోలేదని. ఈ లోకానికి చివరి సత్యం సైంటిస్టుకి గానీ, ఫిలాసఫర్‌కిగానీ, కనబడలేదంటాడు. ఏదో ఒక చివరి సత్యం ఉందని అనుకోవడం వల్ల అది కనబడే అవకాశం లేదు. అది కనబడక పోవడం వల్ల నిరాశ. ఈ నిరాశ వల్ల మానవుడు ఏమీ తెలుసుకోలేడన్న అసంతృప్తి. ఈ ప్రపంచానికి ఏదో ఒక చివరి సత్యం ఉంటుందని అనుకోవడమే శాస్త్రీయమైన ఆలోచనా విధానం కాదు. అక్కడే చలం గాడి తప్పాడు.

చలం ఒక వ్యక్తిగా మన అంచనాకు అందనట్టు కనిపిస్తాడు. అనేక వ్యక్తుల సమూహంగా కనిపిస్తాడు. ఎన్నో వైరుధ్యాల పుట్టగా కనిపించే చలం ఒక్కోసారి తల తిరిగిపోయే సత్యాల్ని ప్రకటిస్తాడు

-గుణసంపన్నుడంటారే - ఆ వింత మృగం సృష్టిలో ఉండటానికి వీలులేదు.

-వచనంలో రాయలేని వాడు పద్యం రాస్తాడు.

- సమాజంలో సంస్కారం ఉంటే ప్రజలందరికీ ఉంటుంది. ఇలాంటివెన్నో కనిపిస్తాయి. చలం ఏమాట చెప్పినా దాని వెనుక ఉన్న ఆయన చిత్తశుద్ధి పాఠకుణ్ణి లోబరచుకుంటుంది. ధర్మంగా బతకడం సంఘాన్ని ఉద్ధరించడానికి కాదనీ, తనను తాను ఉద్ధరించుకోవడానికేననీ అంటాడు తన రచనల విషయంలో కూడా ఇదే అభిప్రాయాన్ని వ్యక్తం చేస్తాడు తమ ఆనందం కోసమే తాము రాస్తున్నామని కొందరు చెప్పుకున్నట్టుగా, తనను తాను సంస్కరించుకోడానికే రాస్తున్నా నంటాడు చలం. అంతమాత్రం చేత ఆ రచనలు ఈ పరిధిలోనే ఉండిపోవు సమాజాన్ని కదిలిస్తాయి. ఆలోచనల్ని రేపుతాయి. ఉక్కిరి బిక్కిరి చేస్తాయి. కొన్ని విలువల్ని నేర్పుతాయి. చలం రచనలు చేసిన పనీ అదే.

ఒక్కమాటలో చెప్పాలంటే కుళ్ళి కంపుకొట్టే సమాజం బాగుపడాలని చలం పడ్డ తపన, ఆవేదన, ఆవేశాలే ఆయన సందేశం.

(అరుణతార : మే 1994)

# విస్తరిస్తున్న విప్లవ కవిత్వం

1

"కెరటం విరగడం
తీరాన్ని విస్తరించడానికే !
ఒడ్డునున్న ఇసుక రేణువుల్ని
సాగర గర్భంలో ఇముడ్చడానికే !
ఉద్యమం లోతు చూపడానికే !
కెరటం విరగడం
చేపల్నించి తిమింగలాల్ని వేరు చేయడానికే !"

2

ఇది విప్లవకవితా సంకలనం. 1980 నుండి నేటివరకు విరసం సభ్యులు రాసిన కవితల్లోంచి ఏరికూర్చిన కవితలివి. విప్లవకవిత్వం అంటే విరసం సభ్యులు మాత్రమే రాసింది కాదని విరసం మొదట్నుంచీ చెబుతూనే ఉంది.. అంతమాత్రం చేత విప్లవకవిత్వ సృజనలో విరసం సభ్యుల పాత్ర తక్కువనీ కాదు.

ఈ సంకలనంలో స్థానం సంపాదిచుకున్న వందమంది కవుల్లో కొందరు ఇవాళ విరసంలో లేకపోవచ్చు. కొందరు విప్లవ సాహిత్యోద్యమానికి కూడా దూరం అయి వుండవచ్చు. కానీ వాళ్ళు రాసిన ఈ కవితలు విరసంలో సభ్యులుగా ఉన్నప్పుడు రాసినవే. విప్లవ సాహిత్యోద్యమంతో పెనవేసుకు పోయినప్పుడు గుండెల్ని చీల్చుకు వచ్చినవే.

ఈ కవుల్లో అమరులైన వాళ్ళూ ఉన్నారు. వారిలో అనారోగ్యంతోనో, వృద్ధాప్యం వల్లనో మరణించిన వారికంటే బూటకపు ఎన్‌కౌంటర్లలో హత్య చెయ్యబడ్డ వాళ్ళే ఎక్కువ.

సాంస్కృతిక రంగానికే పరిమితమయిన వాళ్ళూ, సాంస్కృతిక రంగంనుండి విప్లవోద్యమంలోకి ఉరికినవాళ్ళూ, విప్లవకారులుగానే జీవితాన్ని ప్రారంభించి సాహిత్యంవైపు దృష్టిసారించి తమ అనుభవాలను కవిత్వీకరించినవాళ్ళూ, 'మాయమైన గుండె స్థానంలో / మండుతున్న సూర్యుణ్ణి ప్రతిష్ఠించుకుని' ఒక చేత్తో పెన్నూ మరో చేత్తో గన్నూ పట్టినవాళ్ళూ ఇందులో కనిపిస్తారు.

3

ఈ కవితా సంకలనం ఇవాళ ఈ రూపంలో వెలువడడానికి కొంత చరిత్ర ఉంది. విప్లవ కవిత్వాన్నంతా ఒక సంకలనంలో కూర్చడం అసాధ్యమే అయినా, విప్లవ కవిత్వంలో వచ్చిన పరిణామాన్ని తెలియజేసే విధంగా వీలయినంతవరకు ఒక సమగ్రమయిన కవితాసంకలనాన్ని తేవాలని 1985లోనే విరసం అనుకున్నది ఈ

బాధ్యతను నిర్వర్తించడానికి ముగ్గురితో ఒక సంపాదక వర్గాన్ని నియమించింది కవితల్ని సేకరించడం జరిగింది రెండు మూడుసార్లు ఈ ముగ్గురూ ఒకచోట కలవడానికి ప్రయత్నించినా, ఏ ఇద్దరో తప్ప ముగ్గురూ కలవడం జరగలేదు ఎట్టి పరిస్థితిలోనూ 1988 జనవరిలో జరిగే ఒంగోలు సభలనాటికి ఈ సంకలనాన్ని తేవాలని నిర్ణయించాం కానీ ఆ నాటికీ అది రాలేదు పని సాగుతున్నట్టే ఉండేది, పూర్తయ్యేది కాదు దీనికి ఎన్ని కారణాలు ఉన్నా అలసత్వం కూడా ఒక కారణం అని చెప్పక తప్పదు 1990 జనవరిలో హైదరాబాద్‌లో ఇరవయ్యేళ్ళ విరసం సభలు అశేష జన సందోహంతో, మహోత్తేజంతో జరిగాయి. ఈ ప్రేరణతో కవితాసంకలనం విషయం మళ్ళీ చర్చకొచ్చింది. అయితే ఈసారి దీని పరిధి మారింది. నక్సల్బరీ శ్రీకాకుళ ఉద్యమాల ప్రారంభదశ నుండే వచ్చిన విప్లవకవిత్వానికంతటికీ ప్రాతినిధ్యం వహించే విధంగా ఒక సమగ్ర కవితా సంకలనాన్ని తేవాలని మొదట అనుకున్న నిర్ణయాన్ని మార్చుకున్నాం. ఈ మార్పుకు కారణాలు లేకపోలేదు. అప్పటికే తెలుగు సాహిత్యంలో స్త్రీవాద, దళితవాద దృక్పధాలు చోటుచేసుకుని ఉన్నాయి. వీటి ప్రారంభం 1980వ దశకమే. 1990 నాటికి అవి సిద్ధాంతీకరింపబడే దశకు చేరుకున్నాయి. పత్రికల్లో చర్చలు ప్రారంభ మయ్యాయి. వాదోపవాదాలు జరిగాయి 1980వ దశకంలో ఇవే ప్రధాన ధోరణు లన్నారు. ఇంకా కొన్ని ఇతర ధోరణులూ వచ్చాయన్నారు. విప్లవ కవిత్వానికి కాలం చెల్లిందన్నారు. ఈ దశకం విప్లవ కవిత్వానిది కాదని 'నిర్ధారణ' చేశారు. ఈ నేపథ్యంలో ఆలోచించినప్పుడు 1980వ దశకంలో వచ్చిన విరసం సభ్యుల కవిత్వం ఎలా ఉందో ఒక సంకలనం ద్వారా అందించడం అవసరం అనిపించింది. అందువల్ల ఈ సంకలనం పరిధి తగ్గించబడింది. ఈ పరిమితి కాలానికి సంబంధించింది మాత్రమే. ఈ నిర్ణయం జరిగాక కొన్ని నిర్మాణపరమైన కారణాల వల్ల కొత్త సంపాదక వర్గం ఏర్పడింది. దీన్ని పాఠకుల ముందుంచడానికి ఈ సంపాదకవర్గానికి ఇంతకాలం పట్టింది.

1980వ దశకం విప్లవ కవిత్వానిదే అని చెప్పాలన్న తాపత్రయం మాకు లేదు. 1970వ దశకం విప్లవ కవిత్వానిదేనని అందరూ ముక్త కంఠంతో చెప్పారు. 80వ దశకం విషయం వచ్చేసరికి భిన్నకంఠస్వరాలు వినిపించాయి. అయితే 70వ దశకంలో కంటే 80వ దశకంలో విప్లవ కవిత్వం గొంతు ఏమాత్రం నీరసించి పోలేదని చెప్పడమే మా ఉద్దేశం. పైగా ఈ దశకంలో విప్లవ కవితకి స్వరూపస్వభావాలు మారాయి, విస్తరించాయి. ఈ కవితాసంకలనం ఈ వాస్తవాన్ని నిరూపిస్తుంది.

విరసం సభ్యుల కవితాపటిమకు ఈ సంకలనం ఒక్కటే సమగ్రమైన నిదర్శనం కాదు. సంకలనం మరీ పెద్దదైపోతుందన్న కారణంగా వస్తు శిల్పాల సమ్మేళనం గొప్పగా ఉన్న అనేక కవితల్లో కొన్నిటినే తీసుకోవలసి వచ్చింది. వస్తుశిల్పాలలో ఉన్న వైవిధ్యాన్ని ప్రదర్శించాలన్న ఉద్దేశం కూడా ఉంది. ప్రధానంగా కవిత్వం రాస్తున్న విరసం సభ్యులందరి కవితలూ ఒక్కొక్కటైనా చేర్చడం జరిగింది. ఈ కారణాల వల్ల మంచి కవితలు అనేకం ఇందులో చోటు చేసుకోలేకపోయాయి.

విరసం పుట్టినప్పటినుంచీ విరసం సభ్యులూ, యూనిట్లూ ఎన్నో కవితా సంకలనాల్ని తీసుకొచ్చినా, విరసం రాష్ట్ర సంస్థగా వెలువరించిన కవితాసంకలనాలు తక్కువే. విరసం ఏర్పడగానే 'ఝంఝ' పేరుతో, ఒక సంకలనాన్ని, విరసం పుట్టి ఒక దశాబ్దం గడిచిన సందర్భంగా 1980లో 'మరో ఝంఝ' పేరుతో మరో సంకలనాన్ని విరసం ప్రచురించింది విరసానికి పాతికేళ్ళు వచ్చిన సందర్భంగా ఈ సంకలనం. ఒకటి పుట్టుకతో, మరొకటి బాల్యంలో, ఇది యౌవనంలో ...

## 4

"పోరాటంలో ఆయుధం ధరించనివాడికి ఎండిన
బొమికెలు తప్ప రాజ్యాధికారమెలా సిద్ధిస్తుంది
కేవలం తుపాకేకాదు
దాన్నిపట్టే చేతులు ప్రజలవైతే ప్రజారాజ్యం తెస్తాయి"

విప్లవోద్యమం లేకుండా విప్లవసాహిత్యం ఉండదు. విప్లవోద్యమం మొదలయ్యాక అది తాత్కాలికంగా ఎన్ని ఆటుపోట్లకు గురైనా, అవి సాహిత్యంలో ప్రతిఫలిస్తాయ్ గాని సాహిత్యోద్యమం తాత్కాలికంగా కూడా ఆగిపోవలసిన అవసరం లేదు.

ఈ దేశంలో కమ్యూనిస్టు పార్టీ పోరాటాన్ని వదిలి, పార్లమెంటరీ విధానాలకు, ఎన్నికల తతంగానికి మాత్రమే పరిమితమై పోయినప్పుడు పార్టీయే దిక్సూచిగా ఉన్న సాహిత్య కళారంగాలు కొంతవరకు దిక్కుతోచని స్థితిలో పడిపోయినా శ్రీశ్రీలాంటి వ్యక్తులు పోరాట వారసత్వాన్ని కొనసాగించే ప్రయత్నం చేశారు. భారత కమ్యూనిస్టు పార్టీ రివిజనిస్టు పంథాలో కూరుకుపోయి 'స్వతంత్ర' భారత్‌కూ, 'మహాత్మా' గాంధీకీ జైకొడుతున్న రోజుల్లో 'స్వాతంత్ర్యం వచ్చెననీ సభలే చేసి సంబరపడగానే సరిపోదోయీ' అని గుర్తుచేసినవాడు శ్రీశ్రీ. రివిజనిస్టు తుప్పును వదలగొట్టి నివురుగప్పిన విప్లవాగ్నిని కణకణమండింప జేసింది నక్సల్బరీయే.

నిజానికి 1970 జులై 4న విరసం ఏర్పడేనాటికి శ్రీకాకుళ పోరాటం కొన ఊపిరితో ఉంది. తన కలంతోనూ, గళంతోనూ, ఆయుధంతోనూ విప్లవాన్ని పండించి మండించిన సుబ్బారావు పాణిగ్రాహిని అప్పటికే పోలీసులు చంపేశారు. కొందరు నాయకులు జైళ్ళలోకి నెట్టబడ్డారు. బయట ఉన్న నాయకత్వంలో వెంపటాపు సత్యం, ఆదిభట్ల కైలాసం తప్ప తక్కిన వాళ్ళందరూ నియమాల్ని మరచిపోయిన పోలీసు తుపాకులకు బలైపోయి తమ రక్తంతో ఎర్రజెండాని మరింత ఎరుపెక్కించారు. విరసం ఏర్పడ్డ వారం రోజులకే జులై 10న సత్యం కైలాసంలను కూడా బూటకపు ఎన్‌కౌంటర్లలో పోలీసు ప్రభుత్వం హత్య చేసింది. ప్రభుత్వమూ, పోలీసులూ, పాలకవర్గ మేధావులూ నక్సల్బరీ శ్రీకాకుళాల పని అయిపోయిందనుకున్న సమయంలోనే విరసం పుట్టింది. సమసమాజ వ్యవస్థ కోసం తృణప్రాయంగా తమ ప్రాణాల్ని అర్పించిన శ్రీకాకుళ పోరాట వీరుల రక్తాన్ని విప్లవ రచయితలు తమ కలాల్లో నింపుకుని విప్లవ చైతన్యపు వాడినీ వేడినీ బలంగా ప్రదర్శించారు. బూటకపు ఎన్‌కౌంటర్లతో, పోలీసు నిర్బంధంతో, ప్రభుత్వ

దమననీతితో విప్లవం ఆగిపోదని ఆనాడు విప్లవకవి స్పష్టం చేశాడు. 'యిప్లవం యేమందిరా / మనిసి కొకటే సావందిరా / కట్లు తెంచుక రమ్మందిరా / కత్తి దూసుక లెమ్మందిరా' అని ప్రబోధించాడు. 'మంటల చేత మాట్లాడించి, రక్తం చేత రాగాలాపన' చేయిస్తానన్నాడు. నక్సలైట్ అనే పదం కొత్తగా పుట్టిందనీ, ప్రభుత్వం ఎంతమంది విప్లవకారుల్ని చంపినా 'నక్సలైట్' అనే పదాన్ని లేకుండా చెయ్యలేదనీ ప్రభుత్వాన్ని హెచ్చరించాడు. అప్పట్లో తాత్కాలికంగా విప్లవోద్యమం ఆగిపోయినా విప్లవ కవిత్వం ఆగిపోలేదు, విప్లవ కంఠం మూగబోలేదు. అమరవీరుల త్యాగం విప్లవకవితలకూ, పాటలకూ ప్రాణం అయింది. అప్పటినుండే విప్లవకవిత్వంలో ఎలిజీలకు ప్రాధాన్యం వచ్చింది. ఎలిజీ అనేది అమరులైన వాళ్ళ జ్ఞాపకాలకూ, వియోగ బాధకూ మాత్రమేగాక 'ఒక వీరుడు మరణిస్తే వేలకొలది ప్రభవింతురు' అనే చైతన్యాన్ని కలిగించడానికి బలమైన సాధనమైంది.

పోరాటంనుండి, వీరుల త్యాగాల నుండి పుట్టిన విరసం ఒక దశాబ్దం తర్వాత ఏమైంది ? ఏమవ్వాల్నో అదే అయింది. బాల్యారిష్టాన్ని దాటి మరింత శక్తివంతమై యౌవనంలో ప్రవేశించింది. ఆవేశంతోబాటు ఆలోచనను పెంచుకొంది. సిద్ధాంత పరిజ్ఞానాన్ని అనుభవాల గీటురాయిపై సరిచూసుకుంది. ఏ ఉద్యమమైనా కొన్నాళ్ళే అన్న సూత్రం తన స్వభావానికి సరిపడదని నిరూపించుకుంది.

## 5

విప్లవ కవిత్వంలో 80లలో వచ్చిన ఒక గొప్ప పరిణామం విప్లవకారుడు విప్లవ కవిగా కూడా మారడం. విప్లవోద్యమ అనుభవాలు కవిత్వంలోకి రూపాంతరం చెందడం. అజ్ఞాతంలోకి వెళ్ళడమంటే తుపాకీ పట్టుకోవడం మాత్రమేననీ, సాహిత్యంతో, కళలతో సంబంధం ఉండదనీ సాధారణంగా అనుకొనేవారు. అప్పటికే శివసాగర్ లాంటివాళ్ళు లేరా అంటే అపవాదంగా భావించేవారు. కానీ యు.జి.లోని సామాన్య కార్యకర్తలు కూడా సాహిత్యాన్ని సృష్టించడం ఈ దశకంలో ఒక ప్రత్యేకత. సాహిత్యానికి మూలకందం మానవాళిపై ప్రేమ అని మావో అన్నమాటకు ఇది ఆచరణ రూపం. మానవాళి అంటే తొంభైశాతంగా ఉన్న పీడిత ప్రజలు. విప్లవకారులకు ఈ ప్రజలపైనే ప్రేమ ఉంటుంది ఆ ప్రేమ త్యాగాన్ని కోరుకుంటుంది. ఆ త్యాగానికి సిద్ధపడేవాడే విప్లవకారుడు. అతడు ఒకే సమయంలో విప్లవకారుడూ, విప్లవకవీ కావడానికి కూడా కారణం మానవాళిపై అతనికున్న అచంచలమైన ప్రేమే. ఈ కోణంనుంచి చూసినప్పుడు విప్లవంలో సైనికులకూ, కలం సైనికులకూ ఉండాల్సిన అవినాభావ సంబంధాన్ని ఈ దశకంలో సాహిత్య సాంస్కృతిక సంస్థగా విరసం సాధించిందని చెప్పవచ్చు. ఆనాటి పాణిగ్రాహిలాగా ఈనాటి సముద్రుడు, యం.యస్.ఆర్., నూతన్, సహదేవ్, విశ్వనాథ్ మొదలైన వాళ్ళందరూ ఈ వారసత్వంలోనివారే

ఈ దశకంలోనే విప్లవకవిత్వం సాధించిన మరొక మహత్తరమైన గుణం కవిత్వంలో హీరోవర్షిప్ లేకుండా చెయ్యడం. ఇది పనిగట్టుకుని ప్రచారం ద్వారా చేస్తే అయ్యేది కాదు. ఒక కవి వటవృక్షంలా విస్తరించడం, తక్కిన కవులు ఆ చెట్టు నీడన

బతికే మొలకల్లా ఎదుగూ బొదుగూ లేకుండా గిడసబారిపోవడం అనే పరిస్థితి నుండి బయట పడ్డప్పుడే ఇది ఆచరణలోకి వచ్చినట్టు గొప్ప కవితలు, పాటలు ఒకటో రెండో రాసి, పెద్దగా గుర్తింపు లేకుండా ఉండిపోయిన కవులు గుర్తింపదగిన సంఖ్యలోనే ఈ దశకంలో వచ్చారు. గొప్ప కవి ఏడీ అంటే ఏ ఒక్కరినో చూపించవలసిన స్థితికంటే, గొప్ప కవిత్వం ఏదీ అంటే ఎంతోమంది కవితలనో, పాటలనో చూపించగల స్థితిరావడం కవిత్వ అభివృద్ధికీ, విస్తరణకూ తార్కాణం అవుతుంది. ఇదే సాహిత్యంలో ఉండే సమిష్టి దృక్పథం, ప్రజాస్వామ్య స్వభావం. ఈ ధోరణి విప్లవ సాహిత్యంలో మాత్రమే వచ్చింది కాదు, ఈ దశకంలోని విప్లవోద్యమంలో కూడా ప్రారంభమైంది. ఫలానా నాయకుడు లేకపోతే విప్లవోద్యమమే లేదన్న స్థితిపోయి, ఎంతగొప్ప వాళ్ళైనా వ్యక్తులు వ్యక్తులే సంస్థ సంస్థే అని నిరూపించడానికి ప్రసవ వేదననునుభవించిన దశకం ఇది. ఈ ప్రసవ వేదననుంచి పుట్టిన బిడ్డే సమిష్టి నాయకత్వం అనేది. గ్రూపుల ధోరణి, ముఠాల వాతావరణం బలంగా ఉన్న మనదేశ బూర్జువా రాజకీయాల ప్రభావం కొంతకాలం వరకు విప్లవ రాజకీయాలపైన పడ్డా, దాన్నుంచి బయట పడి సమిష్టి నాయకత్వ స్వభావాన్ని అలవర్చుకోడానికి జరిగిన ప్రయత్నం అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమంలోనే ఒక మలుపుగా చెప్పుకోవచ్చు. ఈ స్వభావమే సాహిత్యరంగంలో కూడా ప్రతిఫలించింది. ఉమ్మడి కమ్యూనిస్టు ఉద్యమకాలంలో శ్రీశ్రీ పక్కన నిలబడగలిగిన అభ్యుదయ కవులు లేకపోవడం వ్యక్తిగతంగా శ్రీశ్రీకి గర్వకారణమేమోగాని, అభ్యుదయ సాహిత్యోద్యమానికి అది గర్వకారణం కాకూడదు. నక్సల్బరీ వెలుగులో విప్లవ సాహిత్య సాంస్కృతికోద్యమ తొలి దశలో ఇలాంటి హీరోలు కొందరు కనిపించినా 1980వ దశకం ఈ వాతావరణాన్ని మార్చగలిగింది. శ్రీకాకుళ పోరాటం నాటికి పాణిగ్రాహి ఇలాంటి హీరో కావచ్చు. 70వ దశకంలో జననాట్యమండలి కళాకారుడు గద్దర్ అలాంటి హీరో కావచ్చు. కానీ ఇవాళ పరిస్థితి అదికాదు. ఆ తర్వాతి కాలంలో పాణిగ్రాహిలాంటి విప్లవకవులూ, గద్దర్‌లాంటి విప్లవ వాగ్గేయకారులూ కొంతమందైనా రాగలిగారు. జాతీయోద్యమ కాలంలో అల్లూరి సీతారామరాజూ, భగత్‌సింగూ అప్పటికి హీరోలే. ఆ కాలానికి అలాంటి వాళ్ళు వేళ్ళమీద లెక్కపెట్టదగినవాళ్ళే. అయితే ఈ నాటికి అలాంటి హీరోలు ఎందరో కనిపిస్తారు. ఎందరో ఉన్నారు కాబట్టే ఏ ఒక్కరినో ప్రత్యేకంగా చెప్పుకునే అవకాశం లేదు. ఆ హీరో లక్షణాలు ఏ ఒక్క వ్యక్తిలోనో గాక, ఎక్కువ మందిలోకి విస్తరించడం ఈ దశకంలో విప్లవోద్యమం సాధించిన గొప్ప లక్షణం. ఈ స్వభావమే విప్లవ సాహిత్య సాంస్కృతిక రంగాల్లో కనిపిస్తుంది. ఈ స్వభావాన్ని అర్థం చేసుకోకుండా 1980లోని విప్లవోద్యమాన్నీ, విప్లవ సాహిత్యోద్యమాన్నీ సమీక్షించడం సమంజసం కాదు.

విరసం దృష్టిలో కవిత్వం కవిత్వం కోసమే కాదు. ఈ సమాజం ఉన్న స్థితి కంటే ఉన్నత స్థితికి పోవడానికి అవసరమైన ప్రోత్సాహాన్నివ్వడం, చైతన్యాన్ని కలిగించడం దాని లక్ష్యం. ప్రపంచ సాహిత్యంలో శాశ్వతంగా నిల్చిపోయే సాహిత్యాన్ని సృష్టించడం విరసం ధ్యేయం కాదు. విరసం సృష్టించిన సాహిత్యం అలా నిల్చిపోవడం వేరు. ఆ

ఉద్దేశంతోనే సాహిత్యం సృష్టించడం వేరు  సమాజాన్ని ఒకడుగు ముందుకు వేయించేందుకు జరుగుతున్న పోరాటంలో తనవంతు పాత్రను నిర్వహించడం దాని ధ్యేయం. విప్లవ యంత్రానికి సాహిత్యం కళలూ పళ్ళూ చక్రాల్లాంటివని లెనిన్ అన్నా, సాహిత్యమూ కళలూ రాజకీయాలకు లోకువే అయినా అవి రాజకీయాల మీద గొప్ప ప్రభావాన్ని కలిగిస్తాయని మావో చెప్పినా అర్థం ఇదే.

## 6

షుమారు గత రెండు దశాబ్దాలుగా మహిళల సమస్యలు చర్చనీయాంశంగా ఉన్నాయి. మరీ ముఖ్యంగా 1980ల నుండి ఇవి ఒకరూపాన్ని తీసుకున్నాయి. స్త్రీ సంఘాలు ఏర్పడ్డాయి. స్త్రీ విముక్తి చైతన్యాన్ని కలిగించే దృష్టితో ప్రత్యేకంగా పత్రికలు వచ్చాయి. స్త్రీల ప్రత్యేక సమస్యల్ని కొత్త కోణాల నుండి చూడ్డం ప్రారంభమయింది. సాంఘిక ఆర్థిక పీడనలతో బాటు స్త్రీలు లైంగిక హింసను అదనంగా అనుభవిస్తున్నారన్న అంశం ప్రముఖంగా ముందుకొచ్చింది. ఇది తరతరాలుగా ఉన్నదే అయినా ప్రధానంగా గుర్తింపులోకి వచ్చింది. ఆ మేరకు ఆ చైతన్యం కలిగిందని చెప్పాలి. ఈ ప్రభావంతో స్త్రీవాద సాహిత్యం అందులో ఒక ప్రక్రియగా స్త్రీవాద కవిత్వం వెలువడ్డం ప్రారంభమయింది.

అలాగే కుల సమస్య కూడా ఈ దశకంలోనే ముందుకొచ్చింది  పాలకవర్గాలు, బూర్జువా రాజకీయ పార్టీలు కులాన్ని రాజకీయ చదరంగంలో ఒక పావుగా వాడుకోవడం మొదలైంది. పాదిరికుప్పం, కారంచేడు, నీరుకొండ, చుండూరు మొదలైన గ్రామాల్లో దళితులపై భౌతిక దాడులు పెద్ద యెత్తున జరిగాయి  దళితులు కూడా తమపై తరతరాలుగా సాగుతున్న అణచివేతను ఎదుర్కోడానికి సిద్ధవడేట్టుగా చైతన్యవంతులయ్యారు. నిజానికి వాళ్ళ చైతన్యాన్ని అగ్రవర్ణాలు సహించలేకపోయాయి. ఆ సహించలేకపోవడం వాళ్ళ చైతన్యాన్ని మరింత పెంచింది. దళితులు సంఘటితపడే క్రమం ప్రారంభమయింది. దళిత సమస్య కూడా సైద్ధాంతిక స్థాయిలో చర్చింపబడడం ఈ దశకంలో గమనింపదగ్గ అంశం. దళిత సమస్య సాహిత్యంలో కూడా ప్రతిఫలించింది.

స్త్రీలు, దళితులు అందరితోబాటు ఆర్థిక రాజకీయ దోపిడీలకు గురవుతున్నా లైంగికంగా స్త్రీలు, సామాజికంగా దళితులు ప్రత్యేకంగా దోపిడికి బలవుతున్నారన్న వాస్తవాన్ని స్త్రీ చైతన్యం, దళిత చైతన్యం అందరిచేతా గుర్తింపజేశాయి. పురుషాధిపత్యానికి వ్యతిరేకంగా స్త్రీలు, సాంఘిక అణచివేతకు వ్యతిరేకంగా దళితులు పోరాడవలసిన అవసరం ఎంతైనా ఉంది. ఈ పోరాటాల వల్ల మొత్తం వ్యవస్థను మార్చడానికి జరిగే వర్గ పోరాటం ఆగిపోతుందనీ, లేదా పక్కదారి పడుతుందనీ మార్క్సిజం తెలిసిన వాళ్ళెవరూ అనుకోరు. ఆర్థిక దోపిడివల్ల శ్రామిక వర్గం ఎంతగా ప్రతిస్పందిస్తుందో, స్త్రీలు, దళితులు కూడా వాళ్ళపై ప్రత్యేకంగా జరుగుతున్న దోపిడికి అంతగానే ప్రతిస్పందిస్తారు. అయితే మహిళా ఉద్యమాలు, దళిత ఉద్యమాలు మార్క్సిజాన్ని తిరస్కరించడం వల్ల, అదే తమకు ప్రధాన శత్రువని భావించడం వల్ల, సిద్ధాంత నిర్మాణ వ్యతిరేకతల్ని ప్రోత్సహించడం వల్ల అవే పక్కదారి పడుతున్నాయన్న విషయాన్ని

స్త్రీవాదులూ, దళితవాదులూ గుర్తించడంలేదు. తూర్పుయూరపు పరిణామాలు, సోవియట్ యూనియన్ పతనం మార్క్సిజం వైఫల్యాన్ని సూచించవు. ఆయాదేశాల కమ్యూనిస్టు పార్టీలూ, నాయకులూ అనుసరించిన రివిజనిజం, సోషల్ సామ్రాజ్య వాదం పతనం చెందాయనడానికి ఆ సంఘటనలు నిదర్శనాలు. సోవియట్ యూనియన్ పతనమైన సంవత్సరం మార్క్స్ రాసిన దాస్ కాపిటల్ గ్రంథం ప్రతులు అమెరికాలో ఎక్కువగా అమ్ముడుపోవడం కేవలం యాదృచ్ఛికం కాదు. ప్రపంచ వ్యాప్తంగా కమ్యూనిజం పతనమైందని బూర్జువా ప్రచార ప్రసార సాధనలు బాకాలూదుతుంటే, ఆంధ్ర దండకారణ్యాలలో రెట్టింపు ఉత్సాహంతో విప్లవోద్యమం ముందుకు సాగడం నిప్పులాంటి నిజం. కమ్యూనిజం విఫలమయిందనడానికి ప్రజాస్వామ్యం ఏ దేశంలో విజయవంతమైంది గనక ! ఎన్‌కౌంటర్ అంటేనే బూటకపు ఎన్‌కౌంటర్ అయినట్టుగా ప్రజాస్వామ్యం అంటేనే బూటకపు ప్రజాస్వామ్యం అనే విషయం ఎవరికి తెలియదు ? మార్క్సిస్టు సిద్ధాంత ఆచరణలకున్న కాలం ఒకటిన్నర శతాబ్దాలు మాత్రమే. సుదీర్ఘమైన చరిత్ర కలిగిన సమాజంలో ఈ అల్పకాలంలోనే మార్క్సిజం పనికిరాదని తేల్చడం ఏరకమైన తర్కం ? తర్కం గతి తర్కం అయినప్పుడే అది విలువయింది అవుతుందిగాని, లేకుంటే అదికుతర్కమే అవుతుంది.

సిద్ధాంత వ్యతిరేకత మార్క్సిజాన్ని వ్యతిరేకించడం గానూ, నిర్మాణ వ్యతిరేకత కమ్యూనిస్టు నిర్మాణాన్ని వ్యతిరేకించడంగానూ పరిణమిస్తున్నాయి. ఇంతవరకు కమ్యూనిస్టు ఉద్యమం ఈ రెండు సమస్యలపట్ల ప్రత్యేక దృష్టిని పెట్టలేదనడాన్ని అర్థం చేసుకోవచ్చుగానీ, ఇవాళ విప్లవ సంస్థల్లో ఉన్నవారే పురుషాహంకారాన్ని కావాలని ప్రదర్శిస్తున్నారనీ, కులమత భేదాల్ని పాటిస్తున్నారనీ అనడం స్త్రీ వాద దళిత వాదాల విపరీత ధోరణికి నిదర్శనం. ప్రత్యేక స్పృహతో, చైతన్యంతో ప్రవర్తిస్తే తప్ప విప్లవకారుల్లో కూడా సహజంగానే ఉండే పురుషాధిపత్య కులమత తత్వాలు పోవు. విప్లవ పార్టీలు, సంస్థల్లో ఈ స్పృహను తేవడానికి మహిళా ఉద్యమాలూ, దళిత ఉద్యమాలూ ప్రేరణ అయినాయనడంలో సందేహం లేదు. కవిత్వం విషయానికి వస్తే విప్లవకవులు 1986లోనే 'దళిత్ మానిఫెస్టో', 1988లోనే 'పేశ్యా శిశువు' కవితల్ని రాయడాన్ని మర్చిపోకూడదు.

స్త్రీవాద దళితవాదాలు వాటికవే స్వతంత్రమయిన సమగ్రమయిన ప్రాపంచిక దృక్పథాలు కావు. విరసం ఈ రెండూ వాదాల్నీ, సాహిత్యాల్నీ హృదయపూర్వకంగా ఆహ్వానిస్తూనే చెబుతున్న మాటయిది మార్క్సిజం ఒక సమగ్ర ప్రాపంచిక దృక్పథం. ఇది ఏదో వాదంకాదు. ఎప్పటికప్పుడు మానవుడు సాధిస్తున్న భౌతిక పరిజ్ఞానాన్ని తనలో ఇముడ్చుకుని మరింత సజీవంగా ఉండేశక్తి దానికుంది. స్త్రీ పురుష భేదం లేకుండా, నిమ్నవర్ణ అగ్రవర్ణ భేదం లేకుండా జరిగేది ఆర్థిక దోపిడీ. ఆర్థిక దోపిడీని రూపుమాప వలసిన అవసరం అందరికీ ఉంది. ప్రతి మనిషికి మౌలికమైన అవసరాలు కూడు, గూడు, గుడ్డ. ఇవి సంపాదించగలిగేది ఆర్థిక దోపిడికి వ్యతిరేకంగా జరిగే ఉద్యమమే. అయితే మనిషికి కావలసింది ఇవి మాత్రమే కాదు వీటితో బాటు సాహత్యం, కళలు, విజ్ఞానం, స్వేచ్ఛ, స్వాతంత్ర్యం, హక్కులు బాధ్యతలు వగైరా అన్నీ కావాలి. ఇవన్నీ

సాధించి సమిష్టి అనుభవంలోకి తేగలిగిన సంపూర్ణ మానవుడు రూపొందాలి. మార్క్సిజానికి అంతిమ లక్ష్యం ఇదే. ఈ లక్ష్యం ఒక్కనాటితో, ఒక ఉద్యమంతో నెరవేరేది కాదు. ప్రధాన వైరుధ్యాన్ని పరిష్కరించుకునే ప్రయత్నం ప్రథమలక్ష్యంగా ఉంచుకుంటూనే, అప్రధాన వైరుధ్యాల్ని కూడా వీలయినంత వరకు పరిష్కరించుకునే ప్రయత్నం చేస్తుండాలి. అయితే ఇది సంస్కరణకు దారితియ్యకూడదు. సంస్కరణలు కాలానుగుణంగా చెయ్యడం వేరు, సంస్కరణ వాదాన్ని ప్రబోధించడం వేరు. ప్రధాన ఉద్యమంతో వీటిని సమన్వయించాలన్న విషయాన్ని గతంలో కమ్యూనిస్టులు గుర్తించక పోవచ్చు. ఒకవేళ గుర్తించినా సాధించడంలో విఫలం అయివుండవచ్చు. అంతేగాని వీళ్లే కావాలని ఈ అసమానతల్ని పెంచిపోషించారనడం ఒక గాలివాటులో చెప్పేమాట తప్ప వేరుకాదు. చాలా సిద్ధాంతాలు ఆదర్శప్రాయంగా ఉంటాయి. కాని మార్క్సిజం కేవలం ఆదర్శం కాదు. ఆచరణ శాస్త్రం కూడా. ఒక సమస్యని అన్ని కోణాల్నించీ పరిశీలించి, సృజనాత్మకంగా, దేశకాల నిర్దిష్టతలతో అన్వయించి, ఫలితాన్ని సాధించడానికి ఉపయోగపడే సిద్ధాంతం. గత సామాజిక పరిణామాల్ని ఆధారంగా భవిష్యత్ పరిణామాల్ని శాస్త్రీయంగా ఊహించగలిగిన సిద్ధాంతం. కాబట్టి రచయితలకు ఈ సమగ్రమైన ప్రాపంచిక దృక్పథం ఉండాలి.

80వ దశకంలోని విప్లవ కవిత్వంతో ఈ అవగాహన మరింత వికసించిందేగాని కుంచించుకుపోలేదు. ఈ అవగాహనా ప్రకటనకు అవసరమైన కవితారూపాల్నీ, శిల్పాన్నీ ఎంచుకున్నారు తప్ప విప్లవకవులు రూపాన్నీ, శిల్పాన్నీ నిర్లక్ష్యం చెయ్యలేదు. 'నడిరేయికీ ఉదయానికీ తేడా మనిషి శవమై వేలాడటమేనని స్తంభం రుజువు చూపుతుంది' 'ఖాళీ అయిన రోడ్ల నిండా వాడు ఆకలై ప్రవహిస్తాడు' 'మా గోదావరి పోరు గలగల ముందు నీ బూటకపు ఎన్‌కౌంటర్ల మోత వెలవెల బోతుంది' వంటి నూతన వ్యక్తీకరణలు ఈ సంకలనంలో కొల్లలు.

తెలుగు సాహిత్యరంగంలో బహుముఖ చర్చలు సాగుతున్న నేపథ్యంలో మేం ఈ విప్లవ (విరసం సభ్యుల) కవితా సంకలనాన్ని వెలువరిస్తున్నాం. రూపం, శిల్పం, వస్తువు - అన్నిటిలోనూ వైవిధ్యం ఉండే విధంగా కవితల్ని ఎన్నిక చేశాం. చేనేత కార్మికుల నుండి విప్లవ కారుల వరకు, మాజీనక్సలైట్ల నుండి పోరాటంలో అమరులవుతున్న వాళ్ల వరకు, చుండూరు వంటి సంఘటనల నుండి కాకతీయ ప్యాసింజర్ బోగీదగ్ధం వరకు, స్త్రీలు, దళితులు, ఇతర శ్రమజీవులు, వారి సమస్యలు - ఇవన్నీ ఈ కవితలలోని వస్తువులు. విభిన్న కవితారూపాలు, వ్యక్తీకరణ పద్ధతులు, భాషాశైలులు ఈ సంకలనంలో చూడవచ్చు. 1980 తర్వాత విప్లవోద్యమంలోని కోణాలను, పరిణామాలను దీనిద్వారా అర్థం చేసుకోవచ్చు. తొలి సోషలిస్టు దేశాన్ని నామరూపాలు లేకుండా చెయ్యాలని అంతర్జాతీయ నియంతృత్వం ప్రయత్నించినపుడు 'గర్జించు రష్యా గాండ్రించు రష్యా పర్జన్య శంఖం పలికించు రష్యా' అన్న విప్లవకవే ఆ తర్వాత అదే రష్యా అంగోలా ఆఫ్ఘనిస్తాన్‌లను ఆక్రమించినప్పుడు 'గర్జించు రష్యా గాండ్రించు రష్యా దేశాలనన్నీ

కబళించు రష్యా' అని అనగలిగిన ఆత్మ విమర్శనా దృక్పథం ఈ సంకలనంలో కనిపిస్తుంది.

ఎంత ఉన్నతమైనా శ్రామిక వర్గ సాహిత్యాన్ని బూర్జువా వర్గం నిరాకరిస్తుందని మావో అన్నమాట అదృశ్యం కావడానికి ఇంకా శ్రామిక రాజ్యం రావలసే ఉంది గదా !

అంతవరకూ -

"జామ చెట్టున పండు - కొరికేటి చిలకా
నీ నోటిగాటుతో - పండెంత తీపో
ఆనోటి తీపిగా - యీ మాటనందించు
అడివిలో అన్నలకు - నా ఎరుపుదండాలు"

(రచనాకాలం 10-10-1994. **'కవిత్వంపై ఎర్రజెండా'** విప్లవకవితా సంకలనానికి ముందుమాటలు. ఈ సంకలనం మార్చ్ 1995లో వెలువడింది.)

# జాషువా దృక్పథంలో వైరుధ్యాలు

"వడగాడ్పు నా జీవితమైతే, వెన్నెల నా కవిత్వం" అని జాషువా తన జీవితం గురించీ, కవిత్వం గురించీ వ్యాఖ్యానించుకున్నాడు  తాను కవిత్వాన్ని వినిపించింది ప్రజలకే గాని, ప్రభువులకు కాదని మరో సందర్భంలో చెప్పుకున్నాడు.

"సకల కార్మిక సమాజముల జీవిత కథానకము లాలించు కర్ణములు నావి
కఠిన చిత్తుల దురాగతములు ఖండించి కనికారమొలికించు కలము నాది
దొడ్డ పదవులెక్కి గద్దిమేసెడివారి నెత్తిపొడుచు చిత్తవృత్తి నాది" అని తనది పీడిత ప్రజల పక్షమేనని చాటుకున్నాడు. భయకంపితమై హింసాపీడితమైయున్న ప్రజానీకానికి కవి వాక్కు ఆశాకిరణాన్నందించాలనీ, మిట్టపల్లాల్ని సమంచేసి చూపాలనీ, పీడిత ప్రజల మౌన బాష్పాలకు నోరిచ్చి రచ్చకెక్కించాలనీ అన్నాడు.

జాషువా చెప్పిన ఈ మాటల్లో కొన్ని వాస్తవాలున్నాయి. కొన్ని కోరికలున్నాయి. 'నాల్గుపడగల హైందవ నాగరాజు' పడగవిప్పి బుసలు కొడుతున్న ఈ హైందవ సమాజంలో జాషువా జీవితం వడగాడ్పే అవుతుంది. అయితే ఈ వడగాడ్పుల నుండి పొగలు, సెగలు చిమ్మవలసిన జాషువా తన కవిత్వం వెన్నెలలా ఉండాలని కోరుకుంటున్నాడు. వెన్నెల సేద దీరుస్తుంది. మనసుకు ఊరటనూ, ఆహ్లాదాన్నీ కలిగిస్తుంది. వేడిని చల్లబరుస్తుంది. సరిగ్గా జాషువా తన కవిత్వం ద్వారా ఈ పనే చేశాడు. కులం పేరుతో సాంఘిక అణచివేతకు గురైన దళితులకు ఈ ఊరట కలిగిస్తుంది జాషువా కవిత్వం. నిజానికి జాషువా అనుభవించిన అవమానాలకు కవిగా ఆయన సూర్యుళ్ళా మండిపడవలసినవాడు. అగ్ని పర్వతంలా పేలి లావాను వెదజల్ల వలసినవాడు. కానీ ఆ పని చెయ్యలేదు. ఆ పని చెయ్యాలని కోరుకోనూ లేదు. ఇక్కడే జాషువా మనస్తత్వంలో వైరుధ్యం కనిపిస్తుంది.

భారతదేశంలో దైవంగాని పదార్థంలేదు. 'సత్కులం'కాని కళ లేదు. వర్గం కన్న పిశాచం లేదు, పంచమునికన్న 'నీచపు జంతువు' లేదంటాడు జాషువా. తన కవిత్వం విని మెచ్చుకొని, కులం పేరు తెలియగానే లేచి దూరంగా వెళ్ళిపోయినప్పుడు, సన్మానం చేసి, భోజనం అందరితోబాటు గాక వరండాలో విడిగా పెట్టినప్పుడు, నిమ్నవర్ణం వాడైనా జాషువా గొప్పకవి అని తన వర్గంపై సానుభూతిని చూపిస్తున్నప్పుడు జాషువా హృదయం ఎలా గిలగిలా కొట్టుకుని విలవిల్లాడిపోయేదో ఆయన కవిత్వాన్ని చూసి అర్థం చేసుకోవచ్చు. ఈ దేశంలో "పులుముచుందురు తలమీద కులము రంగు, తొలగిపోవదు లక్ష సబ్బులకు గూడ" అన్నది వాస్తవం. తనను పంచమజాతివాడిగా గాక, జాషువాగానే గుర్తించాలని ఆయన కోరిక. సంకుచిత బంధనాలలో నలిగిపోవడం కన్నా, 'విశ్వనరుడు'గా జీవించాలని ఆయన తపన.

త్రిపురనేని రామస్వామి చౌదరి లేవనెత్తిన నాస్తికోద్యమం, హరిజనోద్యమం జాషువాను ప్రభావితం చేశాయి. అంటరానివాడని హిందువులు దూరంగా ఉంచారు హిందూపురాణాల్లోని కథల ఆధారంగా నాటకాలు, కావ్యాలు రాసినందుకు క్రైస్తవులు వెలివేశారు. జాషువా వల్ల తన ఉద్యోగం పోతుందేమోనని తండ్రికూడా భయపడి ఇంట్లోంచి వెళ్ళగొట్టినప్పుడు మసీదులో తలదాచుకొన్న సందర్భాలున్నాయి. అంటరానితనం అనేది కొట్టడానికి కూడా వీల్లేని పద్ధతిలో అడ్డు వచ్చేదంటే దాని భయంకర స్వరూపం ఊహించుకోవచ్చు. అందుకే "నరుని కష్టపెట్టి నారాయణుని గొల్చు, ధర్మశీలురున్న ధరణి మీద, కాలుమోపలేక గబ్బిల మొక్కటే, చరణయుగళి దివికి సాచి నడచు". ఈ నేపథ్యంలో 'నిర్మత, నిర్జాతి సంఘం' తన ఆదర్శంగా చెప్పుకున్నాడు జాషువా

అయితే తాననుభవించిన అవమానాలకు, కష్టనష్టాలకు జాషువా కుంగిపోలేదు. నిరాశపడలేదు 'ఈ బతుకుకన్నా చావు మేలు, వెధవ జీవితం' అని అనుకోలేదు. తనను తాను ఈసడించుకోలేదు ఇది 'నా ఖర్మ' అనుకోలేదు జీవితంపైన ఆశ ఉంది. జీవితంలో కవిగా ఉన్నత శిఖరాలందుకోవాలనే కోరిక ఉంది. "కష్టసుఖాలు రెండూ నన్ను వశపరచుకోలేదు. ఆ రెంటినీ ప్రక్కకు నెడుతూ, నా లక్ష్యం వైపు నడక సాగిస్తున్నాను" అని తనతో అన్నట్టు జాషువా కుమార్తె హేమలతగారు రాశారు. ప్రతికూల పరిస్థితులలో, నిరాశామయ వాతావరణంలో కూడా వ్యక్తిగా, కవిగా నిలదొక్కుకోవడం జాషువా ప్రత్యేకత.

జాషువా పడ్డ కష్టాలకూ, ఆయన మనస్తత్వానికీ, నిర్దేశించుకున్న కవితా లక్ష్యానికీ, రచనలకూ పొంతన చాలావరకు కుదరలేదనే విషయాన్ని చేదు నిజంగా అంగీకరించక తప్పదు. జాషువా డజను పైగా కావ్యాలు, ఏడు ఖండకావ్య సంపుటాలు, నాలుగైదు నాటకాలు, పద్యాలలోనే స్వీయ చరిత్ర రాశాడు. తొలి రోజులలో ఎక్కువగా హిందూ పురాణ కథల్ని కావ్యాలుగా, నాటకాలుగా రాశాడు దాదాపు చివరి దశలో అంటే 1963లో 'క్రీస్తుచరిత్ర' కావ్యం రాశాడు. ఈ మధ్య కాలంలో గబ్బిలం, ఫిరదౌసి, కొత్తలోకం, ముసాఫరులు, ముంటాజమహలు మొదలైన కావ్యఖండికలు రాశాడు. రెండవ ప్రపంచ యుద్ధ సమయంలో విద్యా ప్రచారానికై "గుడిమాని బడులు కట్టుదమన్నా" అన్న గేయం రాశాడట. జాషువా కావ్య ఖండికలలో బాపూజీ, నేతాజీ, జవహర్‌లాల్ నెహ్రూ, పటేల్, రాజారాంమోహనరాయ్, కందుకూరి వీరేశలింగం మొదలయిన వారందరి గురించీ ఉన్నాయి. సందర్భం ఉన్నా, లేకపోయినా గాంధీ గురించి అనేకసార్లు పద్యాలలో పేర్కొన్నాడు. అంబేద్కర్ చనిపోయినప్పుడు మాత్రం ఒక్కసారి 'శ్రద్ధాంజలి' పేరుతో నాలుగు పద్యాలు రాశాడు. 'గబ్బిలం' కావ్యంలో ఒక్కచోట "కలడంబేద్కరుడు ...." అంటూ ఒక పద్యం రాశాడు. స్వాతంత్ర్యోద్యమ నాయకుల గురించీ, క్రీస్తు గురించీ, హిందూ పురాణ కథల గురించీ ఎంతో రాసిన జాషువా, దళితుల ఉద్ధరణ కోసం ఎంతో కృషి చేసిన అంబేద్కర్ గురించి చాలా తక్కువగా రాయడం ఆశ్చర్యం. జాషువాపైన, అంబేద్కర్ ప్రభావం కన్నా గాంధీ

ప్రభావం ఎక్కువగా కనిపిస్తుంది. జాషువా చేత గొప్పగా ప్రశంసించబడ్డ రాజారాంమోహన్‌రాయ్, కందుకూరి వీరేశలింగం, గురజాడ అప్పారావు మొదలయినవాళ్ళు 'బ్రాహ్మణ' సంస్కర్తలుగా దళిత నాయకుల చేత ఈనాడు గుర్తింపబడుతున్నారు.

జాషువా కవిత్వం రాసేనాటికి తెలుగు సాహిత్యంలో పద్యమే రాజ్యమేలుతున్నా గేయాలు, పాటలు ఆ తర్వాత వచన కవితలు కూడా బాగానే వచ్చాయి. 1910లోనే గురజాడ ముత్యాలసరాలు వచ్చాయి. స్వాతంత్ర్యోద్యమ నేపథ్యంలో వచ్చిన పాటలు, గేయాలు ఉన్నాయి. భావకవులు పద్యాలతోబాటు గేయాలు కూడా రాశారు. అభ్యుదయ కవుల గేయాలు, వచన గీతాలు ఉన్నాయి. విశ్వనాథవంటివారు కూడా కిన్నెరసాని పాటలు రాశారు. జాషువా 1915 నుంచి దాదాపు యాభై ఏళ్ళపాటు సాహిత్య వ్యాసంగం చేశారు. కవితా రూపంలో వచ్చిన మార్పులకు జాషువా అతీతంగానే ఉండిపోయాడు. చివరకు స్వీయచరిత్ర కూడా 'నా కథ' పేరుతో పద్యాలలోనే మూడు భాగాలుగా వెలువరించాడు. వీటిలో రెండో భాగానికి రాసుకున్న ముందుమాటలో "పద్యంలోనే యుంటే గద్య పద్య ప్రియుల కిరువురకుపకరిస్తుందని పద్యంలోనే కథ సాగించాను" అన్నాడు. దీన్ని బట్టి జాషువా పద్యప్రియుడని తెలుస్తుంది అనేక సాంప్రదాయాలను వ్యతిరేకించిన జాషువా కవితా రూపం విషయంలో సంప్రదాయాన్నే అనుసరించాడు. నన్నయ, తిక్కన కవితా మార్గాన్ని కూడా జాషువా పెద్దగా వ్యతిరేకించలేదు. పైగా వచన కవితా ధోరణిని నిరసించాడు. 'నేటి కైత' అనే ఒక ఖండికలో -

"మొత్తము మీద నాంధ్ర కవిముఖ్యులు పెట్టిన కట్టుబాట్లలో
నుత్తమ మధ్యమాధమము లున్నవి, వానిని కొద్దిగా మరా
మత్తొనరింప మేలనెడు మాటకు నేనును సమ్మతింతు నీ
జిత్తుల తోఁక బీకుడు కవిత్వపు ఫక్కిననాదరించెదన్" అని కవిత్వంలో వస్తున్న కొత్త ధోరణి పట్ల తన తీవ్రమైన వ్యతిరేకతను వ్యక్తం చేశాడు. కవిత్వాన్ని పద్యాల్లోనే రాసిన జాషువా పద్య రచనలో ఉండే కష్టాలను కూడా ఏకరవు బెట్టడం ఆశ్చర్యకరమైన విషయం.

"తెలుగు కవిత్వమన్న నొక తెన్నున బోయెడు పద్దుగాదు, ప్రా
సలు గణముల్ యతుల్ పదము సాగగ నీయవు, కట్టుబాట్ల సం
కెలలు విదల్చి భావమతికించుట దుర్ఘట మక్కటక్కటా
వలదు విరోధికిన్ దెలుగు వాక్కవితల్ కడువేదనా నిధుల్"

ఈ పద్యం ఎప్పుడో తొలిదశలో రాసిందికూడా కాదు. అప్పటికే కొన్ని కావ్యాలు వెలువడ్డాయి. శత్రువుకు కూడా ఈ బాధలు వద్దన్నవాడు పద్యంలోనే రాయవలసిన అవసరం లేదు. అయినా రాశాడంటే పద్యంలో రాస్తే తప్ప కవిత్వానికి విలువ లేదన్న దృఢమైన విశ్వాసం జాషువాలో ఉండి ఉండాలి.

అష్టావధాన శతావధానాలు చెయ్యకపోయినా అవధాన ప్రక్రియపై ఉన్న అభిమానాన్ని వదులుకోలేక తన తమ్ముడితో కలసి నేత్రావధానాన్ని అభ్యసించాడు దీపాల పిచ్చయ్యశాస్త్రి గారితో కలిసి జంట కవిత్వం చెప్పాలనుకొని పేర్లు కుదరక మానేశాడు రాచరిక వ్యవస్థలో కవుల్లాగా సన్మానాలు పొందాడు. గజారోహణం చేశాడు. గండపెండేరాలు తొడిగించుకున్నాడు భూస్వాములకు, ధనవంతులకు, రాజకీయ నాయకులకు కావ్యాలు అంకితం ఇచ్చాడు. కృతికన్యను "పెండ్లికుమార్తెగా సంభావన చేసి పెద్దల సమక్షము నందొక దాతకిచ్చు టాంధ్రావని సాంప్రదాయము" అని సమర్థించుకున్నాడు. "శ్రీ రామిరెడ్డిగారు మత్కృతి స్వీకృతికి ప్రతిఫలంగా నాకు సముచిత భూదానము సలిపి, ఆదరించి నా కవితావేశమునకు నవనవోత్తేజమును కూర్చిరని చెప్పుకొనుటకెంతయు గర్వించుచున్నాను" అని ప్రకటించుకున్నాడు కవికోకిల, నవయుగ కవిచక్రవర్తి, కవితా విశారద, కవిదిగ్గజ, మధుర శ్రీనాథ, విశ్వకవి సామ్రాట్ మొదలైన బిరుదులు పొందాడు. కనకాభిషేకంతోపాటు వెయ్యికిపైగా సన్మానాలు జరిగాయి. శాసనమండలిలో సభ్యత్వం యిప్పించినందుకు అప్పటి ముఖ్యమంత్రి కాసు బ్రహ్మానందరెడ్డిని 'అమృతస్వాంతుడు' అని పొగిడాడు. తన కవిత్వాన్ని అచ్చువేసుకోవడానికి ఒక బ్రాహ్మణ దాత వెయ్యి రూపాయలు ఇచ్చినప్పుడు 'క్రుంగిపోవు రసభావ పరంపర" మోసులెత్తిందని సంతోషంగా చెప్పుకున్నాడు. ఇదంతా గమనిస్తే జాషువా పొందిన ఈ గౌరవం చాలామంది కవులు పొందలేదని తెలుస్తుంది హిందూ సమాజంలోని కొన్ని సంప్రదాయాలు జాషువా అవమానాలుపాలు గావడానికి కారణాలైతే, అదే సమాజంలోని భూస్వామ్య వ్యవస్థకు చెందిన మరికొన్ని సంప్రదాయాలు-బిరుదులు, సన్మానాలు వగైరా జాషువాకు ఆనందాన్ని కలిగించాయి. భూస్వామ్య వ్యవస్థలోని విలువలలో వ్యక్తిగతంగా తనకుపయోగపడేవాటిని జాషువా వ్యతిరేకించలేదు.

మనిషిగా నిలబడడానికీ, కవిగా నిలదొక్కుకోడానికీ, తల్లిదండ్రుల్నీ, భార్యాబిడ్డల్నీ పోషించుకోడానికీ - కొన్ని పాత కవితా సంప్రదాయాలతోనూ, సంఘం ఇచ్చే విలువలతోనూ, పాత ఆచారాలతోనూ జాషువా రాజీ పడవలసివచ్చిందని ఆయన కుమార్తె హేమలతగారు పేర్కొన్నారు. ఈ మాటల్లోని వాస్తవాన్ని అర్థం చేసుకోవచ్చు. ఆర్థికంగా శక్తిలేని, సాంఘికంగా గౌరవంలేని కులంలో పుట్టి, అడుగడుగునా అవమానాలు పొందిన జాషువా వ్యక్తిగా, కవిగా తన స్థానాన్ని నిలబెట్టుకోడానికి కొన్ని విషయాలలో రాజీపడడం అనివార్యమని అనుకున్నాడు. జాషువా పొందినన్ని సన్మానాలుగానీ, అవమానాలుగానీ ఎవరూ పొంది ఉండరు ఒక విధంగా అవమానాలతో మండిపడ్డ జాషువా హృదయం సన్మానాలతో చల్లబడిందేమో !

హిందూమతంలోని అసమానతల్ని బలంగా ప్రశ్నించినందువల్ల జాషువా నాస్తికుడని చాలామంది అనుకునే అవకాశం ఉంది. ఈ విషయంలో జాషువాలో కొంత వైరుధ్యం కనిపిస్తుంది. ఒక కవి భక్తి కవిత్వం రాసుకొచ్చి ముందుమాటలు రాయమని జాషువాను కోరితే, కేవలం భక్తినే గాక మానవతనుకూడా కవి బోధించాలనీ,

కులమతాల అడ్డుగోడల్ని తొలగించడానికి కవి తన కవిత్వం ద్వారా ప్రయత్నించాలనీ చెప్పి ముందుమాటలు రాయడానికి నిరాకరించాడు అదే జాషువా మహత్యాలతో కూడిన క్రీస్తుచరిత్రను కావ్యంగా రాశాడు. మహత్యాలు లేకుండా వాస్తవికంగా క్రీస్తు గొప్పదనాన్ని వివరిస్తూ రాయవచ్చుగదా అని ఆయన కుమార్తె హేమలత ప్రశ్నిస్తే, నిజమే అని అంగీకరించి, కవిగా తాను కొన్నిటికి రాజీ పడవలసి వస్తోందని అన్నాడట. రుక్మిణీ కళ్యాణం, క్రీస్తు చరిత్ర మొదలైనవి రాసినందువల్ల కొందరు జాషువాను ఆస్తికుడిగా భావిస్తారు. హిందూ, క్రైస్తవ మతాలలోని మూఢవిశ్వాసాల్ని వ్యతిరేకించడం వల్లా, ప్రముఖ నాస్తికుడు గోరా కొడుక్కి తన కూతురునిచ్చి పెళ్ళి చేసినందువల్లా మరికొందరు ఆయన్ను నాస్తికుడిగా చూస్తారు. జాషువాను ఇలా ఏదో ఒకవైపు నిలబెట్టడం సరైంది కాదు. మూఢ విశ్వాసాలు, దారుణమైన ఆచారాలు, అసమానతలు లేని దేవుడితో, మతంతో ఆయనకు పేచీ లేదు. అయితే అవిలేని దేవుడూ, మతం ఆయన అనుభవంలో ఆయనకు కనబడనూలేదు. మొత్తంమీద విజ్ఞాన శాస్త్రం వల్ల వచ్చిన భౌతిక దృక్పథం ఆయనకు లేదని చెప్పవచ్చు. దేవుడున్నాడో లేడో అని రాద్ధాంతాలు చేసుకునేకంటే, ఎక్కడో ఒకచోట ఉన్నాడనే అనుకోవడం మంచిదని ఒక సందర్భంలో జాషువా భావిస్తాడు. ఈ సెంటర్ పాయింట్ లోనూ సరిగ్గా నిలబడలేక ఒకసారి అటూ ఒకసారి ఇటూ మొగ్గుతుంటాడు.

జాషువాకు ఏ రాజకీయ సిద్ధాంతాలతో, సంస్థలతో ప్రత్యక్ష సంబంధం లేదు. కాని కొంతవరకు వాటి ప్రభావం ఉంది. సమాజం పట్ల అవగాహన విషయంలో మితవాదిగా కనిపిస్తాడు. కవిగా వీరావేశం ఉంది. అందుకే గాంధీ అహింస గురించీ రాస్తాడు, నేతాజీ గురించీ రాస్తాడు. వివేకానందుడు, అరవిందుడు, రమణమహర్షి, రవీంద్రనాధ్‌ఠాగూర్ మొదలయిన వాళ్ళను ప్రశంసిస్తూ రాస్తాడు. 1930ల నాటి ప్రపంచ వ్యాప్త ఆర్థిక సంక్షోభ ప్రభావాన్ని గురించీ రాస్తాడు. కులవ్యవస్థ నిర్మూలన ఆయన లక్ష్యం. అయితే ఈ లక్ష్యసాధనలో ఒక్క రక్తబిందువు కూడా రాలడం ఆయన సహించడు. ఈ విధంగా పరస్పర విరుద్ధ భావాలు జాషువాలో అడుగడుగునా కనిపిస్తుంటాయి

"నాల్గు ఖండములకు నవనవో జ్వలము లొ
ధర్మ మార్గములకు దారి సూపి
ఘనతనాచికొన్న ఖండంబు మనదన్న
పౌరుషంబు మనది ప్రజ్ఞమనది"

అన్న పద్యంలో ఇతర ఖండాలకు కూడా ధర్మమార్గం చూపిన మనదేశ ధర్మం ఏది ? వైదిక ధర్మమా ? మరి అక్కడ ప్రారంభమైన వర్ణవ్యవస్థే గదా కాలక్రమంలో శాఖోపశాఖలై భయంకరమైన కులవ్యవస్థగా విస్తరించి కొందరిని అంటరానివాళ్ళుగా చేసి దూరంగా నిలబెట్టింది ? దుఃఖంలేని చోటు, జ్ఞానం పెంచేచోటు, కళలు పెంపొందే చోటు, స్వేచ్ఛాలక్ష్మి తిరిగే చోటు కావాలంటాడు జాషువా. అయితే అది ఎలా వస్తుందో ఆయన చెప్పడు. ప్రగతిపై కోరిక ఉంది. అది ఆచరణలో ఎలా సాధ్యమవుతుందో

వివరించడు. కవిగా ఆయన ఏడుస్తాడు మనల్ని ఏడ్పిస్తాడు కవీ, పాఠకుడూ ఇద్దరూ ఏడుస్తూ కూర్చుంటే సమస్యలు తీరవు సమస్యలను పరిష్కరించే కార్యక్రమంలో పాల్గొన్నవారికి కవిత్వం ఉత్సాహాన్నివ్వాలి. కవిత్వం జోలపాడి నిద్రబుచ్చగూడదు నిద్రబోయిన వారిని సైతం తట్టి మేల్కొలిపి కార్యోన్ముఖుల్ని చెయ్యాలి

జాషువాకు అహింస కవచమట ! సహనం ఆయుధమట ! సత్యం నియమమట ! అప్పుడు ప్రపంచం ఏకమై వచ్చినా గెలవగలడట ! దీనిక్కారణం 'లోకమోహన సబర్మతి సన్మునికి' తాను కుమారుడు కావడమేనట !

"గుజ్జాలకు తెక్కలు గల
వెజ్జియుగాల్ దాటిపోయె, విజ్ఞానంబుల్
బుజ్జిగల గాంధి యుగమిది
కజ్జిలు ఖడ్గంబు లేలగా లేవు ప్రజల్"

అంటాడు. "అహింస ఒక ఆశయమేగాని, ఆయుధం ఎప్పుడూ కాదు" అన్న శ్రీశ్రీ మాటలు గుర్తుకొస్తాయిక్కడ. అహింసను సాధించడానికి అవసరం అయితే హింసా ప్రయోగం తప్పదు. ఈ వాస్తవాన్ని మన భారత రామాయణాలు కూడా చెప్పాయి. రాముడూ, కృష్ణుడూ ఇద్దరూ అహింసను నేర్పలేదు, ఆచరించనూ లేదు.

"సిరి నిజమ్ముగ వట్టి టక్కరిది సుమ్ము" అని అంటాడే గాని, ఇది వర్గవ్యవస్థ అనీ, ఈ వ్యవస్థలో దోపిడీ సహజమనీ, ఈ దోపిడిని నిర్మూలించగలిగింది శ్రామిక వర్గమనీ మొదలైన విషయాల జోలికిపోడు.

"ఇంటనున్న ద్రవ్య మెరుపు గుట్టను బోలు
వ్యాప్తి చెందెనేని ఫలమునిచ్చు
పారుచున్న నీరు పంటలు పండించు
పారకున్న నీరు ప్రాచిబట్టు"

అని సంపద ఒక చోట పోగుపడడం కన్నా, అది ప్రజల మధ్య పంపకం అయితే మంచిదన్న ఆలోచన కనిపిస్తుంది గానీ, ఆ విషయాన్ని చెప్పిన మార్క్సిజం గురించి ఆలోచించలేదు

జాషువాలో గొప్ప నిరసన ఉంది దానికి తగిన సైద్ధాంతిక దృష్టిలేదు. ప్రతి ఘటన ఆయన కవిత్వానికి పదును బెట్టింది, దానికి తగిన లక్ష్యం లేదు.

*(అరుణతార : సెప్టెంబర్ 1995)*

# స్వేచ్ఛ అంటే పురోగమనమే!

'ఆంధ్రజ్యోతి' దినపత్రిక ఆదివారం (28.5 95) అనుబంధంలో "స్వేచ్ఛ అంటే ఏమిటి ?" అనే పేరుతో ఓల్గా వ్యాసం అచ్చయింది. ఇది చలం శతజయంతి సంవత్సరం ముగింపు సందర్భంగా ప్రచురింపబడ్డ వ్యాసం. చలం చెప్పిన స్వేచ్ఛ ఎవరికీ అర్థం కాలేదనీ, ఈ విషయంలో ఆయన్ని అందరూ తప్పుగా అర్థం చేసుకున్నారనీ ఓల్గా నిర్ధారణ చేశారు. చలాన్ని అర్థం చేసుకోలేకపోవడం వల్లనే ఆయనలో వైరుధ్యాలున్నాయని విమర్శకులు భ్రమపడ్డారనీ తేల్చేశారు.

ఓల్గా వ్యాసానికి రెండు లక్ష్యాలున్నాయి. ఒకటి, స్త్రీవాదిగా ఓల్గా చలం స్వేచ్ఛను వివరించడం. రెండు, మార్క్సిజంపైన దాడిచెయ్యడం లేదా దాన్ని వక్రీకరించడం. మొదటి లక్ష్యం పైకి స్పష్టంగా కనిపిస్తుంది. రెండోది చాప కింది నీరులా వ్యాసం అంతా వ్యాపించి ఉన్నా అంత స్పష్టంగా పైకి కనిపించనిది.

"స్వేచ్ఛ ఎంత బయటిదో, అంతకన్నా ఎక్కువగా మన లోపలిది" అని ఓల్గా అభిప్రాయపడ్డారు. అంతేగాదు, చలం చెప్పిన స్వేచ్ఛ కూడా ఇదేనన్నారు. స్వేచ్ఛ బయటికి, లోపలిది అని రెండు రకాలుగా కనిపించడం వాస్తవమే. అయితే ఇలా రెండు రకాలుగా ఎందుకు కనిపిస్తుంది ? ఓల్గా ఈ ప్రశ్న వేసుకోలేదు. బయటి స్వేచ్ఛ ముఖ్యమే అయినా, అంతటితో ఆగకుండా అంతకంటే ముఖ్యమైన లోపలి స్వేచ్ఛను చూడాలనీ, దాన్నెవరూ పట్టించుకోరనీ, దాన్ని పట్టించుకోడానికి భయపడతారనీ, చలం నిర్భయంగా ఈ లోపలి స్వేచ్ఛ గురించి తపన పడ్డాడనీ, ఇది గొప్ప సాహసమనీ ఓల్గా అభిప్రాయం.

పాలకులు తమ సౌఖ్యం కోసం ప్రజలపైన విధించే నిర్బంధాన్ని అధిగమించే ప్రయత్నాన్ని స్వేచ్ఛకోసం కోరికగా భావిస్తాం. దీన్నే ఓల్గా బయటి స్వేచ్ఛ అన్నారు. 'అనివార్యంగా' మన లోపల పుట్టుకొచ్చే ఒక కాంక్షా లాలసత్వాన్ని లోపలి స్వేచ్ఛగా వివరించారు. అనివార్యంగా ఎందుకు పుట్టుకొస్తుందో వివరించలేదు. ఈ అనివార్యతను నిర్ణయించే పరిస్థితుల్ని ఓల్గా పట్టించుకోలేదు. పాలకవర్గంగానీ, ఇతర ప్రజానీకంగానీ, ప్రకృతిశక్తులుగానీ మనం కావాలనుకునే స్వేచ్ఛకు అడుగడుగునా అడ్డుపడుతూనే ఉంటాయి. అందువల్ల అనివార్యంగా మనం స్వేచ్ఛ కోసం తపిస్తాం. ఈ అనివార్యతను నిర్ణయిస్తున్నది బయటి పరిస్థితులే అనే విషయాన్ని మర్చిపోతే స్వేచ్ఛ బయటిది, లోపలిది అని రెండు రకాలుగా కనిపిస్తుంది. ఒక్కోసారి బయటి పరిస్థితులు అనుకూలంగా ఉన్నా మనపై మనమే కొంత నిర్బంధాన్ని విధించుకుని స్వేచ్ఛను కోల్పోతాం. మనపై మనమే నిర్బంధాన్ని విధించుకోడానికి కూడా బయటి పరిస్థితులే అంతిమంగా కారణమవుతాయి. చిరకాలంగా ఉన్న ఈ బయటి పరిస్థితుల ప్రభావం మనలో జీర్ణించుకుపోయి మనపై మనమే నిర్బంధాన్ని విధించుకునే స్వభావాన్ని కలిగిస్తుంది.

ప్రభుత్వానికి వ్యతిరేకంగా రాస్తే ఇబ్బందుల పాలవుతామని ఒక రచయిత తనంతట తాను అనుకుని 'జాగ్రత్త' పడడానికి కారణం ఇదే తాను రాస్తున్న సమయంలో ఆ ప్రభుత్వం ఆ రచయిత పైన ఏ నిబంధనలూ పెట్టకపోవచ్చు. కానీ గతంలోనూ, వర్తమానంలోనూ, ప్రభుత్వ విధానాన్ని వ్యతిరేకించిన రచయితలపై ప్రభుత్వం అమలుపర్చిన నిర్బంధం గురించి ఆ రచయితకు ఎంతో కొంత తెలుసు. అందుచేతనే తనకు తాను నిర్బంధాన్ని విధించుకొని ప్రభుత్వ విధానాల జోలికి పోకుండా లేదా ప్రభుత్వ విధానాల్ని సమర్థిస్తూ రచనలో తనకు స్వేచ్ఛ ఉందనుకుంటాడు. కొందరి విషయంలో ఇది తెలిసీ, మరికొందరి విషయంలో ఇది తెలియకా జరుగుతుంది తెలిసీ ఈ పని చేసేవాడు అవకాశవాది, తెలియక ఈ పని చేసేవాడు అజ్ఞాని. ఇదే గతితార్కిక పరిశీలనా విధానం

దౌర్జన్యంగా ప్రత్యేక ప్రయోజనాల్ని పొందుతున్న పాలకవర్గం, తమపై తిరగబడకుండా ఉండడం కోసం ప్రజల్ని ఎప్పుడూ భ్రమల్లో పెడుతూనే ఉంటుంది సమస్యల్ని సులభంగా అర్థం చేసుకోడానికి వీల్లేకుండా క్లిష్ట వాతావరణాన్ని సృష్టించే ప్రయత్నం చేస్తుంది. తరతరాలుగా సాగిన ఈ ప్రయత్నమే స్వేచ్ఛ లోపలిది, బయటిది అని రెండు రకాలుగా భ్రమింపచెయ్యడం. సాధారణంగా ఈ లోపలి స్వేచ్ఛ గురించి ఆధ్యాత్మికవాదులు చెప్తుంటారని ఓల్గా కూడా గుర్తించారు తనను గురించి తాను తెలుసుకోవాలి. మనిషి అంతర్ముఖుడు కావాలి. ఇలాంటి మాటల ద్వారా అధ్మాత్మికవాదులు ఈ లోపలి స్వేచ్ఛను గురించి ప్రస్తావిస్తారు ఆధ్యాత్మికవాదం కూడా వాస్తవాన్ని మరుగుపర్చి, భ్రమల్లో ఉంచేదేగదా! పరిస్థితులు మారి, బయటి స్వేచ్ఛ, లోపలి స్వేచ్ఛ అనే తేడా పోయి, ఆ రెండూ ఒకటయినప్పుడు నిజమైన స్వేచ్ఛను అనుభవించగలం. అప్పుడు స్వేచ్ఛ ఒక్కటే. అంటే అంతవరకు లోపలిది, బయటిది అని రెండు రకాలుగా కనిపిస్తున్న ద్వంద్వ స్థితి పోయిందన్న మాట. వర్గ వ్యవస్థ ఉన్నంతవరకూ ఇది సాధ్యం కాదు. వర్గాలు నశించిపోయిన వ్యవస్థలోనే ఇది సాధ్యం అవుతుంది. కాబట్టి స్వేచ్ఛను రెండు రకాలుగా చెప్పడం వర్గ వ్యవస్థ మనకు కలిగించిన భ్రమ. ఇది అమార్క్స్రీయం ఎందుకంటే అవాస్తవం కాబట్టి.

ఇంతకూ ఈ స్వేచ్ఛ గురించి చలం దృక్పథం ఏమిటి ? "లోపల స్వేచ్ఛ ఉన్నవాడికి బైట స్వేచ్ఛతో పనిలేదు. అతనికి అంతా స్వేచ్ఛే బైట స్వేచ్ఛ కావాలంటే ముఖ్యమైన అవసరం డబ్బు." "అందరం సమానం కావాలంటే బయట ఉన్న వ్యత్యాసాలతో కాదు మీరు పోట్లాడవలసింది, మీలో ఉన్న వ్యత్యాసం - ధనవంతుడికీ, బీదవాడికీ ఉన్న, మీ మనస్సులో ఉన్న వ్యత్యాసంతో మీరు పోట్లాడాలి" - ఇదీ చలం అభిప్రాయం. ఇందులో మన దృష్టిని ఆకర్షించేవి మూడు అంశాలున్నాయి. మొదటిది లోపలి స్వేచ్ఛ ఉన్నవాడికి బైట స్వేచ్ఛతో పని లేదనేది. రెండోది బైట స్వచ్ఛను డబ్బుతో సంపాదించుకోవచ్చుననేది. మూడోది ధనవంతుడికీ, బీదవాడికీ ఉన్న వ్యత్యాసాన్ని పోగొట్టాలంటే బయట ఉన్న వ్యత్యాసాలతో కాదు పోట్లాడవలసింది, మనస్సులో ఉన్న వ్యత్యాసాలతోననేది ఓల్గా వ్యాసాన్ని బట్టి చలం చెప్పిన ఈ

మూడంశాలతోనూ ఓల్గా ఏకీభవించడం లేదు అదే సమయంలో స్వేచ్ఛ విషయంలో చలం అభిప్రాయాలూ, తన అభిప్రాయాలూ ఒకటే అని కూడా భ్రమింపజేస్తున్నారు. చలం బైట స్వేచ్ఛను పూర్తిగా కొట్టేస్తున్నాడు ఓల్గా బయట స్వేచ్ఛను అంగీకరిస్తూనే, లోపల స్వేచ్ఛను కావాలంటున్నారు బైట స్వేచ్ఛను డబ్బుతో సంపాదించుకోవచ్చని చలం అంటున్నాడు. బైట స్వేచ్ఛను పోరాడి సాధించుకోవాలని ఓల్గా అంటున్నారు. బయటి వ్యత్యాసాలతో కంటే మనసులో ఉన్న వ్యత్యాసాలతో పోట్లాడాలని చలం. వ్యత్యాసాల విషయం ప్రస్తావన సూటిగా రాకపోయినా, రెండు రకాల వ్యత్యాసాలతో పోట్లాడాలనే అభిప్రాయాన్ని కలిగించారు ఓల్గా. కాబట్టి చలం స్వేచ్ఛ వేరు, ఓల్గా స్వేచ్ఛ వేరు అనిపిస్తుంది. మరికాస్త లోతుగా ఆలోచిస్తే ఇది కూడా నిజం కాదని అర్థమవుతుంది వాస్తవానికి చలం అభిప్రాయాలే ఓల్గా అభిప్రాయాలు. బైట స్వేచ్ఛను పూర్తిగా కాదనగల 'సాహసం' చలానికుంది. ఆ 'సాహసం' ఓల్గాకు లేదు అందుకే ఈ డొంక తిరుగుడు.

దేవుడు, బ్రహ్మ సమాజం, నిరీశ్వరవాదం, నాస్తికత్వం, జాతీయోద్యమం, కమ్యూనిజం - చలం వీటన్నిటినీ పరీక్షించి వదిలేశాడనీ, ఏ ఒక్క ఆధారమూ లేకుండా స్వతంత్రంగా ఆలోచించాడనీ, దానికి చాలా సాహసం కావాలనీ ఓల్గా అంటున్నారు. చలంపై ఆధారాలన్నిటినీ వదిలేశాడన్నది నిజం. అందుకే చలంలో గందరగోళం ఏర్పడింది. అందుకే అంత సులభంగా చలం అర్థంగాడు. ఓల్గా కూడా ఈ విషయాన్ని గుర్తించారు. అయితే అలా ఉండడం సరైందని ఓల్గా నమ్ముతున్నారు. ఇక్కడ చలంతోనూ, ఓల్గాతోనూ పూర్తిగా విభేదించాల్సి వస్తుంది. ఏ ఆధారమూ లేకుండా ఆలోచించడమంటే ఏ దృక్పథమూ లేకుండా ఆలోచించడమనే. ఏ దృక్పథమూ లేకుండా ఆలోచించడం అరాచకవాదానికి దారితీస్తుంది. నిత్య జీవితంలో మనం చేసే చిన్న చిన్న పనులకే ఒక లక్ష్యం, పద్ధతి ఉంటాయి. ఇక సామాజిక, తాత్విక విషయాలను గూర్చి ఆలోచించేటప్పుడు దృక్పథం లేకండా ఎలా ఉంటుంది ? ఇక్కడ మరో విషయం స్పష్టం చెయ్యాలి. ఏదో ఒక దృక్పథంతో ప్రపంచాన్ని పరిశీలించమని నేననడం లేదు. ఆ దృక్పథం గతితార్కిక దృక్పథం అయి ఉండాలి. ఈ గతితార్కికం అనేది మార్క్స్ సొంతంగా కనిపెట్టింది కాదు. ప్రకృతిలో ఉన్న వాస్తవం. తన నాటికున్న విజ్ఞానశాస్త్ర ఫలితాలనాధారంగా, ఫ్రాన్స్‌లో జరిగిన వర్గపోరాటాలు భూమికగా, జర్మన్ తత్వశాస్త్రానికి గుణాత్మకమైన మార్పుగా అదివరకే లోపభూయిష్టంగా ఉన్న గతితర్కాన్ని సమాజానికి సరిగ్గా అన్వయింపజేసిన గొప్ప తాత్వికుడు మార్క్స్. ఇప్పటికి మార్క్సిజం పుట్టి ఒకటిన్నర శతాబ్దాలే అయినా ప్రపంచ వ్యాప్తంగా విశేషంగా ప్రభావాన్ని కలిగించింది. ప్రపంచాన్ని ఎలా అర్థం చేసుకోవాలో నేర్పింది. ఎలాంటి చిక్కుముడినైనా విప్పగలిగే నైపుణ్యాన్ని మానవజాతికి అందించింది. పీడిత వర్గమైన శ్రామిక వర్గం చేతిలో బలమైన ఆయుధమయింది తన విముక్తినేగాక అన్ని వర్గాల ప్రజల విముక్తినీ సాధించగలిగిన శక్తి శ్రామిక వర్గానికుందని నేర్పింది. అందువల్ల అనేక దృక్పథాలలో గతితార్కిక దృక్పథం ఒకటి కాదు. అన్ని దృక్పథాలలోని మంచి చెడ్డల్నీ, పరిస్థితుల్నీ, ఉద్దేశాల్నీ

విశ్లేషించి వివరించగలిగింది గతితార్కిక దృక్పథం మానవజాతి చరిత్రలో ఇదొక్కటే శాస్త్రీయ దృక్పథంగా తన స్థానాన్ని నిలబెట్టుకుంది. కాబట్టి ప్రపంచాన్ని పరిశీలించడానికి ఈ ఆధారం తప్పనిసరి. ఇలా ఆధారం ఉండాలని చెప్పడం వల్ల విప్లవాన్ని మతంతో సమానంగా పోలుస్తున్నారు ఓల్గా. మతాన్ని నమ్మేవాళ్ళు ఎంత గుడ్డిగా ఉంటారో, విప్లవాన్ని చేసేవాళ్ళూ అంత గుడ్డిగా ఉంటారని ఓల్గా అభిప్రాయం. మతానికున్న ఆధారాన్నీ, విప్లవానికున్న ఆధారాన్నీ ఒకటిగా భావించడం ఓల్గా అవగాహనలోని పెద్ద లోపం. చలంలోనూ, స్త్రీవాదుల్లోనూ ఈ సిద్ధాంత వ్యతిరేకత సామాన్య అవలక్షణం.

కమ్యూనిజం భౌతిక బాధల్ని పోగొడుతుందని చలం అంగీకరిస్తాడు. అయితే దానికంటే ఇతరమైన విలువల్ని గుర్తించదంటాడు. ఆ ఇతరమైన విలువలలో వ్యక్తి స్వాతంత్ర్యం ఒకటి ఈ వ్యక్తి స్వాతంత్ర్యానికీ, భౌతిక బాధలకీ సంబంధమే లేదనుకోవడం అశాస్త్రీయం. తన భావాలనీ, శరీరాన్నీ పాలక వర్గానికి తాకట్టు పెట్టినవాడికి వ్యక్తి స్వాతంత్ర్యం ఉన్నట్టే అనిపిస్తుంది. తనంతట తాను తాకట్టు పెట్టవలసిన దుస్థితిలో ఉండడం స్వాతంత్ర్యం లేకపోవడం అనే విషయం కాస్త ఆలోచిస్తే తెలియంది కాదు. తిండికీ, ఓటుకీ, మాటకీ కాదు స్వాతంత్ర్యం కావలసింది, వాటికి మించిన స్వాతంత్ర్యం కావాలంటాడు చలం. అదెలాంటిదో కూడా వివరిస్తాడు. 'నా తోవన నేనుంటే, నా జోలికి ఎవరూ రాని, దేనికీ బలవంతం లేని స్వతంత్రం కావాలి.' ఈ వర్గ వ్యవస్థలో ఇది సాధ్యమవుతుందా ? పోనీ దీన్ని ఎలా సాధించుకోవాలో చెప్పాడా చలం ? అసంతృప్తికీ, అశాంతికీ ఉన్న భౌతిక కారణాలను తెలుసుకోలేనప్పుడు మనిషి ఖచ్చితంగా అంతర్ముఖుడవుతాడు. ఆ స్థితిలో ఉన్న మనుషులకు ఏ 'ఆధారమూ' లేకుండా చలం చెప్పిన విషయాలు బాగా నచ్చుతాయి. ఆ మనుషుల్లో ఉన్న అసంతృప్తికీ, అశాంతికీ ఇవి పరిష్కారాన్ని చూపలేవు. చలం నిజంగానే ఆ అసంతృప్తికీ, అశాంతికీ గురయ్యాడు. కానీ ఓల్గా అలా గురయ్యిందని చెప్పలేం. ఒక అసంతృప్తితో, అశాంతితో, భావావేశంతో కొట్టుకుపోయి చలం మార్క్సిజాన్ని వ్యతిరేకిస్తే, తెలిసీ, సాలోచనగా ఓల్గా మార్క్సిజాన్ని వ్యతిరేకిస్తున్నారు. మార్క్సిజాన్ని వ్యతిరేకించే హక్కు ఆమెకుండవచ్చు కానీ ఏ ఆధారమూ లేకుండా ప్రపంచాన్ని పరిశీలించిన చలాన్ని ఆధారంగా చేసుకుని వ్యతిరేకించాల్సిన అవసరం లేదు

స్వేచ్ఛతో దగ్గరి సంబంధం ఉన్న మరో భావం ఆనందమనీ, ఈ ఆనందాన్ని పొందటమంటే నేరం చేసినట్టుగా భావిస్తారనీ, మన శరీరాలతో, మనసులతో ఎంతో ఆనందాన్ని పొందవచ్చుననీ, ఈ ఆనందం గూర్చి తెలియజెప్పిన మొదటి తెలుగు రచయిత చలం అనీ ఓల్గా అన్నారు. చలం ఈ విషయాన్ని చెప్పారనడంలో సందేహం లేదు. ఏ లక్షణం చలం బలంగా ఓల్గా చెప్తున్నారో నిజానికి ఆ లక్షణమే చలం బలహీనత. మన మనసులతో మనం ఎంత ఆనందాన్ని పొందినా అది ఇతరుల ఆనందానికి భంగం కాదు కానీ మన శరీరాలతో పొందే ఆనందం ఈ వర్గ వ్యవస్థలో ఖచ్చితంగా ఏదో మేరకు ఇతరుల ఆనందానికి భంగకరం అయి తీరుతుంది. తనకిష్టమైన వాటిని అనుభవించాలనే కోరిక చాలామందికి ఉండొచ్చు కానీ అందరి కోరికలూ

తీరవు. ఆ తీర్చుకునే క్రమంలో మనుషుల మధ్య ఘర్షణ ప్రారంభమవుతుంది ఈ ఘర్షణలో అమాయకులూ, బలహీనులూ నష్టపోతారు. మన చట్టాలు కూడా ఎక్కువ సందర్భాల్లో బలవంతులకే ఉపయోగపడతాయి భౌతిక సుఖాలతో సంబంధం లేని మానసిక సుఖాలు ఊహలకు సంబంధించినవే అయి ఉండాలి. ఆ ఊహల వల్ల పొందే ఆనందం భ్రమాజనితమైందైనా కావాలి లేదా ఒకనాటి భౌతిక సుఖాలను స్మరించుకోవడం వల్ల కలిగేదైనా కావాలి. తన మనసులో కలిగిన కోరికను ధర్మాధర్మ, న్యాయాన్యాయ విచక్షణ లేకుండా తీర్చుకోవడాన్నే రసికత అని రాయలనాటి రసికతను వివరిస్తూ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారు చెప్పిందానికీ, చలం, ఓల్గాలు చెప్తున్నదానికీ తేడా కనిపించడం లేదు. ఇందులోని సామంజస్యాన్ని ఓల్గా ఇంకా వివరించవలసే ఉంది. ఎవరికీ కష్టం కలగకుండా చెయ్యగలిగిన పని ఒక్కటుందా ఈ లోకంలో ? అని చలమే మరో సందర్భంలో అంటాడు. దీన్ని ఓల్గా ఒప్పుకుంటారా ? సమాజం, వ్యవస్థ, ఉత్పత్తి విధానం, మానవ సంబంధాలు, పరిసరాలు, ప్రకృతి పరిణామాలు, పరస్పర విరుద్ధమైన మానవ స్వభావాలూ, కోరికలూ - వీటన్నిటిని దృష్టిలో పెట్టుకోకుండా అసలు ఆనందమనే దాన్ని ఎలా నిర్వచిస్తాం ? ఏ కండిషనూ లేని ఆనందం ఎక్కడయినా ఉంటుందా ? ఉండదనేది వాస్తవం. ఈ వాస్తవాన్నే మార్క్సిజం చెబుతుంది.

"ఇది నాకు బాగుంది ఆనందాన్నిస్తుంది. ఈ పని చేయాలనే ఆపుకోలేని కాంక్ష పుట్టుకొస్తోంది." అని చెప్పడానికి భయపడనవసరం లేదని చెబుతూ, అది మన ఆనందం కోసం గాక బాధ్యత పేరుతో, త్యాగం పేరుతో చెయ్యడానికి అలవాటు పడి ఆ పనిలోని ఆనందాన్ని చంపేసుకుంటున్నామని అంటారు ఓల్గా. ఇక్కడ చాలా తెలివిగా విషయాన్ని తిరగేసి చూపించారు. పాలకవర్గం హింస చేస్తుంటే దాన్ని ఆపడానికి విప్లవకారులు ప్రతిహింస చేస్తారని సాధారణంగా చెప్పే విషయాన్ని 'పీపుల్స్ ఎన్‌కౌంటర్ ' సినిమాలో రామోజీరావు విప్లవకారులు చేసే హింసను ఆపడానికి పాలకవర్గం ప్రతిహింస చేస్తుందని తిరగేసి చెప్పినట్టుగా ఇక్కడ ఓల్గా చెబుతున్నారు. బాధ్యత, త్యాగాలతో సంబంధం లేకుండా మన ఆనందం లక్ష్యంగా చేసే పనివల్ల స్వేచ్ఛకూ, బాధ్యతకూ, ఆనందానికీ, త్యాగానికీ ఉన్న సంబంధం వ్యక్తం అవుతుందంటారు ఓల్గా. దీన్ని ఇలా కాదు చెప్పవలసింది. బాధ్యతతో, త్యాగంతో చేసే పని విధానంలో నిజమయిన ఆనందం, నిజమైన స్వేచ్ఛా ఉంటాయని చెప్పాలి మార్క్సిజం ఇలా చెబుతుంది. మార్క్సిజం ఇలా చెప్పడం వల్ల అది నిజమయిన ఆనందాన్నీ, స్వేచ్ఛనీ గుర్తించడం లేదని చెప్పడం సరికాదు. నిజమయిన ఆనందం, స్వేచ్ఛ కోసమే మార్క్సిజం అలా చెబుతుందని గ్రహించాలి త్యాగం పేరుతో ఒక పనిని చెయ్యడాన్ని ఓల్గా చిన్న చూపు చూస్తున్నా, చలం అలా చూడ్డంలేదు. కమ్యూనిస్టులు చెప్పే 'గుడ్డి చిలుక పలుకులు' ఏవగింపుగా భావించే చలం కూడా వాళ్ళ త్యాగాన్ని చూసినపుడు వాళ్ళ పాదాల ముందు తన శిరసు వొంగుతుందంటాడు. కమ్యూనిస్టుల్లోని ఇతర అన్ని విషయాలనూ తిరస్కరించినా, కనీసం వాళ్ళ త్యాగానికి విలువిస్తున్నాడు చలం. ఓల్గా ఆ త్యాగానికి కూడా విలువివ్వడం లేదు.

"నా కిప్పుడిది మంచిదనిపిస్తుంది" అని చలం చాలాసార్లు అనేక విషయాల గురించి అంటే అది మనకు వైరుధ్యంలా కనిపించినా, నిజమైన జ్ఞాన సాధనలో బలం అక్కడి నుంచే వస్తుందని ఓల్గా అంటారు అంతేగాదు జ్ఞానాన్ని పోషించేదీ, పెంచేదీ ఈ స్వేచ్ఛా ప్రియత్వమే నంటాడు కూడా అంటే ఎప్పటికేది మంచిదనిపిస్తే, అది చెయ్యడమే స్వేచ్ఛా ప్రియత్వమని ఓల్గా అభిప్రాయం. ఎప్పటికేది మంచిదనిపించడానికి ప్రాతిపదిక ఏమిటో చెప్పడం లేదు ఊరికే రోజు రోజుకూ అభిప్రాయాలు మారవు గదా ? అలా మారడానికి కొన్ని భౌతిక పరిస్థితులుండాలి. భౌతిక పరిస్థితుల్లో ఏ మార్పూ లేకుండా కేవలం మన మనస్సులోనే మార్పు రావడం పాక్షికమే. మన మనసులో వచ్చే మార్పులకు బయటి పరిస్థితుల ప్రమేయం లేకుండా ఎలా ఉంటుంది ? సమాజానికి దూరంగా ఎక్కడో లేము గదా మనం ? సమాజంలో భాగంగా ఉన్న మనలో వచ్చే మార్పులకు తప్పనిసరిగా సమాజంలోని అనేక అంశాలు ఆ యా సందర్భాలలో ప్రేరణలవుతాయి మరొక విషయం ఏమిటంటే జ్ఞానానికి మూలం ఆచరణ. యుగయుగాలుగా మానవుడి ఆచరణ కారణంగానే అతని జ్ఞానం పెరుగుతూ వచ్చింది. ఆచరణ, జ్ఞానం అనేవి పరస్పర ప్రభావితాలు జ్ఞానం గూర్చి మాట్లాడేటప్పుడు ఓల్గా ఆచరణ గురించి చెప్పకుండా, కేవలం 'మనసుకు మంచిదనిపించటం' అనే అంశాన్నే గుర్తిస్తున్నారు.

ఒక్కమాటలో చెప్పాలంటే చలం వ్యక్తిగత స్వేచ్ఛావాది సిద్ధాంతాలు, సంస్థలు, పార్టీలు అన్నీ సంకెళ్ళులాగా కనిపిస్తాయి చలానికి ఈ 'సంకెళ్ళ'ను ఎప్పటికప్పుడు ఛేదించుకుంటూ పోవడమే అతని కార్యక్రమం. తన జీవితంలోనూ, సాహిత్యంలోనూ ఈ పనే చేశాడు చలం. కట్టుబాట్లూ, నియమ నిబంధనలూ లేని సమాజాన్నీ, లేదా ఒక సంస్థనీ, సిద్ధాంతాన్నీ ప్రస్తుతం మనం ఊహించలేం. అర్థరహితమైన, దారుణమైన నియమ నిబంధనల్ని మార్చుకోడానికి ప్రయత్నం చెయ్యాలి గానీ, ప్రస్తుత సమాజంలో అసలు ఏ నియమాలూ అక్కర్లేదని అనడం, ఎవరి చిత్తానికి తోచిన విధంగా వారు ప్రవర్తించడం అరాచకానికిగాక మరి దేనికి దారితీస్తుంది ? సంపూర్ణ ఆదర్శ మానవుడు తయారయిన్నాడు బహుశా చలం చెప్పిన స్వేచ్ఛ సాధ్యమవుతుందేమో ? దాన్ని సాధించడానికయినా సిద్ధాంతాలూ, సంస్థలూ, నియమాలూ అవసరమే గదా !

చలం దృష్టిలో ఏకత్వం, సమానత్వం అనేవి సృష్టి సూత్రానికే విరుద్ధం. మరి అనేకత్వంతో, అసమానత్వంతో శాశ్వతంగా ఉండడమే సృష్టి సూత్రమా ? సృష్టి సూత్రం అన్న చలం మాటను ఇవాళ మనం ప్రకృతి సూత్రం అనడం సమంజసం. నిజానికి పురోగమనం వైపు ప్రయాణించడమే ప్రకృతి సూత్రంగా మనం సులభంగా గ్రహించడానికి ప్రకృతే మనకు ఆధారం ప్రకృతి సూత్రాలే మానవ సమాజానికి కూడా వర్తిస్తాయి అంటే మానవ సమాజం కూడా క్షణక్షణం పురోగమిస్తూనే ఉంటుంది దోపిడిలేని వర్గ పూర్వ సమాజం ఒకటుంది. మానవుడు జ్ఞానం సంపాదించడం ప్రారంభించిన తర్వాత, ఆ కారణంగా ఉత్పత్తి పెరిగింతర్వాత అంటే అదనపు ఉత్పత్తి రాసాగింతర్వాత అదనపు

విలువను దోచుకొనే దోపిడి వర్గం తయారైంది జానిస, భూస్వామ్య వ్యవస్థల్లోని నగ్నమైన దోపిడిని శ్రామిక వర్గం ఎదుర్కోవడం కారణంగా దోపిడి వర్గం దోపిడి విధానంలో మార్పులు తెచ్చింది. శ్రామికవర్గానికి కొన్ని విషయాలలోనైనా రాయితీలు, స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు కొంతవరకైనా ఇవ్వక తప్పనిసరి పరిస్థితి ఏర్పడింది దోపిడి వర్గానికి. సుదీర్ఘమైన మానవజాతి చరిత్రలో ఇంతవరకూ ఏ హక్కులూ సౌకర్యాలూ సాధించుకోలేదా ? ఇదంతా ఏకత్వంవైపు, సమానత్వం వైపు ప్రయాణించడం కాదా ? ఏకత్వం, సమానత్వం అనేవి ఎప్పటికప్పుడు సాపేక్షికాలే నిన్నటి కంటే ఇవాళ, ఇవాల్టికంటే రేపు ఎక్కువ సమానత్వాన్ని సంపాదించే ప్రయత్నమే గదా మానవుడు చేస్తున్నది ? తరతరాలుగా చేస్తున్న పోరాటాల విప్లవాల వల్లనేగదా కొంతైనా మెరుగైన జీవితాన్ని సాధారణ మానవుడు పొందగలుగుతున్నది ? కమ్యూనిజం వల్ల ఈ భూమ్మీద సంపూర్ణ సుఖం ఏర్పడుతుందనుకోవడం స్వర్గానికి పోతామని అనుకోవడం లాంటిదే చలం దృష్టిలో. పోనీ చలం కోరుకునే స్వేచ్ఛా ప్రియత్వం వల్ల ఈ భూమ్మీద ఎలాంటి సుఖాన్ని కోరుకుంటున్నారు ? ఆయనకున్న ప్రణాళిక ఏమిటి ? ఈ ప్రశ్నలు వెయ్యడం న్యాయం కాదా ? ప్రస్తుతానికయినా సరే ఒక కనీసపు ఆలోచనా విధానాన్నీ, ఒక ప్రణాళికనూ చెప్పాలి గదా ? ప్రకృతిని తనకనుకూలంగా మార్చుకోవడం గానీ, సమాజాన్ని ఉన్నదానికంటే ఉన్నతంగా మార్చడంగానీ ప్రయత్నపూర్వకంగా, నిర్మాణాత్మకంగా ఒక క్రమపద్ధతిలో చెయ్యగలిగిన జీవి మానవుడు మాత్రమే. మానవుడు మాత్రమే సమాజంలోని పురోగమనాన్ని క్రమబద్ధమే గాదు, వేగవంతం కూడా చెయ్యగలుగుతున్నాడు. ఇది చరిత్ర మనకు రుజువు చేసిన సత్యం.

చివరగా ఒక మాట పాత ప్రశ్నలతో, పాత సమాధానాలతో సంతృప్తిపడి దబాయించి బతకడానికి కాలం చెల్లింది ఇవాళేకాదు, గతంలో కూడా. మతం, దేవుడు, ఆచారాలు, పోరాటాలు - అన్నీ ఎప్పటికప్పుడు కొత్త ప్రశ్నల్నీ, కొత్త సమాధానాల్నీ వెతుక్కుంటూనే ఉన్నాయి పురోగమనంలోని మూల సూత్రం ఇదే ఇది చలంతో వచ్చిందీ కాదు, చలంతో పోయేదీ కాదు

*(అరుణతార · అక్టోబర్ 1995)*

# ‘ప్రవాహగానం’పై చర్చా తీరుతెన్నులూ

అతను ఒక ‘స్వాప్నికుడు’, ‘క్రియాశీలి’, ‘ప్రేమికుడు’, ‘బోధకుడు’, ‘కవి’, ‘ద్వేషి ‘ఒక నిశ్చల ప్రశ్నార్థకం’, ‘అతడొక ఆయుధం’, అతని పేరుదాము. ‘ప్రవాహగానం’ అతని కవిత్వం.

11-5-96న అరెస్టయ్యాడు దాదాపు అదే సమయంలో దాము కవితల్ని ‘ప్రవాహగానం’ పేరుతో మునిక్రిష్ణ అనే ఆయన అచ్చువేశాడు. ముని క్రిష్ణ ముందుమాట 3-5-96న రాసినట్టు తేదీ వుంది. అయినా ఈ ముందు మాటను గానీ, అచ్చయిన కవితా సంపుటినిగానీ అరెస్టు కాకముందు దాము చూసి ఉండడు. ‘విమర్శ ఆత్మవిమర్శ పద్మవ్యూహంలోంచి నేనెలా -బయటకు తోయబడ్డానో తెలీదు’ అని 24-4-96 ఆంధ్రజ్యోతి దినపత్రికలో అచ్చయిన ఒక రచనలో చెప్పుకున్నాడు. ఈ రచనా ‘ప్రవాహగానం’లో ఉంది. దీన్ని బట్టి దాము అనే విప్లవకారుడు విప్లవోద్యమ నిర్మాణం నుండి బయటకు వచ్చినట్టు (లేక పంపబడ్డట్టు) అర్థమవుతుంది

మునిక్రిష్ణ ముందుమాట ప్రకారం దాము జీవితం అనేక మలుపులు తిరిగింది. చివరికి వృత్తి విప్లవకారుడయ్యాడు. అందులోంచీ బయటపడ్డాడు అరెస్టయ్యాడు ఈ నేపథ్యంలో దాము ‘ప్రవాహగానం’ పైన ఆంధ్రజ్యోతి, వార్త దినపత్రికల్లో చర్చ జరుగుతోంది.

సూటిగా చెప్పాలంటే ఈ చర్చలో పాల్గొన్నవాళ్ళలో ఒకరిద్దరు తప్ప తక్కినవాళ్ళందరూ దామూనీ, దాము కవిత్వాన్నీ మెచ్చుకుంటూ విప్లవోద్యమాన్నీ, విప్లవ సాహిత్యోద్యమాన్నీ కించబరుస్తూ రాస్తున్నారు అది వాళ్ళ లక్ష్యంగా కూడా కనిపిస్తోంది సమిష్టి నుండి వ్యక్తిని వేరుచేసి, గొప్పగా పనిగట్టుకుని ప్రచారం చేసే ధోరణి ఇటీవల బాగా కనిపిస్తోంది. నిర్మాణానికి కట్టుబడి ఉండడమే ఒక పెద్ద నేరమయినట్టూ, సిద్ధాంతానికి లోబడి ఉండడమే మహా ఘోరమయినట్టూ మాట్లాడ్డం ఒక ఫ్యాషన్‌గా మారిపోయింది.

ఎక్కువమంది విప్లవోద్యమంలో పని చేయలేక బయటకొచ్చి పౌరహక్కుల ఉద్యమంలోనో, విరసంలోనో చేరతారనీ, దాము అలాకాక పౌరహక్కుల ఉద్యమం నుంచి విప్లవోద్యమంలోకి వెళ్ళాడనీ మునిక్రిష్ణ తన ముందు మాటలో చెప్పడంలోనే విప్లవ ప్రజాసంఘాలపట్ల ఆయనకున్న ‘గౌరవం’ ఏపాటిదో తెలుస్తోంది. ఒకవేళ ఎవరయినా విప్లవోద్యమంలో పని చెయ్యలేక, ప్రజాసంఘాలలో పనిచేస్తే తప్పేమిటో! విప్లవోద్యమానికి ప్రత్యక్షంగాగానీ, పరోక్షంగాగానీ ఏమీ చెయ్యని మునిక్రిష్ణ కంటే మేలేగదా ! దామూలోని విప్లవకారుడు, విప్లవ కవి మునిక్రిష్ణకు దెయ్యంలా కనిపిస్తున్నారంటే, దామూలోని ‘నిర్మాణ వ్యతిరేకి’, ‘అరాచకవాది’ మునిక్రిష్ణకు దేవుళ్ళున్నమాట. ప్రతి మనిషికీ అనేక రూపాలుంటాయి. ఏ రూపాన్ని అతను

కాపాడుకుంటాడనేది అతనికున్న ప్రాపంచిక దృక్పథాన్ని బట్టి నిర్ణయింపబడుతుంది ప్రతి కమ్యూనిస్టులోనూ ఒక రివిజనిస్టూ, ఒక భూస్వామీ, ఒక బూర్జువా, ఒక పురుషాహంకారీ ఉండవచ్చు. అయితే చివరకు ఎవరు మిగులుతారనేది అతని కమిట్‌మెంట్‌ను బట్టీ, చిత్తశుద్ధితో అతను చేసే పోరాటాన్ని బట్టీ ఉంటుంది. అనేక సందర్భాల్లో ఒక వ్యక్తిలో జరిగే అంతస్సంఘర్షణకు ఇదే కారణం. దామూ జీవితాన్ని చూస్తే అతనిలో ఈ అంతస్సంఘర్షణ ఎక్కువగా, నిరంతరంగా జరుగుతున్నట్టు కనిపిస్తోంది. అయితే ఈ సంఘర్షణలో అతనిలోని విప్లవకారుడూ, విప్లవకవీ గెలుస్తున్నట్టు కూడా అర్థం చేసుకోగలం.

విప్లవోద్యమ కార్యకర్త కాగానే అతను నూటికి నూరుపాళ్ళూ ఆదర్శ మానవుడని ఎవరూ అనుకోరు. విప్లవోద్యమంలో వుండేవారు అసలే అనుకోరు. కాకుంటే విప్లవకారుడైనవాడు తనలో లోపాల్ని తానే గుర్తిస్తాడు. లేదా ఇతరులు చూపిస్తే అంగీకరిస్తాడు. తన తప్పుల్ని సరిదిద్దుకోడానికి చిత్తశుద్ధితో ప్రయత్నిస్తాడు. ఈ గుణం ఉన్నప్పుడు ఒక వ్యక్తిలోని లోపాల్ని భరించవచ్చు. అలాగే లంపెన్ వర్గానికి సంబంధించినవాళ్ళు విప్లవకారులుగా మారే క్రమం కూడా వుంటుంది. ఆ మారే క్రమంలో ఆ వ్యక్తిగానీ, ఆ వ్యక్తి ఉన్న సంస్థగానీ ఎన్నో విమర్శల్ని ఎదుర్కోవడం చూస్తూనే ఉన్నాం. ఒకవేళ ఆ వ్యక్తి విప్లవకారుడుగా మారే క్రమం తప్పి, ఆరాచక పద్ధతిలో ప్రవర్తిస్తే, నిర్మాణంలోనే కొనసాగుతూ నిర్మాణాన్ని అతిక్రమిస్తుంటే; లేదా నిర్మాణం నుంచి బయటపడితే ఆ వ్యక్తిని ఆకాశానికెత్తి, సంస్థను కించబరచడానికి ప్రయత్నిస్తారు. ప్రస్తుతం దాము నిర్మాణానికి దూరమవుతున్నాడనుకొని అతన్ని గొప్ప విప్లవకారుడిగా, విప్లవ కవిగా ప్రశంసిస్తున్నట్టు కనిపిస్తోంది. ఇలా భావించే 15-9-96 ఆదివారం ఆంధ్రజ్యోతి దినపత్రికలో పి.వి. రమణ 'ఇప్పటి వరకు ఉద్యమ సాహిత్యం ఒక ముఖాన్ని మాత్రమే ప్రదర్శించింది. మరో ముఖాన్ని దాచిపెట్టింది' అని అనగలిగాడు. ప్రవాహగానానికి ముందుమాట రాసిన మునిక్రిష్ణ మొదట్లోనే దామూను గురించి చెబుతూ, 'ఈ కాలం వీరుడు,ఆ శబోతు, మొండివాడు, తాగుబోతు, మూర్ఖుడు, కళాకారుడు, విప్లవకారుడు, అనేక రూపాలెత్తే ప్రవాహం' అన్నాడు. దాము గతంలో అనేక రూపాలెత్తిన ప్రవహం కావచ్చుగాని, విప్లవకారుడుగా ఇంకా కొనసాగేట్టయితే ఇకముందు కూడా 'అనేక రూపాలెత్తే' ప్రవాహంగా కొనసాగడు. జీవితాంతం అలా అనేక రూపాలెత్తుతూ ఉంటే అతను విప్లవకారుడు కాలేడు. ఎత్తగూడని రూపం ఒకసారెత్తి, గుర్తించి, ఆ తర్వాత సరైన రూపాన్నెత్తి ముందుకు సాగేవాడే విప్లవకారుడు. ఒక్కోసారి కొన్ని బలహీనతలు జీవితాంతం పట్టిపీడుస్తుంటాయి. అక్కడ కూడా ఆ వ్యక్తి ఘర్షణకు లోనవుతున్నాడా లేదా అన్నది ముఖ్యం. శ్రీశ్రీ తన స్వీయ చరిత్ర 'అనంతం'లో తన తాగుణ్ణి గురించీ, సెక్స్ సంబంధాల గురించీ చెప్పుకున్నప్పుడు విమర్శలే వచ్చాయిగాని, ప్రశంసలు రాలేదు. దీనిక్కారణం బహుశా శ్రీశ్రీ చివరిదాకా విరసంలో కొనసాగడమే అయివుండాలి. ఒకవేళ శ్రీశ్రీ విరసం నుండి బయటపడి ఉంటే ఆయనకు బ్రహ్మరథం పట్టే వర్గం ఒకటి తయారై ఉండేది

`దిండు క్రింద సెక్సు బుక్కు / గుండె క్రింద అనీజీ బురద / ఎవరికి తెలియదు నన్ను గూర్చి' అని చెప్పుకున్నదాము 'ఎవరికి మాత్రం ఎందుకు తెలియదు / నన్ను నేను వ్యక్తం చేసుకోలేని అశక్తున్నని / తలక్రిందులుగా నటించడం కూడా తెలియదని' అని కూడా చెప్పుకున్నాడు. తమ లోపాల్ని సమర్థించుకోడానికి సిద్ధాంతాలు చెప్పి రచనలు చేసేవాళ్లు నటిస్తుంటారు. తమ లోపాల్ని గుర్తించి సవరించుకునే ప్రయత్నం చేసేవాళ్లు విప్లవకారు లౌతారు ఇంతవరకు దాము ప్రవాహం ఇలాగే సాగిందని అనుకోవచ్చు. ఇక భవిష్యత్తా ! ఎవరి విషయంలోనైనా భవిష్యత్తును ఊహించడం కష్టమే గావచ్చు.

తన సహచరులు ఉద్యమంలో ప్రాణాలు కోల్పోయాక 'ఎదురు తిరగడం నేర్చుకున్నాక శవాలు కాక వాళ్ళేమవుతారు' అని వాస్తవాన్ని గుర్తించి తనకుతాను సమాధానం చెప్పుకుని 'నేను కళేబరం కాకపోయినందుకు భోరున ఏడ్చాను' అని అవేదన చెందిన దాము, వెయ్యిసార్లు ఓడిపోయినా 'వెయిన్నొకటోసారి గెలుస్తాం' అనే ఆత్మ విశ్వాసం ఉన్న దాము ఏవి పాలో, ఏవి నీళ్ళో తెలుసుకోలేని అజ్ఞాని కాడు.

అది అరెస్టయింతర్వాత (28-5-96) రాసిన కవితే అయితే "పుట్టిన తర్వాత మరణించిన వాడికోసం / నేనిపుడు మౌనం పాటించదలుచుకోలేదు / మరణించిన తర్వాత పుట్టినవాడి కోసం / నేనిపుడు ఖడ్గధారణ చేయదల్చుకున్నాను." అన్న దాము రాజకీయంగా స్పష్టమైన అవగాహనతోనే ఉన్నాడని తెలుస్తోంది.

15-6-96 ఆంధ్రజ్యోతి దిపత్రికలో 'ఉద్యమ సాహిత్య మార్మికతను బద్దలు కొట్టిన 'ప్రవాహగానం' అనే పేరుతో పి.వి. రమణ రాసిన వ్యాసంలో విరసం పట్లా, విప్లవోద్యమం పట్లా తీవ్రమైన, అసంబద్ధమైన ఆరోపణలున్నాయి. దాము అమరుడయి ఉంటే విరసం దామూని తన సభ్యుడని ప్రకటించుకుని ఉండేదట ! తాము అవసరమనుకున్న దామూ ముఖాన్ని మాత్రమే ప్రదర్శించి ఉండేదట ! విప్లవోద్యమం ఆత్మకధను ఒక సాహిత్య రూపంగా అంగీకరించడం లేదట ! ఈ గొప్ప సత్యాన్ని ఇన్నాళ్ళకు పి.వి. రమణ సాహసంతో బయట పెట్ట గలిగాడన్న మాట ! విరసం సభ్యులుగా చేరని అమరులైన కవుల్ని విరసం తన సభ్యులుగా (టెక్నికల్‌గా) చెప్పుకోలేదు నూతన్, రిక్కల సహదేవరెడ్డి, ఎం.ఎస్.ఆర్., బెంజిమన్, పద్మక్క - వీళ్ళందరూ విరసం సభ్యులుకూడా. వాళ్ళ కార్యరంగం కాలక్రమంలో విరసం సభ్యత్వం కంటే ఇంకా ఎక్కువగా విస్తరించినందువల్ల పి వి. రమణలాంటి వాళ్లు వీళ్ళను విరసం సభ్యులు కారని అనుకోనుండొచ్చు. ఒక వ్యక్తిగాని, విప్లవ కారుడుగాని, విప్లవకవిగాని ఎదిగే క్రమంలో తనను తాను ఎడిట్ చేసుకోవడం, లేదా సంస్థ ఆ వ్యక్తిని నిర్మాణాత్మకంగా ఎడిట్ చెయ్యడం ఎలా తప్పో తెలియదు ఈ విషయం గురించి 8-9-96 ఆంధ్రజ్యోతి దినపత్రికలో 'ఒక్క దామూలో అనేక మంది దామూలున్నారు' అనే పేరుతో విరసం సభ్యుడు ఎన్. వేణుగోపాల్ రాసిన వ్యాసంలో వివరించాడు. ఇక విప్లవోద్యమం ఆత్మకధను ఒక సాహిత్య రూపంగా ఎక్కడ గుర్తించలేదో రమణగారే చెప్పాలి. విరసంతో గానీ, విప్లవోద్యమంతోగానీ పి.వి. రమణకు విభేదాలుంటే ఉండవచ్చుగానీ, విరసాన్ని ఒక ముసుగు సంస్థగా చిత్రించడం దారుణం ఈ మాటద్వారా అయనకున్న విప్లవ

ద్వేషం, విప్లవ సాహిత్య ద్వేషం వ్యక్తమవుతున్నాయి. ఈ ద్వేషపూరిత స్వభావంతో వ్యాసం రాయడం వల్ల రమణ నిగ్రహంగా ఆలోచించలేకపోయాడు. బురద జల్లడమే ధ్యేయంగా పెట్టుకున్నాడు గనుక వాస్తవాలను చూడలేకపోయాడు విరసాన్నీ, విప్లవోద్యమాన్నీ తప్పుబట్టడానికి రమణ లాంటి వాళ్ళకు 'దాము' సాధనం కావడం శోచనీయమైన విషయం. ఇలాంటివాళ్ళను దృష్టిలో పెట్టుకునే కాబోలు దాము 1988లోనే ఇలా రాశాడు.

"నీ జాలి కన్నీటిబొట్లు నా కొద్దు
నీ వేడినిట్టూర్పులు నాకొద్దు
నా రైలు పరుగెడుతుంటే
స్టేషన్లో నించొని చేయివూపద్దు
నా భుజం మీద చేయి వేయగల్గితే వేయి
నా కంపార్టుమెంటులో కూర్చోగలిగితే కూర్చో
లేదూ - నాకు నీ వీపు చూపించి
పిరికి పాదరక్షలేసుక పరిగెత్తు."

*(అరుణతార : ఆగస్ట్ - సెప్టెంబర్ 1996)*

# సాహిత్యంలో తాత్విక బానిసత్వం ?

గత దశాబ్ద కాలంగా తెలుగులో వచ్చిన స్త్రీవాద, దళితవాద సాహిత్యాలు కొన్ని పాజిటివ్ అంశాలను మన ముందుంచాయన్నది ఎంత వాస్తవమో, కొన్ని నెగటివ్ అంశాలనూ మనమీదికి వదిలాయన్నది అంతే వాస్తవం. అయితే దీనికి ఆ యా వాదాలనూ, ఆ యా సాహిత్య ధోరణులనూ తప్పుబట్టడం అనవసరం. ఏ వాదాన్నయినా, సిద్ధాంతాన్నయినా, సాహిత్యాన్నయినా తప్పుదోవ పట్టించే వ్యక్తులు కొందరుంటారు. ఈ వ్యక్తులలో కూడా కావాలని ఉద్దేశ్యపూర్వకంగా అలా ప్రవర్తించేవాళ్ళు కొందరయితే, తప్పుడు చైతన్యంతో కొట్టుకుపోయేవాళ్ళు మరికొందరు. ఇంకొన్ని సందర్భాల్లో సిద్ధాంతాలలోనే, సాహిత్య ధోరణుల్లోనే తప్పుడు చైతన్యం వుంటుంది. అయితే వీటన్నిటినీ విశ్లేషించుకుని సరైన మార్గ నిర్దేశం చెయ్యవలసిన బాధ్యత ఆ యా వాదాల, ధోరణుల నాయకత్వానిది. ఈ దృష్టితో చూసినపుడు స్త్రీవాద, దళితవాద నాయకత్వాలు ఆ మేరకు తమ కర్తవ్యాన్ని నిర్వర్తించడంలో విఫలం చెందినట్టే.

స్త్రీ వాద, దళితవాద ధోరణులు వ్యక్తీకరించిన నెగటివ్ అంశాలలో నిర్మాణ వ్యతిరేకత, సిద్ధాంత వ్యతిరేకత ముఖ్యమైనవి. సాహిత్య సామాజిక విమర్శ వ్యాసాలద్వారా వీటిని ముందుకు తీసుకెళుతున్న వ్యక్తులలో బి.యస్. రాములు ఒకరు. ఇటీవల ఆదివారం ఆంధ్రప్రభ 'సాహితీ గవాక్షం'లో రెండు వ్యాసాలు రాశారు. అవి 'పార్టీల బానిసత్వంలో ఉద్యమకవులు' (21-7-1996), 'ఉద్యమ గీతాలకు సాహితీ గౌరవం ఎందుకు లేదు ?' (29-9-1996) అనేవి. భిన్నమైన శీర్షికలతో రెండు వ్యాసాలుగా ఉన్నా రెండిటిలోను సారాంశం ఒకటే.

పై రెండు వ్యాసాలలోనూ బి.యస్.రాములు చెప్పిన అంశాలు నాలుగు. మొదటిది ఉద్యమగీతాల కవులు, గాయకులు తాత్వికులు స్వేచ్ఛను కోల్పోయారనేది. దీనికి కారణం పార్టీ నాయకుల పెత్తనం. రెండోది ఆ యా పార్టీలు వచన కవులకిచ్చే గౌరవం పాటకవులకు, గాయకులకు ఇవ్వడం లేదు. మూడోది. పాట కవులకు, గాయకులకు ఉద్యమ నాయకత్వంలో రావలసిన వాటా రాలేదు. దీనికోసం నాయకత్వాన్ని నిలదీయాల్సి వుంది. నాలుగోది ఆ యా ఉద్యమాలు తమ అవసరాల కోసం అంటే ప్రచారం కోసం పాటను సాధనంగా వాడుకుంటున్నాయి అంతేగాని - పాటను ఒక సాహిత్య ప్రక్రియగా అంగీకరించడం లేదు ఈ నాలుగు ముఖ్యాంశాలలోనూ సారాంశం ఒక్కటే. అది పాట కవులపైన, గాయకులపైన పార్టీల ఆధిపత్యం వుండడం. అంటే పార్టీల నాయకత్వం పాట కవుల్నీ, గాయకుల్నీ తాత్విక బానిసత్వానికి గురి చేసిందనేది.

ఈ రెండు వ్యాసాలలోనూ బి.యస్. రాములు ఒక వాస్తవాన్ని చెప్పారు - పాటకవులకు, గాయకులకు ప్రజల్లో ప్రాచుర్యం ఉన్నా సాహిత్య చరిత్రకారులు సరిగ్గా రికార్డు చెయ్యలేదని. ప్రాచీన కాలంలో ఈ అన్యాయం ఇంకా ఎక్కువగా జరిగింది.

తెలుగు సాహిత్య చరిత్రను సాంప్రదాయిక సాహితీవేత్తలు రాజాస్థానాల సాహిత్యానికే పరిమితం చేశారు. జానపదుల పాటలకు, జనంలో తిరిగి జీవితానుభవాల్ని చెప్పిన వేమన పద్యాలకు, శతక సాహిత్యానికి, యక్షగానాలకు, చివరకు క్షేత్రయ్య,త్యాగరాజు మొదలైన వాగ్గేయకారులకు, ఇంకా ఎందరో ప్రజాకవులకు సాహిత్య చరిత్రలో సరైన స్థానం దొరకలేదు. ప్రజల్లో ప్రచారమైన ఈ సాహిత్యాన్ని పండితవర్గం సాహిత్యంగా గుర్తించలేదు. శతక కవులకు పురాణ ప్రబంధ కవులకిచ్చిన గౌరవం ఇవ్వలేదు శతక కవుల్ని అసలు కవులుగానే పరిగణించలేదు. నిజానికి శతక సాహిత్యంలో చాలావరకు జీవితం కనిపిస్తుంది. కందుకూరి వీరేశలింగం కూడా తన 'కవుల చరిత్ర'లో వేమనకు స్థానం ఇవ్వలేదు. నిజానికి వేమన అభిప్రాయాలకూ, వీరేశలింగం అభిప్రాయాలకూ దగ్గరి పోలికలున్నాయి ఇద్దరూ, మూఢవిశ్వాసాల్నీ, సాంఘిక దురాచారాల్నీ వ్యతిరేకించినవారే. అయినా వీరేశలింగం కూడా వేమనకు తన 'కవుల చరిత్ర'లో స్థానం ఇవ్వలేదంటే వేమనను కూడా ఒక శతక కవిగానే గుర్తించారన్నమాట. ఆ రోజుల్లో ఇదంతా ఒక విధంగా ప్రచార సాహిత్యమే. అసలు ప్రచారం చెయ్యని సాహిత్యం అంటూ ఏదీ వుండదు. అయితే అది ఏ భావాల్ని ప్రచారం చేస్తున్నదనే విషయాన్ని చూడాలి. అశేషప్రజానీకానికి ఉపయోగపడే భావాల్ని ప్రచారం చెయ్యకపోతే ఆ సాహిత్యానికి అర్థం లేదు. ప్రచార సాహిత్యం జీవితపులోతుల్ని విశ్లేషించగలిగితే అదే గొప్ప సాహిత్యం బి.యస్. రాములుకు ప్రచార సాహిత్యంతో కూడా పేచీ ఉన్నట్టు కనబడదుగానీ, అది పార్టీ ప్రచారమో, ఉద్యమ ప్రచారమో అయితే మాత్రం పేచీ పడుతున్నారు. ఒక పార్టీ ఉండడం గానీ, ఆ పార్టీ ఒక ఉద్యమాన్ని నడపడం గానీ, ఆ ఉద్యమంలో భాగంగా ఎందరో కవులూ, కళాకారులూ పుట్టుకు రావడంగానీ చాలా సహజం. నాజర్ అయినా, గద్దరయినా, వంగపండయినా, ఇంకా ఎందరో అలా పుట్టుకొచ్చినవాళ్లే. విప్లవ పార్టీలూ, వాటి నాయకత్వంలో జరిగే విప్లవోద్యమమూ ఎందరో ప్రజాకవుల్నీ, ప్రజా గాయకుల్నీ సృష్టిస్తాయి. వీళ్ళు ఆ ఉద్యమాన్నే గానం చేస్తారు. అలా చెయ్యటం నేరం కాదు. అలా చేస్తారు కాబట్టి వీళ్ళందరికి స్వతంత్రమైన ఆలోచన, వ్యక్తిత్వం లేదనడం అర్థరహితం. ఆ యా కవులకున్న తాత్విక స్థాయిని బట్టీ, సామాజిక అధ్యయనాన్ని బట్టీ, జీవితం పట్ల అవగాహనను బట్టీ వాళ్ళ పాటలు జీవితపు లోతుల్ని చూడగలుగుతాయి. అంతేగాని వాళ్ళు పార్టీని అంటిపెట్టుకుని ఉంటారు కాబట్టి జీవితపు లోతుల్ని చూడలేరనడం సరికాదు

పాటకవుల్నీ, గాయకుల్నీ సాహిత్య చరిత్రకారులు పెద్దగా పట్టించుకోలేదనడం వాస్తవం. అయితే దీనికి కారణం వ్యక్తీకరణలో నూతనత్వం, సాహిత్య విలువలు పాటలలో, ఉద్యమ గీతాలలో లేకపోవడం కాదు. ప్రాచీనకాలపు ప్రజాసాహిత్యంలో కూడా ఇవన్నీ లేవనే ఆనాటి వాళ్ళనుకున్నారు. అయినా ఈనాడు అది గొప్ప సాహిత్యమనీ, ప్రజా సాహిత్యమనీ మనం అనుకుంటున్నాం. ప్రాచీనకాలపు పురాణ ప్రబంధ కవులలో గానీ, ఈనాటి వచన కవులలో గానీ వ్యక్తీకరణలో ఒరిజినాలిటీ, సాహిత్యపు విలువలు లేనివాళ్ళు ఎందరో ఉన్నారు. గొప్ప కవుల రచనల్లో కూడా పేలవమైనవి ఎన్నో ఉంటాయి

అయినా వాళ్ళకు పేరుప్రతిష్ఠలు రావడానికీ, సాహిత్య విమర్శ వాళ్ళ కవిత్వాన్ని పట్టించుకోడానికీ ఈ లోపాలు అడ్డం రాలేదు దీనికి కారణం సాంప్రదాయికంగా సాహిత్య విమర్శకుల్లో ఉన్న భ్రమలే త్యాగయ్య, క్షేత్రయ్య, అన్నమయ్య మొదలైన వాగ్గేయకారుల్ని భక్తులుగా. సంగీత పండితులుగా చూసినంతగా కవులుగా చూడనట్లే గద్దర్‌ని కూడా వెంటనే గొప్ప గాయకుడంటారు గాని, గొప్ప కవి అనరు. ఇది సాహిత్య విమర్శలో అలవాటుగా దొర్లిన పొరబాటు. గద్దర్ ఆధునిక కాలంలో గొప్ప విప్లవ వాగ్గేయకారుడు. తనే పాట కట్టుకుని, సంగీతం కూర్చుకుని, ప్రజల ముందుకు వెళ్ళి పాడి వినిపించేవాడు వాగ్గేయకారుడు. వచన కవులు ఇలా ప్రజల్లోకి వెళ్ళినవాళ్ళు కాదు. కవులుగా వీళ్ళకు ప్రజలతో ప్రత్యక్ష సంబంధం ఉండదు. రాజకీయపరంగా, సాంఘిక కార్యకలాపాల పరంగా వీళ్ళలో కొందరికి ప్రజలతో సంబంధాలుండవచ్చు అలాంటివాళ్ళు రాసిన వచన కవితలు కూడా జీవితపు లోతుల్ని చూస్తాయి.

వచన కవిత తనలోకి తాను చొచ్చుకు వెళ్ళినంతగా పాట తనలోకి తాను చొచ్చుకుపోలేదనడం ఒక విధంగా సత్యం. తనలోకి తాను చొచ్చుకునిపోయే కవి ఎవరైనా అదే స్థాయిలో ప్రపంచంలోకి కూడా చొచ్చుకుపోగలిగితేనే గొప్ప కవి అవుతాడు. లేకపోతే వచన భావకవిగా తయారవుతాడు. వచన కవుల్లో వచన భావకవులు ఎందరో ఉన్నారు. అందుకే వచన కవిత్వంలో సంక్లిష్టత, అస్పష్టత అనేవి వచ్చాయి. బి యస్. రాములు ఈ విషయాన్ని గుర్తిస్తున్నారు గానీ, అయితే దీన్ని పాజిటివ్ అంశంగా భావిస్తున్నట్టున్నారు. వచన కవిత పార్టీ దృక్పథాన్ని స్పష్టంగా చెప్పదనీ, పాట స్పష్టంగా చెబుతుందనీ గుర్తించి, పాట అలా స్పష్టంగా దృక్పథాన్ని చెప్పడం దాని స్థాయిని తగ్గించుకున్నట్టుగా భావిస్తున్నారు. స్పష్టత అనేది ఎప్పుడూ గొప్ప లక్షణమే అస్పష్టత ఎప్పుడూ గొప్ప లక్షణం కాకూడదు. స్పష్టత, అస్పష్టత అనేవి భావ వ్యక్తీకరణలో కవికున్న శక్తిసామర్థ్యాలకు చిహ్నాలు. అంతేగాని వాటంతటవే కవితా విలువలు కావు అస్పష్టతను, సంక్లిష్టతను కొందరు కవితా విలువలుగా భ్రమింపజేశారు. స్పష్టత వేరు, వాచ్యత వేరు. ఒక విషయాన్ని చెప్పే పద్ధతిలో వాచ్యం, వ్యంగ్యం, ఇంకా ఎన్నో రకాలు ఉండవచ్చు. కానీ వీటన్నిటిలో స్పష్టత ఉండాలి పాటకు సాహిత్య విమర్శలో తగినంతచోటు దొరకలేదనడంలో అర్థం వుంది. అయితే దీనికి కారణాలు బి యస్. రాములు చెప్పినవి కావు 'కవిత - పాండితి' అనే వ్యాసంలో నార్ల వెంకటేశ్వరరావు ఒక జానపద గేయాన్ని కోట్ చేసి మనుచరిత్ర కావ్యంకన్నా ఈ జానపద గేయమే గొప్పదన్నారు. అంతకుముందు సాంప్రదాయిక సాహిత్య విమర్శకులకు ఈ దృక్పథం లేదు. వర్గచైతన్యం వచ్చాక సాహిత్యంలో కూడా వర్గ స్వభావాన్ని చూస్తున్న నేపథ్యంలో పాటకున్న విలువను కమ్యూనిస్టు పార్టీ గుర్తించింది. నక్సల్బరీ తరంలో ఈ గుర్తింపు ఇంకా పెరిగింది. పాటలలో ఎంతో వైవిధ్యం వచ్చింది. సంఖ్యాపరంగా తీసుకుంటే వచన కవులకన్నా పాటకవులు తక్కువగా వుంటారు అందువల్ల వచన కవితలకన్నా పాటలు తక్కువ కనిపించవచ్చు.

"ఉద్యమ గీతాల కవులు తాత్విక స్వేచ్ఛను గెలుచుకుంటేనే వారి పాటలకు గౌరవం పెరుగుతుంది" అన్నారు బి.యస్ రాములు అదే సమయంలో గద్దర్‌కు తాత్విక స్వేచ్ఛ లేదన్నారు. గద్దర్ పాటలకు సాహిత్య గౌరవం వుంది. చాలా ఎక్కువగా కూడా వుంది. పాటలకు సాహిత్య గౌరవం ఉండడం వేరు, దాన్ని విమర్శకులు గుర్తించడం వేరు. బి.యస్ రాములు వ్యాసాలలో ఈ వైరుధ్యం ఉంది. పాట కవులు, గాయకులు పార్టీ బానిసత్వంలో, ఉద్యమ బానిసత్వంలో ఉండి తాత్వికంగా స్వేచ్ఛను కోల్పోయారని చెప్పడం ఆయన ఉద్దేశం. ఉద్యమాలకు సేవ చేసి చేసి రెక్కలు అరిగిపోయిన పాటకవులు స్వేచ్ఛకోసం పార్టీ నాయకత్వాన్ని నిలదీయాలని ఆయన అభిప్రాయం స్వేచ్ఛకోసం ఎవరయినా, ఎప్పుడైనా పోరాడాల్సిందే. అయితే ఇక్కడ తక్కినవాళ్ళందరకూ స్వేచ్ఛ ఉండి, పాటకవులకూ, గాయకులకూ మాత్రం స్వేచ్ఛ లేదనడం అర్థం గావటం లేదు.

అసలు తాత్విక స్వేచ్ఛ అంటే ఏమిటి ? పార్టీనీ, ఉద్యమాన్నీ అంటిపెట్టుకుని ఉండటం స్వేచ్ఛ లేకపోవడంగా బి.యస్. రాములు చూస్తున్నారు. ఆ రెండిటికీ దూరం అయితే ఆయన దృష్టిలో వాళ్ళకు స్వేచ్ఛ ఉన్నట్టా ? తాత్విక దృక్పథం, రాజకీయ దృక్పథం వ్యక్తికీ, వ్యక్తికీ మారవు. ఆ దృక్పథాన్ని సమాజానికి అన్వయించి ఒక విషయాన్ని విశ్లేషించే క్రమంలో తేడాలు కనిపిస్తాయి. ఆ దృక్పథంతో జీవితాన్ని చూడగలగడంలో స్థాయీ భేదాలు కనిపిస్తాయి. అంతేగాని తాత్విక, రాజకీయ దృక్పథాలు పార్టీలకయినా, కవులకయినా ఒకటిగానే ఉంటాయి. మార్క్సిజం-లెనినిజం-మావో ఆలోచనా విధానం పార్టీ దృక్పథంగానూ, కవుల దృక్పథంగానూ ఉంటుంది. ఆ యా వ్యక్తుల అధ్యయనాన్ని బట్టీ, అవగాహనను బట్టీ, కమిట్‌మెంటును బట్టీ ఆ దృక్పథాన్ని జీర్ణించుకోవడంలో తేడాలుంటాయి సిద్ధాంతం ఒకటే అయినా వ్యక్తుల అనుభవాలలో వైవిధ్యం ఉండవచ్చు. అయితే ఆ వ్యక్తుల అనుభవాలలోని వైవిధ్యం కూడా అధ్యయనం, చర్చలు, విశ్లేషణ క్రమంలో ఏకీబావం పొందుతుంది. చివరకు వ్యక్తుల అనుభవాలన్నీ ఒక సామూహిక, సామాజిక అనుభవంగా రూపాంతరం చెందుతాయి. అనుభవాలను పొందడంలోనూ, అన్వయించడంలోనూ, అభిరుచిలోనూ, భాషలోనూ, వ్యక్తీకరణ విధానంలోనూ తేడాలు కనిపిస్తాయే తప్ప దృక్పథంలో కాదు. కాబట్టి తాత్విక బానిసత్వం అనే మాటకు అర్థంలేదు.

మార్క్స్. ఏంగెల్స్, లెనిన్, స్టాలిన్, మావోలలో కూడా అనుభవాలలో, ఆలోచనలలో తేడాలున్నాయి. వాళ్ళ అనుభవాలూ, ఆలోచనలూ అన్నీ సరైనవే అని కూడా చెప్పలేం. కొన్ని లోపాలుంటాయి. పొరబాట్లుంటాయి. అయితే ఎప్పటికప్పుడు ఆచరణ గీటురాయిపై సరిచూసుకుంటూ, గుణపాఠాలు తీసుకుంటూ ముందుకు సాగారు. వీళ్ళందరి సిద్ధాంతం ఒకటే. సిద్ధాంతానికున్న రాజకీయ, ఆర్థిక, సాంఘిక నేపథ్యం మారినప్పుడు, ఆ సిద్ధాంతం వెలుగులోనే కొత్త విషయాలను జోడించి, కొత్త వ్యాఖ్యానాలు చేసి సిద్ధాంతాన్ని పరిపుష్టం చేశారు. ఇదే పద్ధతి సాహిత్య కళారంగాల్లోనూ ఉంటుంది అంతేగాని మనిషికొక సిద్ధాంతం, వ్యక్తికొక తాత్విక దృక్పథం వుండవు.

ఇటీవల వచ్చిన కొన్ని వార్తలు, ప్రకటనల్ని బట్టి పార్టీకీ, గద్దర్‌కూ రాజకీయ, తాత్విక విభేదాలున్నాయని బి.యస్. రాములు ఊహించడం సహజమే. వాటిలో విభేదాలు రావని ఎవరూ అనరు. భిన్నాభిప్రాయాలుండవని ఎవరూ చెప్పరు. ఇవి ఒక కొలిక్కి రావడానికి ఘర్షణా, ఐక్యతా విధానమూ తప్పదు. అంతమాత్రాన్నే ఒక కళాకారుడు పార్టీకి బానిస అనడం శాస్త్రీయమైన దృక్పథం కాదు. ఆ మాటకొస్తే పార్టీ నాయకులలో కూడా రాజకీయ విభేదాలు వచ్చి చీలిపోతున్నారు గదా ? రాజీనామాలో, బహిష్కరణలో చేస్తుంటారు గదా ? అప్పుడు ఆ నాయకులు కూడా అలా వెళ్ళిపోయేంతవరకు బానిసలా ? పార్టీకీ, కళాకారుడికీ విభేదంవస్తే అది పార్టీ ఆధిపత్యం అనడం, పార్టీ నాయకత్వంలో ఒక అగ్రకుల నాయకుడికీ, ఒక దళిత నాయకుడికీ విభేదం వస్తే అగ్రవర్ణ అహంకారం అనడం, పురుషుడికీ, స్త్రీకీ విభేదం వస్తే పురుషాధిపత్యం అనడం చాలా తేలిక. ఆధిపత్యం, అగ్రవర్ణ అహంకారం, పురుషాధిపత్యం ఉండే సందర్భాలు వేరు. కానీ ప్రతి విభేదాన్నీ ఆ కళ్ళతోనే చూడ్డం సరైందికాదు. మరి పార్టీ నాయకత్వంలోని ఇద్దరు అగ్రకుల నాయకులలోనే విభేదం వస్తే ?

ఇంకా దారుణమైన విషయం ఏమిటంటే రాచరిక వ్యవస్థలో రాజాశ్రిత సాహిత్యంలాగా, ఈ రోజుల్లో పార్టీ ఆశ్రిత సాహిత్యంగా బి యస్. రాములు విప్లవ సాహిత్యానికి ముద్రవెయ్యడం. అంటే ఆయన దృష్టిలో కవులూ, కళాకారులూ ఉద్యమానికి అంటిపెట్టుకుని ఉండకూడదు. ఉద్యమానికి అంటిపెట్టుకుని ఉంటే బానిసలు ! ఉద్యమానికి దూరమైపోతే స్వేచ్ఛాజీవులు ! ఇదే స్వేచ్ఛ అయితే ఆ స్వేచ్ఛను బి.యస్. రాములు లాంటివాళ్ళనే అనుభవించనీయండి ! బూర్జువా మేధావులు చేసే ఆరోపణనే ఈయనా మరో రూపంలో చేస్తున్నారు. బూర్జువా మేధావులు అసూయతోనో, అజ్ఞానంతోనో, వర్గ స్వభావంతోనో విప్లవ సాహిత్యాన్ని నినాద సాహిత్యంగా, ప్రచార సాహిత్యంగా (అంటే సాహితీ విలువలు లేనిదానిగా) అంటే అర్థం చేసుకోవచ్చు. అభ్యుదయ, దళిత ముసుగుల్లో ఉన్నవాళ్ళూ ఈ ఆరోపణలే చేస్తే కూడా అర్థం చేసుకోవచ్చు - వాళ్ళు ముసుగులోంచి మాట్లాడుతున్నారని. అయితే వీళ్లు సాధారణ ప్రజానీకాన్ని కొంతకాలం భ్రమల్లో పెట్టి కాస్త గందరగోళానికి గురిచెయ్యగలుగుతారు

కళలు సాహిత్యం తాత్విక బానిసత్వాన్ని ప్రచారం చేయడానికి ఉపయోగ పడుతున్నాయని రావిపూడి వెంకటాద్రి తన 'కళలు తత్వశాస్త్రం' అనే గ్రంథంలో ఆవేదన చెందాడని బి.యస్. రాములు అనగలరు. రావిపూడి వెంకటాద్రి కమ్యూనిస్టు ద్వేషిగదా! ప్రజా ఉద్యమాలను, ప్రజల తత్వశాస్త్రాన్ని గుడ్డిగా వ్యతిరేకించే రావిపూడి అన్న 'తాత్విక బానిసత్వం' అన్నమాట బి యస్. రాములుకు ఎంతో ఆనందాన్ని కలిగించి ఉంటుంది. అదే వ్యాసంలో ఆ తర్వాత రావిపూడి అభిప్రాయాన్ని తిరస్కరించినా, కళలు సాహిత్యం తాత్విక బానిసత్వానికి లోనయ్యాయని ఆయన చెందిన 'ఆవేదన'ను బి.యస్ రాములు మనస్ఫూర్తిగా అంగీకరిస్తున్నారు.

"తనపై తాను, తన పార్టీపై తాను, ఈ సమాజంతో తాను పోరాడడం ద్వారానే పాటల కవులకు నిజమైన స్వేచ్ఛ ఏమిటో తెలుస్తుంది ?" (బి.యస్. రాములు) పాటల కవులకే కాదు, ఎవరికైనా స్వేచ్ఛ అంటే ఏమిటో అలాగే తెలుస్తుంది తనపైనా, తన పార్టీపైనా, సమాజంతోనూ కమ్యూనిస్టు అయినవాడెవడైనా పోరాడాలి. కాని ఆ పోరాడే పద్ధతులు వేరు. వ్యక్తి తనతో తాను పోరాడిన విధానమంతా బహిరంగ సభలో ఉపన్యాసం యివ్వక్కరలేదు. ఒక వ్యక్తి లేదా ఒక సమూహం తన పార్టీపై పోరాడడం అంటే పార్టీలో ఉండి పోరాడడమేగాని బయటికొచ్చికాదు నిర్మాణపద్ధతులకు లోబడి చేసే పోరాటం వల్లనే ఎవరైనా విజయం సాధించగలుగుతారు. నిర్మాణమే లేకపోతే ఏదీ సాధించలేరు

ఒక వ్యక్తిలో నిర్మాణం ఉంది ఒక సమూహంలో నిర్మాణం ఉంది ఒక జాతిలో, ఒక పార్టీలో, ఒక ఉద్యమంలో నిర్మాణం ఉంటుంది. ఒక సమాజంలోనూ ఆ నిర్మాణం ఉంటుంది. ఈ ప్రపంచంలో, విశ్వంలో నిర్మాణం ఉంది. నిర్మాణ వ్యతిరేకతను అనేక రూపాల్లో వ్యక్తం చేస్తున్న బి యస్. రాములు లాంటివాళ్ళలోనూ ఒక నిర్మాణం ఉంది. అయితే వీళ్ళలో ఉండే నిర్మాణం ప్రజలకుపయోగపడే నిర్మాణాన్ని వ్యతిరేకించడానికే, కమ్యూనిస్టు నిర్మాణాన్ని వ్యతిరేకించడానికే. పార్టీలకుగానీ, ఉద్యమాలకుగానీ మూలం ప్రజలు అనే వాస్తవాన్ని గుర్తిస్తే ఈ రకమయిన గందరగోళానికి తావులేదు. పార్టీ వ్యతిరేకత ఉద్యమ వ్యతిరేకతకు దారితీస్తుంది. ఉద్యమ వ్యతిరేకత నిర్మాణ వ్యతిరేకతకు దారి తీస్తుంది. నిర్మాణ వ్యతిరేకత చివరకు ప్రజా వ్యతిరేక స్వభావాన్ని కలిగిస్తుంది. పతనం అనే గమ్యానికి ఇవన్నీ విభిన్న దశలు.

*(అరుణతార : అక్టోబర్ 1996)*

# చారిత్రక దృక్పథం లోపించిన 'చరిత్రాత్మకమైన' చేరా పీఠిక

'పద్యకవితా పరిచయం-1' అనే పుస్తకాన్ని బేతవోలు రామబ్రహ్మం (బేరా)గారు 'అరుణతార'లో సమీక్ష కోసం నాకు పంపారు. అది సరిగ్గా డిసెంబర్ (1997) 6వ తేదీన నాకందింది. డిసెంబర్ 6 అంటే హిందూ మతోన్మాదులు బాబ్రీమసీదును కూలగొడుతూ పైశాచికానందాన్ని పొందిన రోజు. మైనారిటీ మతస్థుల నమ్మకాన్నీ, సెంటిమెంటునూ మెజారిటీ మతానికి చెందిన కొందరు భంగపరిచిన రోజు. చరిత్రను వెనక్కి మళ్ళించాలని ప్రయత్నించిన రోజు ఆ రోజున 'పద్య కవితా పరిచయం' పోస్టులో నాకు అందడం యాదృచ్ఛికమే కావచ్చు. కానీ పద్యాన్ని పునరుద్ధరించే ప్రయత్నం, బాబ్రీమసీదు విధ్వంసం - రెండూ ఒకే అంశానికి సంబంధించిన రెండు కోణాలు అని మరోసారి గుర్తు చేసుకోడానికి అవకాశం కల్పించింది.

పద్యం పుట్టుక, స్వభావం, నిర్మాణం, అందులోని భాష, నిర్వహించిన పాత్ర మొదలైన అంశాల్ని పరిశీలిస్తే అది ఖచ్చితంగా భూస్వామ్య వ్యవస్థకు సంబంధించిన సాహితీరూపం అనే విషయం తెలుస్తుంది. భారతీయ జనతాపార్టీ, విశ్వహిందూ పరిషత్, ఆరెస్సెస్ వగైరాలు బాబ్రీ మసీదును ధ్వంసం చెయ్యడం, అక్కడే రామ మందిర నిర్మాణానికి పూనుకోవడం ఆ వ్యవస్థ తాలూకు విలువను కాపాడ్డమే.

ఈ 'పద్య కవితా పరిచయం'లో బేరా గారు నన్నయ మొదలు కంకంటి పాపరాజు వరకు 20 మంది కవుల కావ్యాలలోని ప్రసిద్ధ ఘట్టాలను - పద్యాలను ఉటంకిస్తూ, తన వ్యాఖ్యానాన్ని జోడిస్తూ పరిచయం చేశారు. ఆయా కవుల కవితా రీతులనూ, పద్య శిల్పాన్నీ సందర్భానుసారంగా వివరించారు. "పద్యం చదివి అర్థం చేసుకోగలిగిన అదృష్టవంతుల కోసం కాదు ఈ పుస్తకం" అని ముందుగానే చెప్పుకున్నారు. అంటే ఒక్క మాటలో చెప్పాలంటే ప్రాచీన పద్య సాహిత్యాన్ని సంక్షిప్తంగా, దిఙ్మాత్రంగా పరిచయం చెయ్యడం ఈ పుస్తకం లక్ష్యం అన్నమాట.

ఇంతవరకే అయితే ఈ పుస్తకాన్ని 'అరుణతార'లో సమీక్షించాల్సిన అవసరం లేదు. "ఇన్‌డిఫెన్స్ ఆఫ్ క్లాసికల్ పొయెట్రీ" అనే పేరుతో చేరాగారి పీఠిక కూడా ఇందులో ఉంది. ఇది ఈ పుస్తకానికి ప్రత్యేకాకర్షణ. ఇదే ఈ సమీక్షకు ప్రేరణ.

ప్రాచీన సాంప్రదాయ భావాలు గల బేరా పుస్తకానికి ఆధునిక భావాలు గల చేరా పీఠిక అవసరమైంది. నన్నాకర్షించిన వైరుధ్యం ఇదే. చేరా, బేరాల ఐక్య సంఘటన పుస్తకాన్ని చూడగానే ఆశ్చర్యాన్ని కలిగిస్తుంది వీరి ఐక్య సంఘటనకు కారణమైన సాధారణ అంశం పద్యం. పద్యం అంటే బేరా చెవి కోసుకుంటాడు. చేరా రెండు చెవులూ కోసుకుంటాడు

'పద్య కవితా పరిచయం' అచ్చయింది 1997లోనే అయినా, రచన చేసింది 1992లో అని రచయిత చెప్పుకున్నారు దీని రచనా కాలం నుండి అచ్చయిన కాలందాకా సాహిత్యరంగంలో అప్పుడప్పుడూ పద్య చర్చ జరుగుతూనే వుంది. ఒక దశలో ఉధృతంగా

జరిగింది మొత్తం మీద ఈ నేపథ్యంలోనే పద్య కవితా పరిచయాన్ని చేరాగారు రాశారు పద్య సాహిత్యాభిమానిగా ఇది ఆయనకు సహజమైన విషయం. క్లాసికల్ పొయెట్రీనీ, అందులో భాగంగా పద్యాన్నీ చేరాగారు డిఫెండ్ చెయ్యవలసి రావడమే కొంత అసహజంగా కనిపిస్తోంది అసహజమయినా ఇది సత్యం.

ఆధునికులందరూ ప్రాచీన సాహిత్యాన్ని గుడ్డిగా తిరస్కరిస్తారనీ, దాన్ని చదవక్కర్లేదని ప్రచారం చేస్తారనీ చేరాగారనుకుంటున్నట్టున్నారు. ప్రాచీన సాహిత్యాన్నే కాదు, ఏ సాహిత్యాన్నయినా గుడ్డిగా తిరస్కరించడం మార్క్సిస్టు దృక్పథం కాదు. చేరాగారే అన్నట్టు దాన్ని చరిత్రగా గ్రహించడం మార్క్సిజానికి సాధ్యమే చరిత్రగా గ్రహించడం వేరు, దాన్ని చారిత్రకంగా పరిశీలించడం వేరు, దాన్ని అభిమానించడం వేరు. చరిత్రగా గ్రహింపబడే ప్రతిదీ అభిమాన పాత్రం, ఆమోదయోగ్యం కానక్కరలేదు. కోశాంబి వంటి చరిత్రకారుడు ప్రాచీన సాహిత్యాన్ని కూడా చరిత్ర రచనకు ఒక ఆధారం (SOURCE) గా వాడుకున్నాడు. అలా వాడుకోవడం ఆయనకు చేతనయింది. అందుకే సరిగ్గా వాడుకోగలిగాడు. ఇది మార్క్సిస్టు దృక్పథంలో భాగమే.

"ఆధునికత" పెరిగి నేటి విద్యారంగంలో ప్రాచీన సాహిత్యం పాఠ్య ప్రణాళిక నుంచి తప్పు కోటం ప్రారంభించింది" అని చేరాగారు బాధపడడం మరింత ఆశ్చర్యంగా వుంది. నిన్న మొన్నటిదాకా పాఠ్య ప్రణాళికలో ఉన్నది మొత్తం ప్రాచీన సాహిత్యమే ఇటీవల కొంత ఆధునిక సాహిత్యాన్ని కూడా చేరుస్తున్నారు. అయినా ఈనాటికీ ఒక దిగంబరకవితో, ఒక విప్లవ కవితో, ఒక దళిత కవితో, ఒక స్త్రీవాద కవితో పాఠ్య ప్రనాళికలో చేరే భాగ్యానికి నోచుకోలేదు. పాఠ్యగ్రంథాలలో కనిపించే ఆధునిక కవులు విశ్వనాథ, దేవులపల్లి, పుట్టపర్తి మధునా పంతుల వగైరాలు. కాకుంటే శ్రీశ్రీ, దాశరథి, తిలక్‌లు ఇంతకుమించి పాఠ్యగ్రంథాలు ముందుకు అడుగెయ్యలేని స్థితిలోనే ఉన్నాయి.

సాంప్రదాయికులూ, ఆధునికులూ - ఇద్దరూ సంప్రదాయం సంస్కరణకు వ్యతిరేకమని భావించి పొరబడ్డారని చెప్పి చేరాగారు పొరబడుతున్నారు. అనేక సంప్రదాయాలు ఈనాటికీ నిలబడి ఉన్నాయంటే అవి ఎంతో కొంత సంస్కరణకు లోనయితేనే అది సాధ్యం. అయితే సాంప్రదాయికులు సంప్రదాయాన్ని యధాతథంగా ఉంచడానికి ప్రయత్నిస్తారు అది సాధ్యం కానప్పుడు సంస్కరణకు అంగీకరించయినా సంప్రదాయాన్ని ఏదో ఒక రూపంలో కాపాడు కోడానికి ప్రయత్నిస్తారు. సమకాలీన సమాజంలో దాని అవసరంతో, ప్రయోజనంతో వాళ్లకు పని లేదు. అలాగే ఆధునికులలో కొందరు సంప్రదాయాన్ని పూర్తిగా తిరస్కరించే వాళ్లుండొచ్చు. కొందరు సంస్కరించే వాళ్లుండొచ్చు. కొందరు సంస్కరించి వాడుకోవాలని భావించే వాళ్లుండొచ్చు. ఆధునికులుగా కనిపించే వాళ్లలో చాలామంది సంప్రదాయాన్ని యధాతథంగా అంగీకరించే వాళ్లూ లేకపోలేదు. ఉదాహరణకు ప్రాచీన సాహిత్యాన్నే తీసుకుందాం. సాంప్రదాయికులు ప్రాచీన సాహిత్యాన్ని గుడ్డిగా నమ్ముతారనీ, ఆధునికులు గుడ్డిగా ద్వేషిస్తారనీ మొత్తం పాఠకుల్ని రెండు భాగాలు చేసి ఇద్దరినీ ఒకే గాట కట్టేస్తున్నారు చేరాగారు. అంటే ఇద్దరూ వారి వారి పద్ధతుల్లో సమానంగా తప్పు చేస్తున్నారని ఆయన

అభిప్రాయంగా కనిపిస్తోంది ఇద్దరినీ సమానంగా చూడ్డం అంటేనే సాంప్రదాయికుల వైపు కాస్త ఎక్కువగా మొగ్గినట్టు అర్థం చేసుకోవచ్చు.

ప్రాచీన సాహిత్యాన్ని వ్యతిరేకించే సాంప్రదాయికులు దాదాపు ఎవరూ ఉండరు. ప్రాచీన సాహిత్యం పట్ల ఆధునికులందరిదీ ఒకే అభిప్రాయం కాదు. ఈ 'ఆధునికులు' అనేమాట వాడేటప్పుడు చాలా జాగ్రత్త తీసుకోవాలి. సాహిత్యపరంగా తీసుకున్నప్పుడు భావకవుల దగ్గర నుండి విప్లవ కవుల దాకా అందరూ ఆధునికులే. (ఈ మధ్య ఆధునికానంతర వాదులూ (Post Modernists వచ్చారనుకోండి. అది వేరే విషయం.) వీళ్లందరినీ ఒక వర్గంగా భావించి అందరికీ ఒకేరకమయిన అభిప్రాయాన్ని అంటగట్టడం సరైంది కాదు.

మరో ఉదాహరణ పద్యం. సాంప్రదాయికుల్లో దీన్ని వ్యతిరేకించేవారు లేరు. ఆధునికుల్లో వ్యతిరేకించే వాళ్లూ ఉన్నారు. సమర్థించేవాళ్లూ ఉన్నారు. వ్యతిరేకించే వాళ్లందరూ ఒక రకం కాదు. గుడ్డిగా వ్యతిరేకించేవాళ్లు కొందరుంటే ఉండవచ్చుగానీ, ఎక్కువ మంది సకారణంగా వ్యతిరేకించేవాళ్లే. నిజానికి పద్యాభిమానులు వచన కవితను సకారణంగా కాక, గుడ్డిగా ద్వేషించినట్టు కనబడుతుంది. పద్యం, వచన కవిత - రెండూ సహజీవనం చేస్తున్న కాలంలో పద్యాభిమానులైన ఆధునిక కవులు వచన కవితను గుడ్డిగా వ్యతిరేకించారు. దువ్వూరి రామిరెడ్డి వచన కవితను 'జ్యామెట్రీ కవిత' అన్నాడు. జాషువా 'తోకపీకుడు కవిత్వ' మన్నాడు. ఇంకా చాలామంది పెట్టుబడి లేని కవిత్వం అన్నారు. వీరందరూ కూడా వచన కవిత పట్ల ఈ అభిప్రాయాల్ని సకారణంగా నిరూపించలేదు. వారి పద్యాభిమానమే వచన కవితా వ్యతిరేకతకు కారణమైంది. కానీ పద్యాన్ని వ్యతిరేకించే వాళ్లలో చాలా మంది తమ తమ కారణాల్ని చూపుతున్నారు. చివరికి పద్యాన్ని వ్యతిరేకిస్తూ తిట్టు కవిత్వం రాసిన వాళ్లు కూడా అందరూ ఊరికే తిట్టలేదు. "రాముని పాదం మోసీ .. మోసీ.. / పద్యం రాముని వాసన గొడ్తోంది / మట్టి వాసన లేదు / మనిషి వాసన లేదు / మబ్బు వాసన లేదు / చెమట వాసన లేదు / చేను వాసన లేదు / ఉందల్లా కృష్ణుని వాసనే / సగం కాలిన ఆకాశం వాసన / అక్షరమై పద్యంలో ఇమిడిందెప్పుడు / సగం కరిగిన భూమివాసన / పద్యపాదాలుగా నడిచిందెపుడు" (వడ్డెబోయిన శ్రీనివాస్ : 19.1.94). ఇలా సాగుతుంది పై కవిత. ఇందులో కేవలం పద్యవ్యతిరేకత మాత్రమే లేదు. ఎందుకు వ్యతిరేకించాలో కూడా వుంది. పద్యాన్ని వ్యతిరేకిస్తూ రాసిన అన్ని కవితలూ ఇలా ఉన్నాయని కాదుగాని, కనీసం కొన్నైనా ఒక అవగాహనను కలిగించేలా ఉన్నాయనడంలో సందేహం లేదు. ఈ కవితలో కవి పద్య సాహిత్యంలో ఉన్న వస్తువు (content) ను పట్టించుకున్నాడు. జ్యామెట్రీ కవిత, తోకపీకుడు కవిత అన్నప్పుడు దువ్వూరి, జాషువా లాంటి గొప్ప గొప్ప కవులు కూడా కేవలం వచన కవిత రూపాన్ని (form) మాత్రమే తమ విమర్శకు ఆధారం చేసుకున్నారు. పద్యానుకూలురకూ, పద్య వ్యతిరేకులకూ ఉన్న ఈ తేడాను గమనించాలి.

ఇక తెలుగు ఎం ఎ. చదివినవాళ్లకు కూడా ప్రాచీన సాహిత్యంలోనూ, ఛందో వ్యాకరణాలలోనూ అధికారం వుండడం లేదనీ, వచన కవులు పద్యం, లయ, ప్రాస వంటి భావనలను అర్థం చేసుకోలేని దశలో ఉన్నారనీ, గీత పద్యానికీ కంద పద్యానికీ కూడా తేడా చెప్పలేని కవులూ, పాఠకులూ ఉన్నారనీ చేరాగారు బాధ పడుతున్నారు. అందరికీ అన్నీ తెలిసుంటే మంచిదేగానీ, మనకు తెలిసిన వన్నీ ఇతరులకూ తెలిసుండాలని ఆశించి, చివరకు నిరాశతో ఆవేదన చెందడం అనవసరం. ఆసక్తి లేకుండా తెలుగు ఎం.ఎ చదివేవాళ్లకు ప్రాచీన సాహిత్యమే కాదు ఆధునిక సాహిత్యం కూడా తెలియదు వాళ్లకు డిగ్రీ తప్ప విషయం అక్కరలేదు. ఇక వచన కవులు గదా ! వీళ్లకయినా పద్యం, లయ, ప్రాస వంటివి తెలయాలి గదా ? అనే ప్రశ్న ఉంది. వాళ్లు మంచి వచన కవిత్వం రాయగలిగినప్పుడు పద్యం, లయ, ప్రాస తెలియకపోయినా ఫరవాలేదు. పోతనకు భాష, వ్యాకరణం తెలియవనీ, అందువల్ల ఆయన కవేగాదనీ అప్పకవి అన్నా పోతన కవి కాకుండా పోలేదు. పద్యం, లయ ప్రాస అన్నవి కవులకన్నా విమర్శకులకు తెలిసుండడం అవసరం. పద్య సాహిత్యాన్నయినా చదివి అర్థం చేసుకోడానికి, పద్య నిర్మాణం, ఛందో వ్యాకరణాలూ తెలియక్కర్లేదు. సాహిత్యాభిరుచి, శబ్దార్థ పరిచయం ముఖ్యం.

చేరాగారు గతంలో రాసిన వ్యాసాల వల్లా, ఈ పీఠిక వల్లా ఒక విషయం స్పష్టమౌతోంది - ఆయనకు వచన కవిత కన్నా పద్యం పైన మక్కువ ఎక్కువ అని. ఈ పీఠికలో ఒకచోట వాచ్యంగా కూడా చేరాగారు బయటపడిపోయారు. "వచన కవిత్వపు హోరుగాలిలో పద్య కవిత్వం బాగా చేవుంటే తప్ప నిలదొక్కుకోలేకపోతున్నది" అని ఒక వాక్యం. వచన కవిత్వం హోరుగాలి వంటిదనీ, పద్య కవిత్వం మృదువైనదీ, సున్నితమైనదీ కావడం వల్ల వచన కవిత్వం ధాటికి తట్టుకోలేకపోతోందనీ పై వాక్యానికి అర్థం వస్తుంది. అంతేగాదు, వచన కవిత్వం హోరుగాలి కాకుంటే చేవలేకపోయినా పద్య కవిత్వం నిలదొక్కుకో గలిగేదనే అర్థం కూడా వస్తోంది. పై వాక్యానికి ముందున్న "విద్యాలయాల బయటకూడా పరిస్థితి ఆందోళన కరంగానే ఉంది" అనే వాక్యాన్ని కూడా కలిపి చదువుకుంటే - పద్య కవిత్వం నిలదొక్కుకోలేక పోవడం ఆందోళన కలిగించే విషయంగా చేరాగారు భావిస్తున్నట్టు తెలుస్తుంది.

కాలానుగుణంగా సమాజంలో వచ్చే మార్పుల్ని దృష్టిలో పెట్టుకోకుండా ఒక కవితా రూపం నిలబడాలని కోరుకోవడం శాస్త్రీయమైన కోరిక కాదు తెలుగు సాహిత్యంలో పద్యానికి పది శతాబ్దాల చరిత్ర ఉంది ఇలా సుదీర్ఘ కాలంపాటు పద్యంలోని వస్తువు ప్రధానంగా భూస్వామ్య వ్యవస్థతాలూకు విలువలకు సంబంధించినదే. భూస్వామ్య వ్యవస్థలో లిఖిత సంప్రదాయంలో ఉన్న కవులు రాజుల పోషణలో ఉండి కవిత్వం రాశారు. అందువల్ల రాజుల అందచందాల్ని పొగడ్డం, పరాక్రమాన్ని ప్రశంసించడం, రాజులకు కావ్యాల్ని అంకితమివ్వడం వగైరాలు కనిపిస్తాయి. ఇలాంటి రాచరిక స్వభావాన్ని సంతరించుకున్న పద్యం రాచరిక వ్యవస్థ తర్వాత కూడా కొనసాగాలని కోరుకోవడం అర్థంలేని విషయం. దానంతటది కొనసాగి ఉంటే అది వేరే విషయం.

ఒక్కోసారి దానంతటది కొనసాగినా బలవంతంగా దాన్ని ఆపి కొత్త రూపాన్ని ఆశ్రయించవలసి రావచ్చు. ఆధునిక కాలంలో భావకవితా యుగంలో కూడా గేయం సరసన పద్యం నిలబడగలిగింది. భావ కవిత్వంలోని భావాలకు గేయంతో బాటు పద్యం కూడా సరిపోయింది. అయినా ఈ రెండు రూపాలలో గేయ రూపంలో ఉన్న భావకవితలే బాగున్నాయి. ప్రసిద్ధికెక్కాయి. నండూరి ఎంకిపాటలుగానీ, విశ్వనాథ కిన్నెరసాని పాటలుగానీ, బసవరాజు అప్పారావు కోయిల పాటలుగానీ, చివరకు దేవులపల్లి స్వేచ్ఛాగానం గానీ ప్రధానమైనవన్నీ గేయ కవితలే.

"విశ్వమే పరవశమయి వెంటఁబాడ
జగము నిండ స్వేచ్ఛాగాన ఝురులనింతు"
అని దేవులపల్లి రాసిన తేటగీతి పద్యానికీ.

"దిగిరాను దిగిరాను దివి నుండి భువికి / నవ్వి పోదురుగాక నాకేటి సిగ్గు ?'
అని దేవులపల్లిగారే గేయంలా నడిపించిన ద్విపద పద్యానికీ ఉన్నతేడాను ఎవరైనా గమనించవచ్చు. ఎంకిపాటలు ఎంకి పద్యాలుగా వచ్చి ఉంటే అవి ఎంత సుందరంగా ఉండేవో కూడా ఊహించుకోవచ్చు పద్యాన్ని ఆధునిక భావాలకు కూడా వినియోగించుకోవచ్చునా లేదా అనే ప్రశ్న రాగానే వాసిరెడ్డి, సుంకరల పద్యాలూ, జాషువా పద్యాలూ, శ్రీశ్రీ పద్యాలూ గుర్తు చేస్తారు చేరాగారు. జాషువా సరే - వాసిరెడ్డి, సుంకరలూ, శ్రీశ్రీ మొదలైనవాళ్లు పద్యం ప్రబలంగా ఉన్న రోజుల్లో రచనలు చేసినవాళ్లు. ఆ ప్రభావం ఎంతో కొంత ఉండవచ్చు. అంత మాత్రం చేత వాళ్ల రచనల్లో పద్యం ప్రధానమైంది కాదు గదా ! ఆ మాట కొస్తే విప్లవకారుడూ విప్లవకవీ అయిన పాణిగ్రాహి కూడా ఒకటీ అరా పద్యాలు చెప్పాడు. వీళ్లంతా ప్రధానంగా గేయ కవులు. గేయంలో మాత్రా ఛందస్సు ఉంది పద్యంలో గణబద్ధ ఛందస్సు ఉంది. గేయ కవులు కావడం, పద్యం ఎంతో కొంత బతికున్న రోజుల్లో ఉండడం వల్ల వీళ్లూ కొన్ని పద్యాలు రాశారు. ఇక జాషువా పరిస్థితి వేరు. దళితుడు కావడం, హైందవ వ్యవస్థలో తాను, తన జాతి పొందిన అవమానాన్ని అక్షరబద్ధం చేయడం, అగ్రవర్ణ కవులలాగే తానూ పద్య రచనలో తక్కువ కాదని నిరూపించుకోవాల్సిన పరిస్థితి ఉందని భావించడం జాషువా పద్యాలు రాయడానికి ప్రధాన కారణాలు. చివరికి స్వీయ చరిత్రను కూడా పద్యాలలోనే రాసుకుని సాధారణ పాఠకులకు అందుబాటులో లేకుండా చేసుకున్నాడు. పాతికదాకా కావ్యాలు రాసిన జాషువా సాహిత్యంలో అందరూ కోట్ చేసే ప్రసిద్ధమైన పద్యాలు రెండు పాతికల కంటే ఎక్కువ ఉన్నాయా ? గేయం, వచనం చదువుకున్నంత హాయిగా జాషువా పద్యాలలో కనీసం సగం పద్యాల్ని చదువుకోగలమా ? కవిత్రయ భారతంలోని గ్రాంధిక భాషనే ఉదాహరణలుగా గ్రహించి చిన్నయసూరి రాసిన బాలవ్యాకరణానికి వ్యాఖ్యానం రాసి దాన్ని పూర్తిగా సమర్థించిన గ్రాంధిక భాషాభిమాని దువ్వూరి వెంకటరమణ శాస్త్రిగారు కూడా స్వీయ చరిత్రను మంచి వ్యావహారిక భాషలో రాసుకున్నాడు. ఈ కాలంలో ఏ రూపంలో ఏ భాషలో రాస్తే అందరూ చదువుతారో దువ్వూరి వెంకటరమణ శాస్త్రిగారు గుర్తించారు ఇవాళ వచనం, వ్యావహారిక శైలి చాలామంది పాఠకుల్ని ఆకర్షిస్తాయి,

చాలా మందికి ఉపయోగపడతాయి అంతేగాని పద్యం, గ్రాంధిక శైలి ఆకర్షించవు. ఉపయోగపడవు.

కవితా రూపాలన్నిటిలో మొట్ట మొదటిది పాట ఇది మానవశ్రమ క్రమంలో పుట్టింది. ఆదిమానవుడికి బతుకు తెరువే ఒక పోరాటం అతడు బతుకుతెరువు కోసం పడ్డ శ్రమే పాట పుట్టుకకు కారణం. కాలక్రమంలో అనేక పోరాటాలు, ఉద్యమాలు పాటను శక్తివంతంగా మార్చుకున్నాయి. ఈనాటి విప్లవోద్యమంలో కూడా పాట తన వంతు ప్రముఖ్యాపాత్రను తాను నిర్వహించింది. పాట అన్ని కాలాల్లోనూ ఇలా సజీవంగా ఉండగలదు. పాట తర్వాత ఇవాళ వచనకవితదే ప్రముఖ స్థానం. ఉద్యమ ప్రభావంలేని కవులు ప్రధానంగా వచన కవితను భావ ప్రకటన కెంచుకున్నారు. అంతేగాని ఇవాళ ఏ విధంగా చూసినా పద్యానికి చోటు లేదు. పద్యాలు రాసేవాళ్లు రాయవచ్చు. ఆ హక్కు వారికుంది. ఆ పద్యాలను చదవకుండా ఉండే హక్కు కూడా పాఠకుల కుంది. కాబట్టి పద్యానిది గత చరిత్ర మాత్రమే. వర్తమాన భవిష్యత్తులు దానికి లేవు.

అయితే ఇవాళ కూడా పద్యాలెందుకు రాస్తున్నారు ? చరిత్ర గురించి కోశాంబి చెప్పిన మాటలు దీన్నర్థం చేసుకోడానికి పనికొస్తాయి. సమాజం, మానవ జీవితం ఎంతగా మారుతున్నా, పాత సమాజం తాలూకు లక్షణాలు ఇంకా అక్కడక్కడా మిగిలి ఉండడం చరిత్రకారులకు వరం అంటాడు కోశాంబి. చరిత్రను అర్థం చేసుకోడానికి అవి బాగా ఉపయోగపడతాయని అర్థం. అంతేగాని పాత సమాజ లక్షణాలు అలాగే కొనసాగాలని కోశాంబి ఉద్దేశంకాదు. ఈనాటి మానవులు ఆదిమానవులలాగే ఉండాలనీ కాదు. ప్రాచీన సాహిత్యాన్ని చదవొచ్చు. అర్థం చేసుకోవచ్చు. ఆనందించవచ్చు. అలాగే పద్యాన్నీ. అంతేగాని ఇవాళకూడా పద్యాన్నే కవితా రూపంగా తీసుకోవాల్సిన అవసరం లేదు. పద్యాన్ని ఎవరూ బలవంతంగా చంపలేదు. దాని చావుకు అదే కారణం సాధారణంగా ఆత్మహత్యలన్నీ హత్యలే కానీ పద్యానిది మాత్రం నిజంగా ఆత్మహత్యే.

చేరాగారి పీఠికలో ఇంతవరకూ చర్చించింది ఒక భాగం. రెండో భాగంగా చెప్పుకోదగింది బేరాగారి వ్యాఖ్యానంలోని గొప్పదనాన్ని గురించిన ప్రశంస. ప్రాచీన పద్య సాహిత్యంలోని శిల్పాన్నీ, కవితా విశేషాలనూ వివరించిన బేరాగారి కృషిని గురించి చెప్పడం కోసమే అయితే చేరాగారు పీఠిక రాయవలసిన అవసరం లేదు. ఎందుకంటే బేరాగారు వ్యాఖ్యానంలో అవకాశం దొరికినచోట సాంప్రదాయిక భావాలను, భూస్వామ్య వ్యవస్థకు చెందిన విలువలనూ బహిరంగంగానే సమర్థించాడు. ఎర్రన భారతంలోని సత్యా ద్రౌపదీ సంవాద ఘట్టంలో ద్రౌపది సత్యభామకు పతివ్రతా ధర్మాన్ని ఉపదేశిస్తుంది. ఇది ఈనాటి సమాజానికి ఏ మాత్రం పనికిరాని ధర్మం. పైగా వ్యాఖ్యాత ఈ ధర్మాన్ని సమర్థించాడు. అయితే చేరాగారు ఈ విషయంలో నిర్ద్వంద్వంగా వ్యాఖ్యాతను వ్యతిరేకించాడు. వ్యాఖ్యాత పతివ్రతను స్త్రీకి పర్యాయపదం చేశారంటూనే, ఈ విషయంలో బేరాలో మార్పును ఆశిస్తాను అని చేరాగారనడం వింతలలో వింత. పాతివ్రత్య ధర్మాన్ని సమర్థించడం బేరాగారు తెలియక చేసిన పొరపాటు కాదు - మనం సలహా యివ్వగానే మార్చుకోడానికి. ఆయన భూస్వామ్య వ్యవస్థ తాలూకు విలువల్ని

నమ్ముతున్నాడు. ఏ మాత్రం అవకాశం దొరికినా దాన్ని వదిలి పెట్టడు. బేరాలో ఈ విధమైన మార్పును ఆశించడం పులికి అహింసను గురించి చెప్పడం లాంటిదే.

"చారిత్రాత్మకమైన చేరా పీరిక నుంచి. .." అనే పేరుతో చేరా పీఠికలో తనకను కూలమైన వాక్యాల్ని వెనుక అట్టపైన ప్రచురించుకున్నారు బేరాగారు. బేరాగారు నమ్ముతున్న భూస్వామ్య విలువల్ని తిరస్కరించిన చేరాగారి మాటలు అందులో లేవు ఇలా చేరాగారికి కొంత అన్యాయం జరగింది. అయితే చేరాగారికి అన్యాయం జరిగిందని నేననుకుంటున్నానేమో ! బహుశ చేరాగారికి అలా అనిపించకపోవచ్చు

భావాల, విలువల పరంగా చూస్తే చేరా బేరాలకు పొంతనే లేదు. ఇద్దరికీ పొంతన కుదిరే అంశం పద్యం ఒక్కటే. అయితే దీన్ని గురించి చేరాగారు ఈ పీరికలో ఎక్కువగా చెప్పకపోయినా ఇలా ఈ పుస్తకానికి పీరిక రాయడానికి ప్రేరణ మాత్రం పద్యాభిమానమే.

పద్య కవితా పరిచయం ద్వారా బేరా తన ఫ్యూడల్ భావాలను చాలా తెలివిగా ప్రచారం చేసుకుంటే, తన పీరిక ద్వారా చేరా దాని కుపయోగపడ్డాడు.

*(అరుణతార : జూన్ 1998)*

# వివిధ కవుల ప్రశంస సాహిత్య విమర్శకాదు

వివిధ ఆధునిక సాహిత్య వ్యాసాల సంకలనం 'వివిధ' అనే పుస్తకం వ్యాసకర్త శిఖామణి అసలు పేరు కె. సంజీవరావు. ఈ సంకలనంలో మొత్తం తొమ్మిది వ్యాసాలున్నాయి. 'శిఖామణికి చేరా స్వాగతం' అనే పేరుతో చేరా ముందు మాటలున్నాయి. ఈ సంకలనంలో ఆరు వ్యాసాలు ఇస్మాయిల్, చలం, జాషువా, రాళ్లపల్లి, భరధ్వాజల గురించే ఉన్నాయి. తక్కిన మూడూ పెద్దల కవిత్వంలో పిల్లలు అనే అంశం గురించి ఒకటి, తెలుగులో హైకూ ప్రస్తావనల గురించి మరొకటి 'అమ్మా' కవితా సంకలనానికి రాసిన పీఠిక ఇంకొకటి. ఇతర కవుల, రచయితల గురించి రాసిన వ్యాసాలకన్నా ఈ తక్కిన మూడు వ్యాసాలే కొంతవరకు బాగున్నాయి.

ఒక రచయితను లేదా కవిని అంచనా వెయ్యడానికి విమర్శకులు కొన్ని పద్ధతుల్ని పాటిస్తున్నారు. ఈ పద్ధతులు అనేక పరిమితులతో ఉంటున్నాయి. కొందరు విమర్శకులు రచయితల కళాత్మక విలువల్ని మాత్రం వివరిస్తారు. కొందరు విషయ పరిశీలనే చేస్తారు. మరికొందరు అన్నిటినీ కలగాపులగం చేసి అందరు రచయితలనూ, కవులనూ విపరీతంగా పొగుడుతారు. ఈ పొగిడే వాళ్ళలో మళ్లీ రెండు రకాలుంటారు. మార్క్సిస్టు దృక్పథం ఉన్న రచయితల్ని కూడా కలిపి పొగిడేవాళ్ళు ఒక రకమైతే, వాళ్లను తప్ప తక్కిన అన్ని రకాల రచయితలనూ పొగిడే వాళ్ళు మరో రకం. శిఖామణి ఈ చివరి రకానికి చెందిన విమర్శకుడు. శిల్పంతోబాటు ప్రధానంగా విషయ పరిశీలన చెయ్యడం సాహిత్య విమర్శ అవుతుంది.

ఇస్మాయిల్ కవిత్వం గురించి ఒక వ్యాసం, ఇస్మాయిల్ సాహిత్య విమర్శ గురించి మరో వ్యాసాం రాసిన శిఖామణి దాదాపు ఇస్మాయిల్ అభిప్రాయాలతో ఏకీభవిస్తాడు. ఇస్మాయిల్‌ను అంచనా వేసే పద్ధతితోనే ఈ విషయం స్పష్టమౌతుంది. "ఏ ఇజానికి కట్టుబడకుండా, ఏ వేదిక ఆసరా లేకుండా తెలుగులో స్వచ్ఛమైన కవిత్వం రాస్తున్న అచ్చమైన కవి ఇస్మాయిల్ అని శిఖామణి అభిప్రాయం. ఇజాలకు కట్టుబడకుండా ఉంటే స్వచ్ఛమైన కవిత్వం వస్తుందని అనడం అవగాహనలేని ప్రాథమిక స్థాయి విమర్శకు ఉదాహరణ చాలా ఇజాలే సమాజాన్ని మార్చడానికి ఉపయోగపడలేకపోయాయి. ఇక ఇజాలు అక్కరలేనివాళ్లు సమాజాన్ని ఏం మార్చగలరు ? ఎందరో తత్వవేత్తలు ప్రపంచాన్ని అనేక రకాలుగా విశ్లేషించారుగాని, ప్రపంచాన్ని మార్చడం ఎలా అని ఆలోచించలేకపోయారని మార్క్స్ అన్న మాటలు ఇక్కడ గుర్తుకు తెచ్చుకోవడం అవసరం. గతకాలపు తత్వశాస్త్రంలో ఉన్న ఈ లోపాన్ని గుర్తించగలిగాడు కాబట్టే మార్క్స్ ప్రపంచాన్ని మార్చగలిగే సిద్ధాంతాన్ని అందించాడు. మార్క్సిజం మాత్రం ప్రపంచాన్ని ఏం మార్చగలిగిందని ప్రశ్నించేవాళ్లు లేకపోలేదు. మార్క్సిజం ఆచరణపై ఆధారపడ్డ శాస్త్రం. ఆచరణే జ్ఞానానికి గీటురాయి అని చెప్పిన సిద్ధాంతం తక్కిన సిద్ధాంతాలన్నీ ఆచరణనూ, జ్ఞానాన్నీ వేరు వేరు అంశాలుగా చూశాయి. రెండింటినీ

సమన్వయించ గలిగింది మార్క్సిజం మాత్రమే సమిష్టి ఆలోచన, సమిష్టి ఆచరణ, సమిష్టి ప్రయోజనాల గురించి చెప్పిన మొట్టమొదటి సిద్ధాంతం మార్క్సిజమే ఇతర సిద్ధాంతాలన్నీ సారాంశంలో వ్యక్తి ఆలోచన, వ్యక్తి ఆచరణ, వ్యక్తి ప్రయోజనాల గురించి చెప్పినవే వ్యక్తి మోక్షాన్ని గురించి చెప్పిన ప్రాచీన కాలపు ఋషుల దగ్గర నుంచి "సాహిత్యం సామూహిక సృష్టికాదు వ్యక్తి సృష్టి" అని భావించే ఇస్మాయిల్, శిఖామణుల వంటి ఆధునికుల వరకు అందరివీ రూపాలు వేరయినా సారాంశం ఒక్కటే ఏ ఋషీ మొత్తం సమాజం కోసం తపస్సు చెయ్యలేదు. ఎవరి తపః ఫలితం ఆ వ్యక్తికే చెందుతుంది వేల సంవత్సరాల క్రితం ఉన్న ఈ అభిప్రాయమే ఈనాడూ ఇతర రూపాలలో వ్యక్తమవుతూ ఉంది.

ఉద్యమాల వల్ల కవిత్వం కానీ, కవులుకానీ ఉద్భవించరనీ, కవుల వల్లే కవిత్వమూ, ఉద్యమాలూ పుడతాయనీ ఇస్మాయిల్ నమ్మవచ్చు. ఆ అభిప్రాయాన్ని శిఖామణి సమర్థించవచ్చు. ఈ నమ్మకాలూ, ఈ సమర్థనలూ ప్రాచీనకాలపు వ్యక్తి మోక్షం కంటే భిన్నమైనవి కావు. వ్యక్తుల సమూహమే సమాజం కాబట్టి, వ్యక్తులందరూ మంచివాళ్ళైపోతే సమాజం కూడా మంచిదైపోతుందనేది దీనికి సంబంధించిన ఫిలాసఫీ. వ్యక్తులు మంచివాళ్ళు ఎలా అవుతారు ? మంచివాళ్ళంటే ఎవరు ? మంచికి నిర్వచనం ఏమిటి ? ఈ ప్రశ్నలు వ్యక్తివాదులకు ఉదయించవు. ఈ ప్రశ్నలు వేసుకుంటే వ్యక్తివాదానికి ప్రమాదం.

సమాజం వ్యక్తుల సమూహమే కాని ఆ వ్యక్తులు విడివిడి వ్యక్తులు కారు. ఏ వ్యక్తీ ఇతరులపై ఆధారపడకుండా జీవించలేడు ఏ కవీ తన అనుభవాలను మాత్రమే కవిత్వంగా రాయలేడు. సమాజంలోని అనేక మంది వ్యక్తుల అనుభవాలలోని సామాన్యాంశాన్ని గ్రహించి, తన అనుభవంతో జోడించి, సమాజ స్థితిగతుల పట్ల తనకు గల అవగాహనలో రంగరించి కవిత్వం రాస్తాడు. ఆ కవిత్వం కేవలం కవి బుర్రలోనే పుడుతుందనుకోవడం అజ్ఞానమైనా కావాలి, అవకాశవాదమైనా కావాలి ప్రకృతి, సమాజాలకు అతీతంగా వ్యక్తిగానీ, కవిగానీ, కళాకారుడుగానీ, తత్వవేత్తగానీ ఉండడు అలా ఉంటారని చెప్పేవాళ్ళు వ్యక్తివాదులవుతారు భావవాదులవుతారు ఇస్మాయిల్ అలాంటి వ్యక్తివాది, భావవాది, కవిత్వంలోనూ, సాహిత్య విమర్శలోనూ ఆయనను అనుసరించిన లేదా సమర్థించిన శిఖామణి కూడా అంతే

ఇస్మాయిల్ దృష్టిలో 'కమ్యూనిజం' అనేది వరమివ్వని వేల్పు (దేవత). ఈ వేల్పు కొలువులో శ్రీశ్రీ ఉండిపోవడం విచారకరంగా ఉందంటాడు. . కవిగా శ్రీశ్రీని (అదీ మహాప్రస్థానం వరకే) మెచ్చుకున్నా, కమ్యూనిజాన్ని చెప్పినందుకు నొచ్చుకుంటున్నాడు. 'మహాప్రస్థానం'లోకూడా 'దేశచరిత్ర'లు లాంటి గేయాలు ఉత్తమ కవిత్వం కాదని ఇస్మాయిల్ అంటే ఇలాంటి కొన్ని నిజాల్ని కుండబద్దలు కొట్టినట్టు చెప్పాడని ఆయనకు శిఖామణి సర్టిఫికేటు. 'దేశ చరిత్రలు' గేయంలో కవిత్వం చూడలేనివాడు అచ్చమైన కవి ఎలా అవుతాడో శిఖామణికే ఎరుక కాబట్టి ఈ అచ్చమైన కవులూ, స్వచ్ఛమైన విమర్శకులూ, వ్యక్తివాదులూ, అనుభూతివాదులూ అందరూ

రాజకీయాల కతీతంగా కవిత్వాన్ని చూస్తారనడం పెద్ద అబద్ధం. వాళ్ళు కమ్యూనిస్టు రాజకీయాలకు మాత్రమే అతీతంగా ఉంటారు రాజకీయాలన్నిటినీ వ్యతిరేకించినట్టు కనబడుతూ కమ్యూనిస్టు రాజకీయాల్ని మాత్రమే వ్యతిరేకిస్తారు. ఏ ఇజమూ అక్కర్లేదని పైకి చెబుతున్నా కమ్యూనిజాన్ని మాత్రమే ఆచరణలో వ్యతిరేకిస్తారు.

అభ్యుదయ, విప్లవోద్యమాలకు కలిపి చెప్పకోదగ్గ కవి మహావృక్షంలాంటివాడు ఒక్క శ్రీశ్రీయేననీ, మిగతాదంతా 'పత్ర' అనీ ఇస్మాయిల్ అంటాడు. కవులవల్లే ఉద్యమాలు వస్తాయని నమ్మిన ఇస్మాయిల్ ఉద్యమాల నుండి పుట్టిన కవుల్ని ఎలా చూడగలడు ? ఆయనకు గద్దర్ కనపడడు. వంగపండు కనబడడు. చెరబండరాజు కనబడడు. ఇంకా విప్లవ సాహిత్యాకాశంలో మెరుపుల్లా మెరిసి, బూటకపు ఎన్‌కౌంటర్లలో హత్య చేయబడ్డ ఎందరో యువకిశోరాలు కనబడరు. కవిత్వాన్ని చూసే చూపుంటే వీళ్ళందరూ కనిపిస్తారు.

శిఖామణి సాహిత్య వ్యాసాలలో మరొక లోపం ఏ కవిని గురించి రాసేటప్పుడు ఆయనను ప్రశంసలతో ముంచెత్తడం. కవికిగానీ, సాహిత్య విమర్శకుడికిగానీ సమాజం పట్ల ఒక దృక్పథం ఉండాలి. అది సిద్ధాంతం వల్ల వస్తుంది. ఆ ఒక దృక్పథం శాస్త్రీయ దృక్పథం అయితే సమాజాని కుపయోగపడే సాహిత్యాన్నీ, సాహిత్య విమర్శనూ సృష్టించగలదు. సమాజం పట్ల దృక్పథం లేనప్పుడు కవిత్వం పట్ల మాత్రం ఏ దృక్పథం ఉంటుంది ? ఈ కవిత్వం చాలా బాగుంది, ఆహా ఓహో అనే దానికి ఎవరూ సాహిత్య విమర్శకులు కానక్కరలేదు. ఆ సాహిత్య ప్రభావం సమాజంపైన ఎలా ఉందో, దాని లాభ నష్టాలెలాంటివో వివరించాలి. వాటికి గల కారణాలను అన్వేషించాలి ఇవన్నీ చేస్తేనే సాహిత్య విమర్శవల్ల కవులకూ, పాఠకులకూ ప్రయోజనం ఉంటుంది. శిఖామణి ఇస్మాయిల్‌నూ, చలాన్నీ, జాషువానీ, రాళ్లపల్లి అనంతకృష్ణశర్మనూ అందరినీ శక్తిమేరకు పొగడ్డం తప్ప, వారి సాహిత్యాన్ని విశ్లేషించలేదు. యుద్ధాలెందుకు చేస్తారో నాకర్థం కాదని ఇస్మాయిల్ అంటే అలా అన్నందుకే ఆయన గొప్ప శాంతి కాముకుడని ప్రశంసిస్తాడు శిఖామణి. చలం గురించి చెప్పేటప్పుడు జీవితాన్ని మొట్టమొదట తెలుగు వాళ్లకు చూపించిన కథకుడు చలం అని పొగుడుతాడు. కృష్ణశాస్త్రి గురించి రాసేటప్పుడు ఆయన లేని ఆధునికతను ఊహించలేమంటాడు ఇలా ఆయా కవుల దృక్పథాన్నీ, భావ పరిధినీ, పరిమితుల్నీ పట్టించుకోకుండా ఏవో నాలుగు నచ్చిన వాక్యాల ఆధారంగా ప్రశంసించడం సాహిత్య విమర్శ కానేకాదు. శిఖామణి చేసిన చాలా స్టేట్మెంట్ల గురించి ఒక్కొక్క దానిపై ఒక్కో వ్యాసం రాయవలసి ఉంటుంది. తొందర పాటుతో ఒకదానికొకటి సంబంధం లేకుండా స్టేట్మెంట్లు చెయ్యడం శిఖామణి సాహిత్య అపరిపక్వతను సూచిస్తుంది

జాషువాకి వున్న బిరుదులన్నిటిలోనూ 'నవయుగ కవి చక్రవర్తి' అనే బిరుదు నచ్చిందట శిఖామణికి ఎందుకంటే ఆయన ఒక కొత్త కవితా యుగానికి చక్రవర్తిత్వం వహించాడట. సమాజం దృష్టిలో నిమ్నవర్గానికి చెందిన జాషువా తన జీవితంలో తాను పొందిన పరాభవాల్నీ, అగ్రవర్ణ అహంకారానికి బలైన తన జీవితానుభవాల్నీ గొప్పగా

కవిత్వీకరించగలిగాడు. అంత మాత్రం చేత కొత్త కవితా యుగానికి చక్రవర్తి అనడం శాస్త్రీయమైన విశ్లేషణకాదు జాషువా పద్యం అనే కవితా రూపాన్ని ఆశ్రయించాడు అగ్రవర్ణ అహంకారాన్ని నిరసించాడు గాంధీ సిద్ధాంతాన్ని ప్రశంసించాడు ఇవేవీకొత్తయుగానికి చక్రవర్తి అనిపించుకోదగనవి కావు గొప్ప కవులందరూ నూతన కవితా యుగ చక్రవర్తులు కాలేరు. జాషువా 'ఫిరదౌసి' కావ్యంలోని భావచిత్రాల్ని పరిశీలించినపుడు జాషువా వచన కవిత్వాన్ని రాసి ఉంటే వచన కవిత్వం ఇంకెంత సంపద్వంతమౌనో కదా అని శిఖామణి ఆశిస్తాడు. వచన కవిత్వం పట్ల జాషువా అభిప్రాయం ఏమిటో శిఖామణికి తెలిసినట్టు లేదు. జాషువా వచన కవిత్వాన్ని బలంగా నిరసించాడు దాన్ని 'తోకపీకుడు కవిత్వ'మన్నాడు అందుకే స్వీయ చరిత్రను కూడా పద్యాలలోనే రాసుకున్నాడు. సాహిత్యాన్ని అంచనా వేసేటప్పుడు ఆయా రచయితల పరిమితుల్ని గ్రహించడం చాలా అవసరం

అలాగే చలం అన్వేషణ గురించి కూడా అతిశయోక్తులతో పొగడి సమర్థించడం సాహిత్య విమర్శ అనిపించుకోదు శిఖామణికి, రమణా శ్రమానికి వెళ్లకముందు చలంతోనూ అభ్యంతరం లేదు, రమణాశ్రమానికి వెళ్లాకకనిపించే చలంతోనూ అభ్యంతరం లేదు. చలం నవలల్లోనూ, కథల్లోనూ, నాటకాల్లోనూ, మ్యూజింగ్స్‌లోనూ నూతన సత్యాన్వేషణ కోసం పరితపించడం కనిపిస్తుందంటాడు "ప్రవక్త తరువాత ప్రవక్త జ్ఞాని వెంటజ్ఞాని అవతారం వెనక అవతారం ఈ రొంపిలోకి దిగివచ్చి ఘోషించారు. పాడారు, రుక్కుల్ని వినిపించారు. లాలించి వెలుగు వెదజల్లారు" అని 'సుధ'లోని చలం వాక్యాల్ని కోట్ చేసి 'తెలుగు సాహిత్యానికి చలం అలాంటి వెలుగు' అంటాడు. చలం ఏ దశలో ఏం చెప్పినా అదంతా కరక్టే అనడానికి సాహిత్య వ్యాసాలు రాయనక్కరలేదు. శిఖామణికి సమదృష్టి ఉంది అని ముందు మాటల్లో చేరా ఏ ఉద్దేశంతో అన్నారోగాని, ఒక్క మార్క్సిస్టు రచయితల్ని తప్పిస్తే తక్కిన వారందరినీ సమానంగా పొగడ్డం మాత్రం శిఖామణికి వెన్నతో పెట్టిన విద్య.

చివరగా ఒక్క విషయంలో ఇక్కడ చేరాగారిని కూడా స్పృశించక తప్పడం లేదు. నిజంగానే వైరుధ్యాల పుట్ట అయిన చలం రచనల్లో వైరుధ్యాలున్నా ఆ వైరుధ్యాల్ని పట్టించుకోని శిఖామణిని సహించిన చేరాగారు శ్రీశ్రీని రకరకాల వైరుధ్యాల పుట్ట అని అనడం. మొత్తం సాహిత్యాన్ని దృష్టిలో పెట్టుకున్నప్పుడు శ్రీశ్రీలో పరిణామం పురోగమన దిశగా కనిపిస్తుంది. ఇది వైరుధ్యం కాదు. చలంలో రమణాశ్రమానికి పోకముందే రకరకాల వైరుధ్యాలున్నాయి. చలంలో ఎక్కువగా వైరుధ్యాలుండడానికి కారణం ఆయనకు సమాజంపట్ల ఒక ప్రాపంచిక దృక్పథం లేకపోవడం శ్రీశ్రీలో వైరుధ్యాలు లేకపోవడానికి కారణం శ్రీశ్రీకి మార్క్సిజమనే ప్రాపంచిక దృక్పథం ఉండడం శ్రీశ్రీలో రకరకాల వైరుధ్యాలు ఉన్నాయని చెప్పడమే ఒక అతిశయోక్తి అయితే దానికి చేరా గారిచ్చిన ఉదాహరణ అంతకంటే దారుణం. "ఒకప్పుడు గురజాడ కవిగా మా దృష్టిలో లేడన్నాడు తరువాత మహాకవి అని నెత్తిన పెట్టుకున్నాడు" అని శ్రీశ్రీ గురించి అనడం పక్షీకరణ మాత్రమే - 1947కు పూర్వం 'నా కవిత్వం' పేరుతో శ్రీశ్రీ ఒక రేడియో

ప్రసంగం చేశాడు. అందులో 1928, 30 ప్రాంతాలలో శ్రీశ్రీ మద్రాసు క్రైస్తవ కళాశాలలో బి.ఏ. చదువుతున్న రోజులలో సాహిత్యం గురించి తన అభిప్రాయాలను చెబుతూ "కృష్ణశాస్త్రి, వేదుల మా అభిమాన కవులు హృదయేశ్వరి మా ఉద్గ్రంథం. తెలుగు కవిత్వంలో స్వర్ణయుగం ప్రవేశించిందని భారతిలో ఎవరో వ్రాసిన విమర్శలతో మేము ఏకీభవించాము. Shelley, Tagore, రాయప్రోలు, కృష్ణశాస్త్రి అదీ వరస ! రాయప్రోలు పక్కన అబ్బూరి, కృష్ణశాస్త్రి ప్రక్కన వేదుల, నండూరి ఎంకి పాటలు, విశ్వనాథ, నాయని ! వీరూ మా కవులు. బసవ రాజునీ, కవికొండలనీ కవులనడం కరుణించి. గురజాడ కవిగా మా దృష్టిలోనే లేడు. మను చరిత్ర చదివితే మహాభారతం యెందుకూ ? 1929లో నేను 'సుప్తాస్థికలు' వ్రాశాను. దానితో నాలో ఒక ఘట్టం పూర్తి అయింది. ఇంకో ఘట్టం ఇంకా ప్రారంభం కాలేదు." గురజాడ కవిగా మా దృష్టిలోనే లేడని శ్రీశ్రీ అన్న సందర్భం ఇది. సొంత మార్గం ఏర్పడకముందు, అంటే మహాప్రస్థానం రాయకముందు శ్రీశ్రీలో ఇంకా ఆ తరం యువకవుల్లో ఉన్న అభిప్రాయాలవి. అప్పుడు ఒక అవగాహన లేని దశలో అన్న మాటల్నీ, ఆ తర్వాత గురజాడ మహాకవి అన్న మాటల్ని ఒక చోట చేర్చి శ్రీశ్రీలో వైరుధ్యాలున్నాయనడం చేరాగారు చెయ్యవలసిన పని కాదు.

*(అరుణతార · ఆగస్ట్ 1998)*

# సాహిత్యాన్ని ఎలా అధ్యయనం చెయ్యాలి ?

మనకు చిన్నప్పుడు అమ్మమ్మలూ, నాయనమ్మలూ చెప్పిన ఒక చిన్న కథతో ప్రారంభిస్తాను. శివుడు ఎద్దును ఒక చాటింపు వేసి రమ్మన్నాడట - మనుషులందరూ రోజుకు ఒక్కసారి భోంచేసి, మూడుసార్లు స్నానం చెయ్యాలని. ఆ ఎద్దు పొరపాటున వ్యతిరేకంగా చాటింపు వేసింది - రోజుకు ఒక్కసారి స్నానం చేసి, మూడుసార్లు భోంచెయ్యాలని. దాంతో శివుడిక్కోపం వచ్చి, రోజుకు మూడుసార్లు తినడానికి అవసరమైన పంటల్ని పండించడానికి ఆ ఎద్దునే కష్టపడమని దానికి శిక్ష వేశాడట. ఎంత అద్భుతమైన ఊహ ! మానవుడు తాను రోజుకు మూడుసార్లు తినడానికి ఆ ఎద్దుచేసిన పొరబాటే కారణంగాని, తాను కారణం కాదని చెప్పుకోడానికి అల్లుకున్న అందమైన కథ ఇది.

మానవుడు కథలు రాయడం ప్రారంభించకముందే, కథలు చెప్పుకునే సంప్రదాయాన్ని ఎప్పుడో ప్రారంభించి ఉంటాడు.

మానవుడు స్వార్థపరుడు. తన 'జాతి స్వార్థం' మానవుడితోబాటు ఏ జీవికయినా ఉండడం ప్రకృతి సహజం. ఒక మనిషిని మరో మనిషి దోచుకోవడాన్ని దోపిడీ అనాలేగాని, స్వార్థం అనే చిన్నమాటతో తేలిగ్గా చెప్పకూడదు. పెద్ద తప్పులకు చిన్నమాటలు వాడి తప్పించుకునే తెలివితేటలు ఈనాడు మానవుడికి పుష్కలంగా ఉన్నాయి. మానవ సమాజంలో రెండు వర్గాలున్నాయని చెబుతూ కొందరు ఉన్నవాళ్ళూ, లేనివాళ్ళూ అని విభజిస్తారు. అది పైకి కనిపించే వాస్తవం మాత్రమే. కాని అసలు వాస్తవం దోచుకునేవాళ్ళూ, దోపిడీకి గురయ్యేవాళ్ళూ అని విభజించడంలో ఉంది. అప్పుడు మాత్రమే కొందరు ఎందుకు ఉన్నవాళ్ళయ్యారో మరికొందరు ఎందుకు లేనివాళ్ళయ్యారో తెలుస్తుంది.

సామాన్య మానవుడు కూడా తాను చూసిన, తాను తెలుసుకున్న ప్రతిసంఘటన పట్లా, ప్రతి విషయంపైనా తన అభిప్రాయాన్ని చెప్పకుండా ఉండడు. ఆ అభిప్రాయాన్ని కూడా అంతవరకూ తనకేర్పడి వున్న అవగాహనను బట్టే వ్యక్తం చేస్తాడు. అంటే సామాన్య మానవుడు కూడా అడుగడుగునా తన దృక్పథం నుంచే మాట్లాడుతుంటాడన్నమాట.

ఒకసారి ఒకే సంఘటన గురించి రెండు పత్రికల్లో రెండు దృక్పథాలతో ఒక వార్త అచ్చయింది. వరకట్నం ఇవ్వలేకపోవడం వల్ల పెళ్ళిపీటలపై నుంచి లేచి వెళ్ళిపోయాడు పెళ్ళికొడుకు. ఆ దారుణాన్ని సహించలేక పెళ్ళికి వచ్చినవాళ్ళలో ఒక యువకుడు అదే పెళ్ళి మండపంలో అదే పీటలపై కూర్చుని అదే ముహూర్తానికి ఆ అమ్మాయిని పెళ్ళి చేసుకున్నాడు. ఇదీ సంఘటన. ఒక పత్రిక దీన్ని 'యువకుని ఆదర్శం' అనే శీర్షికతో ప్రచురించింది. మరో పత్రిక ఆ వార్తకే 'ముహూర్తబలం' అని శీర్షిక పెట్టింది. ఇది ఆ రెండు పత్రికల దృక్పథాన్ని తెలియజేస్తుంది.

సమాజంలోని అవినీతినీ, లంచగొండితనాన్నీ చూసి ఈ సమాజం కుళ్ళిపోయిందని ఒకరనొచ్చు. ఈ రోజుల్లో లంచమివ్వకుండా పనులెట్లా అవుతయ్ ? అని మరొకరు ప్రశ్నించవచ్చు. డబ్బులు తీసుకున్నా పని బాగా చేస్తాడని ఇంకొకరు అభిప్రాయపడొచ్చు. ఇవన్నీ వారి వారి అవగాహననూ, అనుభవాన్నీ, సంస్కారాన్నీ - ఒక్కమాటలో దృక్పథాన్నీ తెలియజేస్తాయి.

రచయితకు ఒక దృక్పథం ఉంటుందని చెప్పడానికి ఇంత ఉపోద్ఘాతం కావాలా అని ఆశ్చర్యపడొచ్చు, నిజమే. రచయితలకు ఏ సిద్ధాంతమూ అక్కరలేదనేవాళ్ళు కూడా సాహిత్యలోకంలో ఉన్నారు. నిజానికి మనం ఆశ్చర్యపడాల్సింది ఇందుకు ఏ సిద్ధాంతమూ లేకుండా, ఏ విషయాన్నీ చెప్పకుండా, ఏ రచయితా ఏ రచనా చెయ్యాడు 'ఇజాలు కాదు, నిజాలు కావాలి' అంటారు కొందరు. ఇజాల కతీతంగా నిజం ఉంటుందో లేదో ఆ విషయం అలా ఉంచుదాం గాని, మానవుడు ఇజాల కతీతంగా నిజాన్నే కాదు అబద్ధాన్నీ చూడలేడు. మనిషి నడతలో, మనిషి చూపులో, మనిషి చేష్టలో, మనిషి మాటలో, మనిషి మౌనంలో ఇజం ఉంది. ఇది ముమ్మాటికీ నిజం.

రచయిత ఏ విషయాన్నైనా ఒక దృక్పథంతో చిత్రిస్తాడని అర్థమైంది. అయితే ఆ దృక్పథం ఎలాంటిదై ఉండాలి ? ఇక్కడ ఎన్నో అభిప్రాయ భేదాలుంటాయి. మనిషికి ఆకలయితే ఏం చెయ్యాలి ? బహుశ ఈ విషయంలో భిన్నాభిప్రాయాలుండవు. ఒకవేళ భిన్నాభిప్రాయం ఉంటే ఆకలి తీరదు. మానవ శరీర ధర్మం అది. అది అందరికీ ఒకే విధంగా అర్థం అవుతుంది. మానవ శరీరంలోని అవయవాలు నేను గొప్పంటే నేను గొప్పని తగాదా పెట్టుకుని, ఏది గొప్పో తేలక పని చెయ్యడం మానేసిన కథ మనకు తెలుసు. శరీర అవయవాలన్నీ పరస్పర అవగాహనతో ఉంటేనే శరీరం పనిచేస్తుంది. అలాగే సమాజమూ. అయితే సమాజంలో ఎక్కువ తక్కువ భేదాలున్నాయి. బలవంతులు, బలహీనులు అనే తేడాలున్నాయి. ఆస్తిపరులు, ఆస్తి లేనివాళ్ళు అనే అంతరాలున్నాయి. మంచి, చెడ్డ అనే విలువలున్నాయి. వర్గవ్యవస్థ అంతమయ్యేదాకా ఈ అసమానతలు పోవు. వ్యక్తిగత ఆస్తి హక్కు ఉన్నంతవరకూ ఈ అసమానత లుంటాయి.

రచయిత ఎందుకు రాస్తాడు ? తన ఆనందం కోసమా ? తన భావాల్ని ఇతరులకు చెప్పడం కోసమా ? తన ఆనందం కోసమే అయితే రాయక్కరలేదు, అచ్చెయ్యక్కర లేదు. తన మనసులోనే కవిత్వం చెప్పుకుని తనలో తాను ఆనందించొచ్చు. కానీ అలా ఎవ్వరూ ఉండరు రాసిన రామాయణాన్నే ఎందుకు రాస్తున్నారని ఎవరైనా అడిగితే, తిన్న అన్నమే ఎందుకు తింటున్నాం ? పీల్చిన గాలినే ఎందుకు పీలుస్తున్నాం ? అంటాడు విశ్వనాథ సత్యనారాయణ అయినా రామాయణంలో చిత్రింపబడ్డ జీవితం, మానవ సంస్కృతి ఆయన కిష్టమనీ, అందుకే ఆయన రామాయణాన్ని మళ్ళీ రాశాడనీ గ్రహించడం పెద్ద కష్టమేమీ కాదు. కాబట్టి ప్రతి రచయితా సమాజంకోసమే రచన చేస్తాడు.

సామాజిక స్పృహలేని రచయితలు సాధారణంగా ఎవరూ ఉండరు సామాజిక స్పృహ కేవలం మార్క్సిస్టు రచయితలకు మాత్రమే సంబంధించిందని అనుకోవడం పొరబాటు చాలామంది రచయితలు సమాజాన్ని పట్టించుకోరనడం సరైన పరిశీలన కాదు. ప్రాచీన సాహిత్యం కూడా సమాజం ఎలా ఉండాలో తన పద్ధతిలో తాను చెప్పింది చాలామంది రచయితలు నిజంగానే సమాజాన్ని పట్టించుకోకుండా రచనలు చేసి ఉంటే బహుశ సమాజం ఇంతగా చెడిపోయేది కాదేమో !

పాఠకులు రచయితని అర్థం చేసుకోడానికి ప్రయత్నించినట్టే, రచ యితలు కూడా సమాజాన్ని అర్ధం చేసుకోడానికి ప్రయత్నించాలి. అర్థం చేసుకోవడం అంటే ప్రజల కష్టాల్ని చూసి బాధపడడం కాదు, సానుభూతిని ప్రదర్శించడం కాదు, అయ్యోపాపం అనడం కాదు, నాలుగు కన్నీటిబొట్లు రాల్చడమూ కాదు పేదలకు సేవచేస్తూ అదే నిజమైన పరిష్కారం అనుకోవడమూ కాదు ప్రజలు తమ సమస్యల్ని తాము పరిష్కరించుకునే దిశలో వెళ్ళడానికి అవసరమైన చైతన్యాన్ని కలిగించడమే సాహిత్యం చెయ్యాల్సిన పని. ఒక పేదవాడికి కేజీ చేపలు తెచ్చివ్వడం కంటే ఒక చేపను పట్టడం నేర్పడం మంచిదని చైనా సామెత. ఇటీవల 'జన్మభూమి' కార్యక్రమంలో భాగంగా అధ్యాపకులూ, విద్యార్థులూ గ్రామాలకు వెళ్ళి క్లీన్ అండ్ గ్రీన్ పనిలో పాల్గొని వస్తే, నెలరోజుల తర్వాత ఆ గ్రామానికి చెందిన ఒకతనికి ఈ అధ్యాపకుడు కనిపిస్తే 'మళ్ళీ ఎప్పుడొస్తారు సార్' అనడిగాడట !

స్త్రీ పురుషుల మధ్య వున్న ఆర్థిక అసమానతను గూర్చి ఒక రచయిత ఒక చిన్న కథలో అద్భుతంగా చెప్పాడు. కూలి చేసుకొని బతికే ఒక స్త్రీ ప్రతిరోజూ కూలికి వెళ్లి ఆడకూలి తీసుకుంటూ ఉంది. మగకూలి కంటె ఆడకూలి తక్కువ ఒక రోజామె బస్సెక్కింది. కండక్టరు తనకు ఆడ టిక్కెట్టివ్వకుండా మగటిక్కెట్టే ఇచ్చాడు కూలిలో ఆడా మగా తేడా ఉన్నప్పుడు బస్సు టిక్కెట్టులో ఆ తేడా ఎందుకు లేదని ఆ స్త్రీ అమాయకంగానే అడిగింది పని చేయించుకోవడంలో సమానత్వం, ఫలితం యివ్వడంలో అసమానత్వం. ఖర్చు పెట్టే చోట సమానత్వం, సంపాదించే చోట అసమానత్వం. ఈ వైరుధ్యమే సంఘర్షణకు దారి తీస్తుంది. ఈ అసమానత్వమే పోరాటానికి కారణమవుతుంది. ఇదే మానవజాతి చరిత్ర క్రమం. అందుకే "పరస్పరం సంఘర్షించిన శక్తులలో చరిత్ర పుట్టెను" అన్నాడు శ్రీశ్రీ.

సమానత్వాన్ని కోరుకునే వాళ్లు జంతువుల్ని కూడా మానవులతో సమానంగా చూడాలి గదా అని చలం ఒకచోట ప్రశ్నిస్తాడు. నిజమే. జంతువుల్ని తమతో సమానంగా చూసే ముందు మానవులు సాటి మానవుల్ని సమానంగా చూడడం నేర్చుకోవాలి. సగభాగమైన స్త్రీలను సమానంగా చూడడం నేర్చుకోవాలి. కొందరు మనుషుల్ని అంటరానివాళ్లుగా చూడడం మానుకోవాలి. మానవుల మధ్య అసమానతలు పోకుండా జంతువుల్ని ప్రేమగా చూడ్డం సాధ్యం కాదు. పెంపుడు కుక్కకు బిస్కెట్లు పెట్టి వీధి కుక్కను తరిమి కొట్టడం జంతువులపై ప్రేమ చూపడం కాదు. అసలు విషయం

ఏమిటంటే కమ్యూనిస్టులు చెప్పే సమానత్వం సాధ్యం కాదని చెప్పడానికి చలం వేసిన ప్రశ్న ఇది.

సామాజిక స్పృహ ఎంతో కొంత అందరు రచయితల్లో ఉన్నా, మానవ జాతి చరిత్ర క్రమాన్ని గుర్తించగలిగిన రచయితలే సామాజిక చైతన్యంతో రచనలు చెయ్యగలరు కాలం మారే కొద్దీ ఒకప్పుడు వ్యతిరేకించిన సమాజమే కొన్ని విలువల్ని గుర్తిస్తుంది. ఒకప్పుడు స్త్రీకి విద్య అనవసరం అని భావించిన స్థితి ఉంది. ఇవాళ ఆ స్థితి లేదు. మనిషికి తిండి అవసరమా అని చర్చించడం ఎంత అర్థరహితమో, ఇవాళ స్త్రీకి విద్య అవసరమా అని చర్చించడం అంతే అర్థరహితం సమాజం ఇలా ఒక విలువను గుర్తించడం వెనుక ఎన్నో పోరాటాలుంటాయి, ఎంతో మంది కృషి ఉంటుంది. ఇలా ప్రాచీన కాలం నుంచీ సమాజం దశలు దశలుగా ఎదుగుతూ వస్తోంది. "గతకాలము మేలు వచ్చు కాలము కంటెన్'' అన్న అభిప్రాయంనుంచి 'మంచి గతమున కొంచెమేనోయ్'' అన్న అభిప్రాయానికి రావడానికి తెలుగు సమాజానికి తొమ్మిది శతాబ్దాలు పట్టింది.

అన్నీ వేదాల్లో ఉన్నాయని సంతృప్తి చెందడం, భగవద్గీతను పారాయణం చెయ్యడం, రామాయణాన్ని పూజించడం - ఇలాంటి ధోరణుల వల్ల ఆ సాహిత్యం సాహిత్యం కాకుండా పోతోంది. వేదాలు గానీ, రామాయణ భారతాలు గానీ, పురాణాలు గానీ ఈ దేశంలో పుట్టిన సాహిత్యం ప్రాచీన భారత దేశపు స్థితిగతుల్ని ఎంతో కొంత మేరకు చిత్రించిన సాహిత్యం. ప్రాచీన భారతదేశ చరిత్ర రచనకు ఇతర ఆధారాలతో బాటు ప్రాచీన సాహిత్యాన్ని కూడా ఒక ముఖ్య ఆధారంగా అద్భుతంగా వినియోగించుకున్నాడు సుప్రసిద్ధ ఆధునిక చరిత్ర కారుడు డి.డి. కోశాంబి.

రామాయణంలో రాముణ్ణి ఒక పాత్రగా గాక దేవుడిగా చూస్తే అప్పుడు రామాయణం సాహిత్యం కాలేదు, మనం సాహిత్య పాఠకులమూ కాలేము. పురాణాలలో చిత్రింపబడ్డ అద్భుత శక్తుల్ని, మహిమల్ని పక్కనబెట్టి వాటిని పరిశీలించాలి కోశాంబి ఇచ్చిన ఒక ఉదాహరణ గుర్తు చేస్తాను పరశురాముడి కథ మనందరికీ తెలుసు. పరశురాముడు బ్రాహ్మణ వర్ణంలో పుట్టినా శస్త్రాస్త్ర విద్యలు నేర్చాడు ఆయుధం పట్టాడు. రాజులందర్నీ ఇరవయ్యొక్క సార్లు నరికి పారేశాడు. ఇదీ కథ. ఎంత మొనగాడికయినా ఆచరణలో ఇది సాధ్యం కాదని తెలుసు. ఈ కథ ఎందుకు పుట్టింది ? దాని నేపథ్యం ఏమిటి ? వర్ణ వ్యవస్థ ప్రకారం శస్త్రాస్త్ర విద్యలునేర్వడం క్షత్రియధర్మం. మరి పరశురాముడు బ్రాహ్మణుడై వుండి వేద విద్యలతో సరిపెట్టుకోక ధనుర్విద్యను ఎందుకు నేర్చుకున్నాడు ? రాజులందర్నీ ఇరవయ్యొక్క సార్లు ఎందుకు చంపాడు ? ప్రాచీన భారతదేశంలో బ్రాహ్మణులూ, క్షత్రియులూ అగ్రవర్ణాలు అప్పటికే వ్యవసాయం ప్రారంభమైంది. పంటలు పండి మిగులు ఉత్పత్తి వస్తోంది. దీన్ని పంచుకోవడంలో అగ్రవర్ణాలైన బ్రాహ్మణులకూ, క్షత్రియులకూ మధ్య ఏర్పడ్డ తగాదాలే పరశురాముడి కథ సృష్టికి కారణం అంటాడు కోశాంబి. అధికారం రూపంలో భౌతికశక్తి క్షత్రియుల

చేతిలో ఉంది బ్రాహ్మణులకు సమాజంలో గౌరవం ఉంది. బ్రాహ్మణులు మంత్రాలు చదివితే తప్ప రాజుల అధికారం ఖరారు కాదు. అధికారం వచ్చాక రాజుల అహంకారానికి తిరుగు లేదు. ఇద్దరి మధ్య తగాదా వస్తే క్షత్రియులదే పైచేయి అవుతుంది. చివరకు క్షత్రియుల మాట బ్రాహ్మణులు వినక తప్పదు బలవంతుడు కొడితే బలహీనుడు మనసులో తిట్టుకుంటాడు. ఆ విధంగాతృప్తి పడతాడు. అలా పరశురాముడి పాత్ర ద్వారా బ్రాహ్మణులు క్షత్రియులపై కసి తీర్చుకున్న అనుభూతిని పొంది ఉంటారు

ఇంకో ఉదాహరణ. రామాయణ భారతాల వల్ల ప్రాచీన భారత సమాజంలో వచ్చిన ఒక ముఖ్యమైన పరిణామాన్ని తెలుసుకోవచ్చు. మానవుల మధ్య ఉన్న సంబంధాలలో ఆస్తి సంబంధం ప్రధానమైంది అది ముఖ్యం కాదని మనం ఎంత చెప్పుకున్నా సమాజాన్ని నడిపిస్తున్న ఒక ప్రధాన చోదక శక్తి అది. ఆస్తి పుట్టినప్పటి నుండి ఆస్తి సంబంధాలు ఈ సుదీర్ఘ కాలక్రమంలో మారుతూనే వస్తున్నాయి. రామాయణ కాలంలో తండ్రి ఆస్తిపై పెద్ద కుమారుడికే హక్కుండేది. అందుకే దశరధుడి రాజ్యంపై రాముడికే అధికారం దక్కింది. లక్ష్మణ భరత శత్రుఘ్నులు రాముడి అధికారాన్ని ప్రశ్నించలేదు. భారత కాలం వచ్చేసరికి ఈ విషయంలో కొంత మార్పు వచ్చింది అన్నదమ్ముల బిడ్డలు పాండవులూ, కౌరవులూ రాజ్యాన్ని పంచుకున్నారు. రాజ్యంపై అన్నదమ్ములైన ధృతరాష్ట్రుడికీ పాండురాజుకీ ఇద్దరికీ హక్కున్నదని పాండవుల అభిప్రాయం ధృతరాష్ట్రుడికే హక్కున్నదని కౌరవుల అభిప్రాయం. ఈ రెండు అభిప్రాయాల మధ్య ఘర్షణే మహాభారతం. ఒకప్పుడు పెద్ద కుమారుడికే ఉన్న ఆస్తి హక్కు కాలక్రమంలో కొడుకులందరికీ సమానంగా వర్తించింది. ఇవాల్టికి స్త్రీల ఆస్తి హక్కును కూడా గుర్తిస్తున్నాం అంటే కొడుకులతో పాటు కూతుళ్లకూ, ఆస్తి హక్కుండాలనే విషయాన్ని గ్రహించాం ఇలా ఆస్తి హక్కులో వచ్చిన పరిణామాన్ని ఆయా కాలాల సాహిత్యం ప్రతిబింబిస్తుంది. ఈనాటి ప్రజాస్వామ్య వ్యవస్థ ఆస్తి హక్కుపై నియంత్రణ పెట్టాలని ప్రయత్నించింది, ఓట్ల కోసమైనా సరే. ల్యాండ్ సీలింగ్ చట్టం దాని ఫలితమే. మార్క్స్ చెప్పిన దాని ప్రకారం సోషలిస్టు వ్యవస్థ కొంతమేరకు వ్యక్తిగత ఆస్తిని అంగీకరిస్తుంది గాని, ఆస్తిని పెంచుకునే అవకాశాన్ని రద్దు చేస్తుంది. మార్క్స్ ఊహించిన ఉన్నతమైన కమ్యూనిస్టు వ్యవస్థలో అసలు ఆస్తి హక్కే రద్దవుతుంది. ఇలా అర్థం చేసుకున్నప్పుడు రామాయణ కాలం నుండి ఆస్తి హక్కులో వచ్చిన మార్పులు అభివృద్ధికరమైనవే అని తెలుస్తుంది. అందుకే 'మంచి గతమున కొంచెమే' నన్నాడు గురజాడ.

రావణాసురుడు సీతను అపహరించి కొంత కాలం పాటు తన అధీనంలో ఉంచుకున్నా, ఆమె 'శీలాన్ని' దోచుకోలేదు. అయినా అతన్ని రాక్షసుడిగా చిత్రించారు. ఈ రోజుల్లో కూడా అంతమంచి రాక్షసులుంటే ఎంత బావుణ్ణు ! ఒక సాధారణ మానవుడు కూడా ఈ విషయంలో రావణాసురుడి కంటే భయంకరంగా ప్రవర్తిస్తున్నాడు. మరి ఈ లెక్కన చూస్తే 'గతకాలము మేలు' కాదా ? కాదు. ముమ్మాటికీ కాదు ప్రాచీన మానవుడు

అమాయకుడు. ఈనాటి మానవుడికున్నంత తెలివి తేటలు, లౌక్యం లేవు. తెలివితేటలు పెరిగే కొద్దీ లౌక్యం పెరుగుతుంది, మోసం పెరుగుతుంది. ఈనాటి రావణాసురుడు సీతను తన ఇంటికి తీసుకెళ్లడు. రాముడు లేని సమయం చూసి సీతను సీత ఇంట్లోనే చెరిచి వస్తాడు కోర్టు కెక్కుతుందనుకుంటే చంపి కూడా వస్తాడు. ఇన్ని తెలివితేటలు ఆనాటి రావణాసురుడికి లేవు మంచికుపయోగించినా, చెడ్డకుపయోగించినా శతాబ్దాల క్రమంలో మానవుడి తెలివి తేటలు పెరుగుతున్నాయనే వాస్తవాన్ని మనం గుర్తించాలి. రామాయణ కాలం నుండీ ఈనాటి వరకు కొనసాగుతున్నది వర్గ వ్యవస్థే. అంటే దోచుకునే వర్గం, దోచుకోబడే వర్గం ఉన్న వ్యవస్థ. కాకుంటే దోపిడీ రూపాలు మారాయి. వర్గాల స్వరూపం మారింది. వ్యక్తిగత ఆస్తి రద్దయ్యేంత వరకు దోపిడీ రూపాలు మారుతుంటాయే గాని దోపిడీ పోదు. అందుకే వర్గాలు లేని వ్యవస్థ కావాలని, పోరాటం ద్వారానైనా సరే దాన్ని సాధించాలని మార్క్సిజం చెబుతుంది. ఈనాటి విప్లవ సాహిత్య లక్ష్యం కూడా ఇదే

విప్లవ సాహిత్యంలో గొప్ప కవులెవరున్నారు ? ఇది సాధారణంగా మనకు వినిపించే ప్రశ్న. శ్రీశ్రీ తర్వాత చెప్పుకోదగ్గ మార్క్సిస్టు కవులెవరున్నారు ? ఇదీ చాలా కాలంగా వినిపిస్తున్న ప్రశ్నే. నక్సల్బరీ శ్రీ కాకుళ పోరాటాలు సృష్టించిన విప్లవ వాగ్గేయకారుడు గద్దర్ ఉన్నాడు గదా అంటే గద్దర్ తర్వాత ఇంకెవరున్నారు అంటారు. 1930 లలో శ్రీశ్రీ గానీ శ్రీ కాకుళ పోరాట కాలంలో పాణిగ్రాహి సుబ్బారావు గానీ, ఆ తర్వాత చెరబండరాజు గద్దర్‌లు గానీ అనితర సాధ్యంగా కవిత్వం చెప్పిన వాళ్ళే. ఆయా కాలాల్లో విప్లవ చైతన్యాన్ని కలిగించిన వాళ్ళే. అనేకమంది కవులకు మార్గదర్శకులుగా నిలిచిన వాళ్ళే. విప్లవాన్నీ, విప్లవ సాహిత్యాన్నీ ఇష్టపడని వాళ్లు సాధారణంగా పై ప్రశ్నలు వేస్తుంటారు. ఆ ప్రశ్నలలో ఏదైనా ఔచిత్యం ఉంటే దాన్ని గ్రహిస్తూనే ఆ ప్రశ్నలు వేసే వాళ్ల ఉద్దేశాలు కూడా గమనిస్తే తప్ప ఆ ప్రశ్నలకు సరైన సమాధానం దొరకదు ప్రాచీన కాలంలో కూడా సాహిత్యాన్ని నన్నయలూ, తిక్కనలూ, పోతనలూ, పెద్దనలూ మొదలైన ప్రతిష్ఠ గల కవులలోనే మనం చూస్తున్నాం తప్ప ఇతర ప్రజా సాహిత్యాన్ని చూడగలిగే శక్తి ఇంకా మనకు రావలసే ఉంది. ప్రజల జీవితమూ,సామాజిక విలువలూ కొంతవరకైనా కనిపించే జానపద పాటలను గానీ, శతక సాహిత్యాన్ని గానీ, జీవితాన్నీ ఆపోశన పట్టినట్టుకనిపించే ప్రజల సామెతలను గానీ మనం సాహిత్యంగా చూడ్డం లేదు. సాహిత్యాన్ని అర్థం చేసుకునే పద్ధతిలో ఈ అశాస్త్రీయమైన వారసత్వమే ఇంకా మనల్ని పట్టి పీడిస్తున్నందు వల్ల సాహిత్యంలో కూడా వ్యక్తి పూజ (Hero worship) ప్రాధాన్యం వహిస్తోంది. అందువల్లనే విప్లవ సాహిత్య యుగంలో కూడా కొద్దిమంది మహాకవులనే గుర్తిస్తాం తప్ప మొత్తం విప్లవ కవిత్వాన్నీ దాని ప్రభావాన్ని గుర్తించలేకపోతున్నాం. భారతదేశంలో విప్లవోద్యమం విషయంలో ఆంధ్రప్రదేశ్‌దే అగ్రస్థానం. విప్లవ కవిత్వం విషయంలో కూడా తెలుగులో వచ్చిన కవిత్వాన్నే మొదట చెప్పుకోవలసి వస్తుంది విప్లవ కవిత్వం తొలిదశలో కొందరు వ్యక్తుల్లోనే ఉన్నట్టు

కనిపించినా, విప్లవోద్యమం విస్తరించే క్రమంలో విప్లవ కవిత్వం కూడా విస్తరణ స్వభావాన్ని సంతరించుకుంటుంది. ఇవాళ గొప్ప కవిత్వం కొద్ది మంది వ్యక్తులకే పరిమితం కాదు. అనామకంగా ఉండిపోతున్న ఎందరో కవులు గొప్ప కవిత్వాన్ని చెప్పిన వాళ్లున్నారు, చెప్తున్న వాళ్లున్నారు.

ఈ ఆస్తి నాది అనుకున్నట్టు గానే, ఈ కవిత్వం నాది అనుకునే వ్యవస్థలోనే ఉన్నాం గదా ? కాబట్టి కవిత్వాన్ని వ్యక్తుల పరంగాచూసే దృష్టి అంత సులభంగా పోదు. వ్యక్తుల వద్ద పోగుపడివున్న ఆస్తిని మందికి విస్తరింప జెయ్యడమే ఆస్తి విషయంలో నిజమైన ప్రజాస్వామికీకరణ. అలాగే కవిత్వం కూడా కొద్దిమంది వ్యక్తులలోనే కేంద్రీకృతం కాకుండా అనేక మందిలో విస్తరించడం, దాన్ని మనం గుర్తించగలగడం కవిత్వంలో ప్రజాస్వామికీకరణ. కాబట్టి సాహిత్యాన్ని అధ్యయనం చేసేపద్ధతుల్ని శాస్త్రీయంగా, హేతుబద్ధంగా రూపొందించుకోవలసిన అవసరం ఎంతైనా ఉంది.

*(రచనా కాలం · 10.3.2000, D.T.F. సావనీర్ - మే 2000)*